

ప్రపంచ మహావ్యక్తుల శ్రేణికి చెందిన మిసెస్ ఎలియనార్ రూజ్వెల్టు అమోఘ ప్రతిభగల సంఘ సేవాపరాయణురాలు. ఆమె కీర్తిశేషుడైన రూజ్వెల్టు భార్య. ప్రపంచ క్షేమానికై అహోరాత్రులు కృషిచేస్తున్న రూజ్వెల్టు సతీమణి, ఐక్యరాజ్యసమితిలో అమెరికా ప్రతినిధురాలుగా సభ్యులందరిచేత అత్యంత ప్రశంస పొందినది

# ఈ పుస్తకం గురించి

నిజంగా ఈ పుస్తకం ముందుముందు జరుగబోవు వివిధ ప్రజల కలయికనుగురించి నా భర్తకున్న కోరికలు, తను కన్న కలలు నాకు వినిపించే సమయంలో ప్రారంభమైంది. ప్రపంచంలోని ప్రజలందరూ ఒకటిగా కలిసిమెలసి తమ అంతర్జాతీయ సంఘ నిర్మాణ కార్యక్రమంలో పని చేయడాన్నిగురించే అతను ఎప్పుడూ మాటలాడేవాడు. ఎందుకంటే అతనికి ప్రజలపై ప్రేమ, నమ్మకం ఉండేవి.

చాలామార్లు, ఇందులో కథలు వచ్చినట్లు, నేనూ అతనివలె ఆ యువతీ యువకుల కథలు విని ఆనందించాలనుకున్నాను. ఒక కథలో ఆర్టురో పాలకోసం కలిగిన ఇబ్బంది తొలగిపోయినందుకు అతనెంతో ఆనందించి ఉండేవాడు. కిరియా అనే పడుచుపిల్ల చిన్నపిల్లల బొమ్మరిల్లును కాలితో తన్నడంచూచి ఆమెయొక్క ఆగ్రహాన్ని అతడు అర్థం చేసికొని ఉండేవాడు. అత్త అయిన కూవోను, ఆమె పెంచే పిల్లలను చూచి అతను ఎన్నోమార్లు తనలో తాను నవ్వుకొని ఉండేవాడు. ఫ్రాంక్ అనువాడు మంచుగడ్డల్లో దొర్లి జారిపోవడంలో పొందే సంతోషాన్ని చూచి అతనికి ఒక ప్రత్యేకమైన సొంత భావం కలిగి ఉండేది.

ఉత్తరాలలోని కథలు, యుద్ధభూమి సమాచారాలు, యు. యన్. రేడియో ఉదారబుద్ధితో ఇచ్చిన వ్రాత ప్రతులు, విషయాలు, ముఖాముఖిగా మాటలాడుటకు అవకాశాలు — వీటన్నిటిలో ముఖ్యమైన వాటిని ఏరు కోవడం నాకు, హెలెన్ ఫెరిస్‌కు చాలా కష్టమని పించింది. మేము వాటినన్నిటినికూడా కలిపివేయా లనుకున్నాం కాని, ఒక్క పుస్తకంలో అంతపని చేయడం చాలా కష్టమైనపని అని, యు. యన్. పనిచేసే ముఖ్య సూత్రాల ప్రకారం, యువతీ యువకులు వారియొక్క ఐక్యరాజ్యములు పాల్గొను ఆ గొప్ప కృషిలోని కొన్ని ముఖ్య విషయాలను మాత్రం ఏరుకున్నాం.

మాకు ఈ కథలు, విషయాలు తెల్పినవారికి, తాము యు. యన్. లో ఎలా పని చేస్తున్నారో అన్నది విపులంగా చెప్పినవారికి, తమ యత్నాన్ని నిలబెట్టు కుంటున్న యువతీ యువకులకు మేము చాలా కృతజ్ఞులం.

హైడ్ పార్క్, న్యూయార్క్,
ఆగస్టు, 1950.

ఎలియనార్ రూజ్వెల్ట్.

17,



# విషయసూచిక

పుట

# యువతీ యువకులకు హామీ

ఐక్యరాజ్యప్రజలలో యువతీ యువకులు చాలా ముఖ్యులు. 1945 వ సంవత్సరం జూన్ నెల 26 వ తేదీన శాన్‌ఫ్రాన్‌సిస్కో నగరంలోచేరిన 50 దేశాల ప్రతినిధులు ఐక్యరాజ్య సమితి నిర్మాణ పత్రంలో చేవ్రాళ్లు చేసే సందర్భాన "ఇక ముందు తరాల వారికి యుద్ధ పిశాచంయొక్క భయం లేకుండా చేయడాన్నికై మేమంతా నిశ్చయించుకున్నాము" అని పీఠికలో తమ హామీ యిచ్చారు.

భావితరాలవారికి స్వర్గంలాంటి ప్రపంచాన్ని నిర్మించడం ఐక్యరాజ్యాలు చేసే పనులలో ముఖ్యమైంది. ఐక్యరాజ్య సంఘాలు ప్రపంచపు మూల మూలలా తిరిగి పడుచువారికి, పసిపిల్లలకు తగిన ఆహారం, ఆరోగ్యం, చదువు, సంతోషం కలిగించడానికై చాలా ప్రభుత్వాలతో కలిసి పనిచేస్తాయి. ఆ యా దేశాలలోని యువతీ యువకులంతా ఐక్య ప్రజాసంఘంలో భాగస్వాములుగా ఉంటారు. ఐక్య ప్రజాసంఘాలు ఏర్పరచే సభల్లో పాల్గొని ఒక జాతి యువతీయువకులు ఇంకో జాతివారిని కలసికొని వారితో సద్భావ, సామరస్యాలను పెంపొందించుకుంటారు.

ఆ జూన్ నెల 26 వ తేదీనాడు శాన్‌ఫ్రాన్‌సిస్కో నగరంలోచేరిన ప్రతినిధులు యువతీ యువకులకు సంబంధించిన ఇంకొక ప్రత్యేక ముఖ్యకార్యక్రమం తాము అమలు పరచాలని గుర్తించారు. రెండో ప్రపంచ యుద్ధం మూలంగా నాశనమైన దేశాలలో పిల్లలు, యువకులు, యువతులు, తిండీ గుడ్డ, మందూ మాకు, ఇల్లూ పెళ్ళూ లేక అల్లాడసాగారు. పోరాటం మూలంగా ఇండ్లనుండి తరుమబడిన చాలమంది ప్రజలు దిక్కులేని పిట్టలవలె తిరుగాడుతూ, గుహాలలోపల, పాడుపడిన మొండి గోడల మధ్య, కాలిపోయిన రైలు పెట్టెలలో, మంచునుండి, వాననుండి తప్పించుకొని తలదాచుకొనేందుకు అనువైన స్థలాల్లో దూరుకొన్నారు. చాలమంది సంబంధంలేక చెట్టుకొకరు పుట్టకొకరుగా వేరైపోయారు. చెల్లాచెదరు కాకుండా ఉండగలిగిన కుటుంబాలు చాలా అదృష్టవంతమైన వని చెప్పొచ్చు.

ఐక్యరాజ్యసమితి క్రొత్తగా స్థాపించబడినప్పటికీ, ఈ దుస్థితులను తొలగించడానికై అది అమోఘంగా పాటుపడింది.

హానా స్ప్రైవా అనే బాలికసంగతి చూద్దాం.

హానా మూడు ఏండ్ల పసిగందు. నీలిరంగు కండ్లు, పసుపురంగు వెంట్రుకలు, చక్కని శరీరకాంతి కలిగి

అల్లారు ముద్దుగా తన తల్లిదండ్రులతో చెకోస్లో వేకియాలో లిడిస్ అనే గ్రామంలో ఉండేది. 1942 వ సంవత్సరం జూన్ నెలలో ఒకనాడు తెల్లవారుజామున 5 గంటలకు పెద్ద మోటారు ట్రక్కులు ఆ ఊరిలోకి జొరబడ్డాయి. వాటిలో వచ్చిన నాజీలు హానాతోపాటు ఆమె తల్లిదండ్రులను, తక్కిన ఊరివారినీ బయటకు నడవమన్నారు. తర్వాత హానా తండ్రిని, మిగిలిన మగవారిని, పదహైదు సంవత్సరాలకు పైబడ్డ యువకులను వారి పొట్టన పెట్టుకున్నారు. హానా తల్లిని బానిస శిబిరానికి పోయే ట్రక్కులోకి తోశారు.

ఇతర తొంభై మంది పిల్లలను ఎక్కించిన ట్రక్కులో హానానుకూడా లాక్కుపోయారు. నాజీలు లిడిస్ గ్రామాన్ని దగ్ధం చేశారు. తమ ఉద్యోగస్థుడైన యస్. యస్. జనరల్ హేడ్రిచ్ చెకోస్లోవేకియాలో చంపబడి నందుకుగాను తాము లిడిస్‌ను అలా చేశామని ఆ నాజీలు చెప్పారు. తాము దండెత్తు దేశాలలో జనులు ఎవ్వరైనా ఎదురు తిరిగితే వారి గతికూడా లిడిస్‌వలె అవుతుందని ఆ రక్కసులు అరచారు. కాని ఇంకెప్పుడూ ఈ నాగరిక ప్రపంచంలో అలాంటి ఘోరకార్యం జరుగకూడదని ఆ లిడిస్ గ్రామ సంఘటన మనకు జ్ఞాపకం చేస్తుంది. ఆ నాజీలు హానాను ఎక్కడికి తీసుకుపోయారు ?

ఆయిదు సంవత్సరాలు గడచాయి. యుద్ధం అయిపోయింది. జర్మనీ దేశంలోని ఎస్లింజన్ నగరంలో ఒక పాత పిండి మిల్లులో ఉన్న కాగితాల కట్టలను కొందరు స్త్రీ పురుషులు వెదకుతున్నారు. వారు ఐక్యరాజ్య సమితికి సంబంధించిన అంతర్జాతీయ పరిశోధక సంఘంలోని సభ్యులు. వారు హానా జాడ తెలిసే పత్రం కోసం వెదకుతున్నారు. బందిఖానాలో క్రమ్మగినప్పటికీ చావకుండా బ్రతికియున్న హానా తల్లి తన కుమార్తెను తనకు తెచ్చిఇవ్వమని వారిని కోరింది.

నాజీలు బలాత్కారంగా ఎత్తుకుపోయిన చెక్ పిల్లల బొమ్మల పుస్తకాన్ని చెక్ ప్రభుత్వం తయారుచేసింది. ఆ పుస్తకంలో వారికి హానా బొమ్మ కనబడింది. ఆ బిడ్డ అందానికి వారు చాలా ఆశ్చర్యపడ్డారు. ఇప్పుడామె ఎనిమిదేండ్ల బాలిక. ఎవ్వరూ గుర్తుపట్టనంత మార్పు ఆమెలో వచ్చిందేమో? ఆమె బ్రతికి ఉంటేగదా?

ఆ పత్రాల కట్టలలోనుండి హానాకు సంబంధించిన ఒక ప్రత్యేక కార్డును తీశారు. యుద్ధం ముగిసిన వెంటనే ఒక పరిశోధక సంఘం సభ్యులు లిడిస్ పల్లె పిల్లలకై వెదకినప్పుడు హానాను గురించి తెలుసుకొన్న విషయాలు ఆ కార్డుమీద వ్రాశారు. పిల్లలతో నింపబడ్డ ఆ ట్రక్కులు మొదట లిడిస్‌నుండి ప్రాగ్ నగరానికి, ఆ

తర్వాత పోలెండ్‌లోని లాడ్జ్‌నకు వెళ్ళాయి. లాడ్జ్‌లోని ఒక శిబిరంలో ఆ పిల్లలంతా ఏ యే జాతికి చెందినవారో పరీక్షించబడ్డారు.

ఉత్తమంగాతోచిన పిల్లలను ప్రత్యేక నాజీ పోషణాలయాలకు పంపేవారు. అక్కడ వారిని నాజీలుగా మార్చి, నెమ్మదిగా పెద్ద నాజీ ఉద్యోగస్థుల ఇండ్లలో పెంపకానికి పంపేవారు. వారు ఆ పెంపుడు తల్లి దండ్రులకు పుట్టినట్లు దొంగ పత్రాలు కల్పించేవారు. అట్టి ప్రతి పోషణాలయంలో (లెబన్స్‌బార్న్) కూడా బాల బాలికలకు జీవిత భీమాను ఏర్పాటు చేసేవారు.

హానాయొక్క కార్డునుబట్టి ఆమెను ఏమి చేశారో తెలిసింది. ఒక లెబెన్స్‌బార్న్ పోషణాలయంలో పని చేసిన ఇద్దరు దాదుల మూలంగా లిడిన్ గ్రామపు పిల్లలంతా లాడ్జ్‌కి తీసుకుపోబడ్డారని తెలుసుకున్నారు. లాడ్జ్‌లోని పత్రాల మూలాన హానాతో పాటు ఇంకో పదకొండుమంది కూడా ఆ విధంగా పంపబడ్డారని తేలింది. జీవిత భీమా కాగితాలు ఆ విషయాన్ని బలపరచాయి. ఆ తొంభై మంది పిల్లలలోను నాజీలు పన్నెండుమందిని మాత్రమే ఏరుకున్నారు. తక్కిన వారినిగురించి ఏ జాడా తెలియలేదు.

హానా కార్డుమీద ఆ విషయాలు మాత్రమే కనిపించాయి. ఆ నీలిరంగు కండ్లతో, పసుపురంగు వెంట్రుకలతో, ఆరోగ్యంగా, శక్తివంతంగా, చలాకిగా ఉన్న హానాను నాజీలు ఏరుకొన్నారు. మొదట వెదకినవారు ఒక్కొక్క ఆధారాన్ని పట్టుకొని వెదకారు గాని కడకు ఆమె ఎక్కడ ఉందో తెలుసుకోలేక పోయారు. ఎక్కడో ఆమె దత్తత పత్రాలు ఉన్నాయని వారికి నమ్మకం కలిగింది. హానా ప్రాణంతో ఉందని వారికి ధైర్యం వచ్చింది. కాని, ఎక్కడుందో ?

కొంత కాలం తర్వాత, ఫ్రాంక్‌ఫర్ట్ నగరంలోని ఒక ఉద్యోగస్థుని వద్దనుండి ఒక పెద్ద తంతి వచ్చిందని ఎస్లింజన్ పట్టణంలోనివారికి హానా తల్లి ద్వారా తెలిసింది. ఆ ఉద్యోగస్థుడు తానున్న గ్రామంలో ఒక దత్త పుత్రిక ఉందని, ఆమె చెక్ బాలిక అయివుంటుందని తెలిపాడు. వెంటనే చెక్ మంత్రులు ఆ సమాచారాన్ని ఎస్లింజన్ నగరంలోని వారికి తెలియపరచారు. మరుక్షణమే ఒక పరిశోధకసంఘం ఆ గ్రామానికి వెళ్ళింది కాని, ఆ గ్రామంలో ఎట్టి దత్త పుత్రిక గాని, ఆ తంతి ఇచ్చిన మనిషిగాని లేరని తేలింది.

అంతమాత్రంచేత వారు హానాను వెతకడం మాన లేదు. ఆ తంతి ఇచ్చిన మనిషి ఫ్రాంక్‌ఫర్ట్ నగరంలో



ఉంటాడని వారు అక్కడికి వెళ్ళారు. కాని తిరిగి నిరాశే అయింది.

వారు తమ పని మాత్రం మానలేదు. వీలైనన్ని మార్గాల ద్వారా అన్వేషణ జరిపి, ఫ్రాంక్ ఫర్ట్‌లో ఆ తంతి పంపిన మనిషిని పట్టుకోవాలని ప్రయత్నించారు. కడకు ఒక బాలిక వారితో తనకు ఆ మనిషిని తెలుసునని చెప్పింది. అచ్చటికి కొంత దూరంలో ఉన్న గ్రామంలో అతడున్నాడని చెప్పింది. వారు వెంటనే తమ కారులో వెళ్ళారు. కాని, అక్కడకూడా అతడు కనిపించలేదు.

కాని, అచ్చట కోర్టులో పనిచేసే ఒకడు చనిపోయిన ఒక నాజీ ఉద్యోగస్థుని భార్య దగ్గర ఒక దత్త పుత్రిక ఉందని, ఆ పిల్ల వయస్సు 8 సంవత్సరాలు ఉండవచ్చునని, తాను ఆమె తాలూకు దత్త పత్రాలు తేగలనని చెప్పాడు.

అతను తెచ్చిన పత్రాలు ఆ పరిశోధకులు ఆత్రంతో చూచారు. అవి హానా స్ప్రైవా జాడ తెల్పే పత్రాలే! వాటిమీద ఆ బాలిక పేరు హానా స్ప్రేట్ అని మార్చబడి ఉంది. కాని, దానితోకూడా ఉన్న ఇంకో కార్డుపై ఆమె నిజమైన పూర్తి పేరు కనబడింది. ఈ విధంగా చిట్ట చివరకు హానా జాడ దొరికింది.

కాని ఆ దినమే వారు హానా ఉన్న ఇంటికి పోలేదు. వారు ఫ్రాంక్‌ఫర్ట్‌కు పోయి హానాను ఆమె తల్లి దగ్గరకు తీసుకు పోవడానికై పోలీసుల ఉత్తరువు తీసికొని మరునాడు పల్లెకు వచ్చి ఆ వితంతువు ఇంటికి వెళ్ళారు.

నీవు జర్మన్ బాలికవుకాదు, చెక్ బాలికవని చెబితే హానా ఏమంటుందో అని వారు అనుకున్నారు. అటువంటి మాటలను నమ్మజాలని కొందరు పిల్లలు అక్కడ ఆడు కొంటున్నారు. వారిలో హానాకూడా ఉన్నదా?

హానా తన సొంత కూతురని వాదిస్తున్న ఆ వితంతువును లెక్క చేయకుండా వారు హానాను తెమ్మని గద్దించారు. ఆమె హానాను తీసుకు రాగానే వారు ఆమెను గుర్తు పట్టగలిగారు. వారిలో ఒకడు హానాకు తెలిసిన జర్మను భాషలో "మీ అమ్మ ఈమెకాదు. మీ సొంత అమ్మ నీకోసం కనిపెట్టుకొని వుంది" అని చెప్పాడు.

ఆ మాటలు విని హానా "నా వస్తువులన్నీ మూట కట్టు" అని ఆ వితంతువుతో చెప్పింది. ఆమె మూట తేగానే "ఇందులో అన్నీ ఉన్నాయా?" అంది. అంతే.

కారు కదిలింది. వెంటనే హానా తన తల్లినిగూర్చి ప్రశ్నపై ప్రశ్న వేయసాగింది. ఆమె "అమ్మా నేను నీ దగ్గరికి వచ్చేశాను" అని చెక్ భాషలో చెప్పడానికి ప్రయత్నించింది.

వారు మొదట ఫ్రాంక్ ఫర్టు నగరంలో ఆగారు. అక్కడ కొంతకాలం హానా ఐక్యరాజ్యాలకు సంబంధించిన అంతర్జాతీయ శరణార్థుల శిబిరంలో నివసించింది. ఆ శిబిరానికి ఇతర పరిశోధక సంఘాలుకూడా చెక్ దేశపు బాలబాలికలను తెచ్చి చేరుస్తున్నాయి. అచ్చట చేరిన 66 మంది చెక్ బాలబాలికలను రక్షణశాఖవారు రెండు ప్రత్యేక రైలు బండ్లపై ప్రాగ్ నగరానికి పంపించారు. అక్కడనుండి వారి వారి తలిదండ్రుల దగ్గరికి పంపే ఏర్పాట్లు జరిగాయి. హానా తల్లి తన ముద్దు కూతురుకై ప్రాగ్ రైలు స్టేషన్లో కనిపెట్టుకు కూర్చుంది. ఆ తల్లి ఆనందంతో తన బిడ్డను కౌగలించుకొనడం చూచిన ప్రతివాడు ఆ దృశ్యాన్ని ఎన్నటికీ మరచి పోలేడు.

హానా బాలికను కనుగొన్న పరిశోధకుల సంఘం ఐక్యరాజ్య సమితికి సంబంధించిన అంతర్జాతీయ శరణార్థుల సంఘంలో ఒక భాగం. 1946 వ సంవత్సరం వరకూ శరణార్థులుగా ఉండిన లక్షలాది యువతీ

యువకులకు, పసి పిల్లలకు, స్త్రీ పురుషులకు తగిన సదుపాయాలను ఈ సంఘంద్వారా ఐక్యరాజ్య సంస్థ కలిగించగలిగింది.

ఐరోపా ఖండంలో 1945 వ సంవత్సరం మే నెలలో రెండవ ప్రపంచ యుద్ధం పూర్తయ్యే సరికి శరణార్థుల సంఖ్య 80 లక్షలకు పైగా పెరిగింది. నాజీల నిర్బంధ శిబిరాలలో వేలాదివేలుగా ఉన్న అభాగ్యులు, నిలవ నీడలేక ఎక్కడపడితే అక్కడ తిరుగుతున్న వేలాది నిరాశ్రయులు, ఎట్టి రక్షణలేని వేలాది దిక్కుమాలిన వారు స్వస్థలాలను ఎంతత్వరగా చేరుకోగలమా అని ఆరాట పడుతున్నారు. జర్మనీ, హంగరీలలో పరిస్థితి ఈ విధంగా ఉంది.

సేవాదళాలు, రెడ్ క్రాస్ సంఘాలు, ఇంకా యిలాంటి వందలకొలది స్వచ్ఛంద సేవక సంఘాలు ఎన్నో తక్షణమే వారి సహాయార్థం పనిచేశాయి. ఐక్యరాజ్య నిర్మాణ పత్రంలో చేవ్రాలు చేయకపోయినప్పటికీ, అందుకై పనిచేస్తున్న వివిధ దేశప్రజలంతా చేరి ఐక్యరాజ్య సంస్థ ఏర్పడునంతవరకూ పనిచేయడానికై యు. యన్. ఆర్. ఆర్. ఎ. అనే ఐక్యరాజ్య శరణార్థుల పునరుద్ధరణ సంఘాన్ని స్థాపించారు.

జర్మను సైనికులు నివసించే స్థలాలు, భోజనశాలలు, ఆటస్థలాలు, అనేక ప్రభుత్వ భవనాలు మొదలై వాటిలో శరణార్థుల భోజన సదుపాయాలు చెయ్యబడ్డాయి. కాని అవి అంత చక్కగా లేవు. తాత్కాలికంగా కావలసిన శిబిరాలు కూడా నిర్మించారు. మొట్టమొదట వారికి ఇచ్చిన ఆహారం ప్రాణాలు నిల్పుకోడానికి తగ్గదే కాని పుష్టికరమైంది కాదు. కాని వారికి అవసరమైన ఆహారం, స్థలం లభించాయి.

తరువాత, ఆ 80 లక్షలమంది శరణార్థులలో ఎంత మందికి తమ సొంతయిండ్లకు పోవాలని ఉందో తెలిసికొనేందుకు ఐక్యరాజ్య పునరుద్ధరణ సంఘం ప్రారంభించింది. దాదాపు 65 లక్షలమంది వెళ్ళిపోతామన్నారు. రైలురోడ్లు రిపేరు చేయకపోయినప్పటికీ, వంతెనలు కూలిపోయినవి కూలిపోయినట్లే ఉండినప్పటికీ, కొద్ది రైళ్లు మాత్రమే పని చేయగలిగి ఉన్నప్పటికీ వారి వారి ఇంటి ప్రయాణాలు చురుకుగా సాగాయి. 1946 వ సంవత్సరం ఆఖరుకు దాదాపు అందరి ప్రయాణాలు పూర్తయ్యాయి.

మిగిలిన 10 లక్షలకు పైబడ్డవారంతా యుద్ధానికి పూర్వం తాముండిన ప్రదేశాల్లో నివసించడానికి ఇష్టపడలేదు. వారికి తగువసతి కల్పించడానికై ఐక్యరాజ్యాలు శాన్‌ఫ్రాన్సిస్కోలో కలిసికొన్నాయి. కాని, కార

ణాంతరాలచేత కొలది కాలానికే యు. యన్. ఆర్. ఆర్. ఎ. ను (ఐక్యరాజ్య పునరుద్ధరణ సంఘం) ముగించి వేశారు. మరి ఆ శరణార్థులకు తగు కొత్త యిండ్లను ఇప్పుడు కట్టేది ఎవ్వరు? యుద్ధ సమయంలో చిందర వందరగా పోయిన స్త్రీ పురుషులను ఇప్పుడు ఒక్కటిగా ఎవరు చేరుస్తారు? తప్పి పోయిన పడుచువారిని, పిల్లలను ఇప్పుడు ఎవరు వెదకి తీసుకు వస్తారు? మేం ఎక్కడికి పోవాలి అని ఎదురు చూస్తున్న శరణార్థులకు కావలసిన అన్న వస్త్రాలను ఇప్పుడు ఎవరు ఏర్పాటు చేస్తారు?

వీటన్నిటినీ ఆలోచించి ఐక్యరాజ్య సమితి సభ్యులు అంతర్జాతీయ శరణార్థుల సంఘాన్ని స్థాపించారు. శరణార్థులలో ఎవ్వరినికూడా వారికి ఇష్టంలేని చోట్లకు పొమ్మని నిర్బంధించకూడదని ఐక్యరాజ్య సమితి తీర్మానించింది. రెండు సంవత్సరాలవరకూ అంతర్జాతీయ శరణార్థుల సంఘం 18 దేశాల ప్రభుత్వాలు ఇచ్చిన ధనంతో తన కార్యక్రమం నడిపించాలి.

విలియం హోలమ్ టక్ అనే ప్రముఖ అమెరికా ఇంజనీరు అంతర్జాతీయ శరణార్థుల సంఘ సర్వకార్య నిర్వాహకుడుగా నియమించబడ్డాడు. వేలకొలది స్త్రీ పురుషులు ఆ అంతర్జాతీయ శరణార్థుల సంఘంలో పని చేయడానికి పూనుకొన్నారు. ఆ సంఘం మూడు

ఏళ్ళలోపల చేయవలసిన కార్యక్రమం చాల పెద్దది. శరణార్థులకు దాదాపు ఏడువందల శరణాలయాలను నిర్మించవలసి వుంది. ఐదు ఖండాలలోని 25 దేశాలనుండి వివిధ సామగ్రి తేవలసి వుంది. ఆరోగ్యశాఖాధికారులు, వైద్యులు, నర్సులు ఏలాటి అంటువ్యాధులు వ్యాపించ కుండా పాటు పడవలసివుంది. శరణార్థులకు వేరువేరు దేశాలలో ఇండ్లు నిర్మింపబడి వెంటనే వారిని శాంతి యుతంగా ఆ యా ప్రదేశాలకు చేర్చవలసి వుంది. ఒకే సమయాన 36 నౌకలు బయలుదేరవలసి వుంది. ఆ యా దేశాలలో పెద్దలకు, పిన్నలకు, యువకులకు, యువతులకు పాఠశాలలు నిర్మించవలసి వుంది.

అంతర్జాతీయ శరణార్థుల సంఘంలోని 40 దేశాల ప్రతినిధులు అన్యోన్య సహకారంతో అష్టకష్టాలను ఎదుర్కొని పని చేయవలసి వుంది.ఇన్ని కష్టా లున్నప్పటికీ, వారు తమ పనులను చక్కగా నిర్వర్తించారు.

ఆ శరణార్థులుకూడా ప్రపంచంలోని ఇతర ప్రదేశా లకు పోయి తమ శక్తి కొలది పాటు పడ్డారు. వారిలో ఎక్కువమంది తమకోసం సేవ చేస్తున్నవారికి సహాయం చేశారు. ఆ సంఘం తరఫున వారంతా పలు పట్టణాల్లో రక్షణ చర్యలు తీసుకున్నారు. ఆ శరణార్థులలోని

వైద్యులు తీరిక లేకుండా తిరుగుతూ ఆస్పత్రులలోని రోగులను కాపాడసాగారు. కొయ్య పనివారు ఇండ్లు కట్టడానికి పూనుకొన్నారు. వంటవారు వంటలుచేశారు. దర్జీవారు గుడ్డలుకుట్టారు.

ఇంకా ఆ శరణార్థులలోని ఉపాధ్యాయులు పాఠశాలల్లో పనిచేశారు. మొదట ఆ పాఠశాలలన్నీ తగిన పుస్తకాలు, సామగ్రి లేక హీనస్థితిలో ఉన్నాయి. చాల మంది ఉపాధ్యాయులు రాత్రుల్లో మేలుకొని తమ జ్ఞాపకశక్తిని ఉపయోగించి మరునాటికి కావలసిన విషయాలను వ్రాసి పెట్టేరు. కాని, కొద్ది కాలంలోనే అంతా సద్దుకున్నారు. భూగోళం, చరిత్ర, లెక్కలు తక్కిన విషయాలు చక్కగా బోధించే వీలుకలిగింది. యంత్రాలు, మోటార్లు రేడియోలు ఇలాంటివి తయారుచేసి నడిపించే విధానం బోధించారు. గుడ్డలు కుట్టడం, వ్యవసాయం చేయడం ఇలాంటి వృత్తులుకూడా సాగించారు. పెద్దవారికికూడా ఇలాంటివి నేర్పించారు. అన్ని కేంద్రాలూ కలిసి ఓ పెద్ద ప్రజాకూటంయొక్క పాఠశాలలా పని చేశాయి. పలు దేశాలనుండి ఉపాధ్యాయులు వచ్చి చెప్పినవి అందరూ చక్కగా విని నేర్చుకున్నారు.

ప్రతి శరణార్థికి ఒక కార్డును ప్రత్యేకించారు. అతని భావి జీవితానికి పనికివచ్చే సమాచారాలను అందులో వ్రాశారు. ఒక బాలికకు పాటపాడే శక్తి ఉంటే ఆ విషయాన్ని ఆమె కార్డులో వ్రాశారు. ఒక బాలునికి యంత్రాలపై మోజుంటే ఆ విషయాన్ని అతని కార్డులో వ్రాశారు. పడుచువారి భావిజీవితానికి సంబంధించిన కోరికలనుకూడా వారి వారి కార్డులలో వ్రాశారు. వారి వారి అభిలాష ప్రకారం పోషిస్తేనే వారికి ఆనందం కలుగుతుందని వారు గుర్తించారు.

నాలుగు వేలమంది పడుచువారికి ప్రత్యేక కేంద్రాలు నిర్మింపబడ్డాయి. అచ్చటికి తేబడ్డ బాల బాలికలకు తాము తమ స్నేహితులమధ్య ఉన్నామన్న సంగతే తెలిసేదికాదు. జీవితంలో సుఖాన్ని ఎరుగకపోవడంచేత వారలా మారిపోయారు.

ఒక కేంద్రంలోని పది పదకొండు సంవత్సరాల పిల్లలైతే ఒకరినొకరు అనుమానిస్తూ, అసహ్యించు కుంటూ ఉండేవారు. నాజీలయొక్క బందీలుగా ఉండినా రని వారి భుజాలమీద మచ్చలు తెలిపేవి.

అంతర్జాతీయ శరణార్థుల సంఘంలోని ఒక ఆమె ఆ పిల్లల నాయకుడి దగ్గరకుపోయి ఇక్కడ మీ ఇష్టం వచ్చినట్లు ఆనందంగా ఆడుకోవచ్చునని చెప్పింది.

ఆ నాయకుడు తనవారి దగ్గరికిపోయి కొద్ది నిమిషాలలో తిరిగివచ్చి మా ఇష్టం వచ్చినట్లు ఆడుకో వచ్చునసేనా నీవు చెప్పింది అని అడిగాడు.

ఆమె "అవును. ఒకరినొకరు కొట్టుకోకుండా ఆడుకోండి" అన్నది.

మరుక్షణంలోనే ఆ పిల్లలంతా పిచ్చి ఎత్తిన వారిలా అరుస్తూ, ఎగురుతూ పరుగెత్త సాగారు. మరునటి రోజున కూడా వారు అలానే ఆడుకుంటున్నారు. ఐనా, సంఘసేవకులు వారిని ఏమీ అడ్డగించలేదు. కడకు వారికే విసుగువేసి అలసిపోయిన తర్వాత, తాము మంచి చోట్లో ఉన్నామని, అందరూ స్నేహితులమేనని గుర్తించారు.

జర్మనీ దేశంలోని బ్రిటిష్ వారి కేంద్రంలో 60 మంది పడుచువారు ఒక ప్రత్యేక పట్టణాన్ని నిర్మించుకొని, తమలో తామే అధికారులను ఎన్నుకొని ప్రభుత్వాన్ని సాగించారు. అవసరమైన పనులన్నీ వారే చేసుకున్నారు. వారే స్వయంగా ఆటలు, నాటకాలు, వాయిద్యాలు, వినోదాలు నడుపుకున్నారు. తమ కుటుంబంలో సర్దుకో వలసిన విషయాలు నేర్చుకొనుటకై బాలికలు, బాలురు ప్రత్యేకమైన స్కూళ్లకు పోయేవారు.

అన్ని శిబిరాల్లోను, కేంద్రాలలోను చాలా చురుకుగా పనిచేశారు. వంట ఇండ్లలో, వైద్యశాలల్లో వారు చాలా సాయపడ్డారు. తాము చేయగల ప్రతి పనిలోను ప్రముఖ పాత్ర తీసికొన్నారు. వారు తమకు తామే జట్టులను ఏర్పరచుకొన్నారు.

వై. యం. సి. ఏ., వై. డబ్ల్యు. సి. ఎ. లాంటి పెక్కు అంతర్జాతీయ యువజన సంఘాలు శరణార్థుల సహాయార్థమై చాలమంది స్త్రీ పురుషులను పంపించాయి. బాల బాలికల సంఘంవారుకూడా పనిచేశారు. అంతర్జాతీయ బాలభట సంస్థ చేసిన పని, తక్కిన ఇతర సంస్థలు చేసిన పనికి చక్కని నిదర్శనం. చాలా దేశాల నుండి వెళ్ళిన బాలభటులు శరణార్థుల కేంద్రాలలో చాలా మెచ్చుకోదగ్గంతగా పని చేశారు.

జె. ఆర్. మోనెట్ అనే అనుభవశాలియైన బాలభట నాయకుడు అంతర్జాతీయ సంస్థ ద్వారా పని చేస్తున్న బాలభటులకు సహాయపడడానికీ, కొత్తవారిని తయారుచేయడానికీ వచ్చాడు. అతనిక్రింద చాలామంది క్రొత్త బాలభటులు, క్రొత్త బాలభట నాయకులు తయారయారు. వారంతాకూడా మీటింగులు పెట్టుకొని, ఎండాకాలంలో వేరుచోట్లకు పోతూ, ఈదుతూ,

కొయ్యపని చేస్తూ, ఆనందంగా ఆడుతూ, పాడుతూ, సేవజేస్తూ కాలంగడిపారు.

పడుచువారు ఎక్కడ ఉన్నప్పటికిన్నీ వారిలో పరిశోధక శక్తి కలవారు కొంతమంది ఉండేవారు. అట్టివారిలో హైడల్‌బర్గ్‌లో ఐక్యరాజ్య శరణార్థుల సంఘంలో ఉన్న 13 ఏండ్ల పోలిష్ బాలిక ఒకతె. ఒక దినం ఆమె కనబడలేదు. కొంతకాలం తర్వాత తన పెద్ద అత్త అయిన ఒక ముసలామెతో తిరిగి వచ్చింది. ఆ బాలిక తాను ఎక్కడికి పోయిందీ, తాను ఎట్లా ఆ ముసలామెను కనిపెట్టగలిగిందీ చెప్పదు. ఆ ముసలామె కూడా ఆ విషయంబయటపెట్టదు. ఇలా ఆమె అప్పుడప్పుడు మాయమైపోయి తన ఏడుగురు బంధువులను కనిపెట్టగలిగింది.

ఈ పరిశోధన విషయాలకంతా జర్మనీ దేశంలోని అరోల్‌సన్ నగరంలో ఉన్న అంతర్జాతీయ పరిశోధక సంఘం ముఖ్య కేంద్రం. కనబడకుండా పోయిన 60 లక్షలమంది సమాచారాలు అచ్చటి పత్రాలద్వారా తెలుసుకోవచ్చును. ఎస్లింజన్ పట్టణంలోని బాలాన్వేషక సంఘంకూడా ఆ అంతర్జాతీయ పరిశోధక సంఘంలోని భాగమే.

బాలాన్వేషక సంఘంవారు రహస్యాలు కనిపెట్టినట్లు ఏ పరిశోధకుడూ కనిపెట్టలేడు. ఒక కేంద్రంలోని వార్డు తన పేరుగాని, ఊరుగాని చెప్పలేని ఒక చిన్న బాలికను చూచారు. ఆ బాలిక తలిదండ్రులు ఎవరైనావుంటే గుర్తు పట్టగలరని ఆమె ఫోటోను పత్రికలకు పంపించారు. నిజంగానే ఒక దారాలు పేనేవాడు "నేనూ నా భార్యా కూడా ఆ బాలిక మా కుమార్తె అనుకుంటున్నాము" అని జాబు వ్రాశాడు.

ఒక దారాలు పేనేవాడు—అయితే, ఆ అమ్మాయి తన తండ్రిని దారాలు పేనే సమయంలో చూచిందా? ఇప్పుడు ఎవరైనా దారాలు పేనేవాణ్ణి చూస్తే గుర్తుకు తెచ్చుకుంటుందేమో? పరీక్షించడం చాలా మంచిదని పరిశోధక సంఘంవారు భావించారు. వెంటనే ఆ సంఘంలోని ఒకడు ఒక దారాలు పేనేవాణ్ణి పిలుచుకు వచ్చాడు. వాడు ఆమెకు తాడు పేనడం నేర్పించాడు. వెంటనే ఆమె తన సామాన్లతో ఆడుకుంటున్న పిల్లల ముందు కూర్చుంది. ఆ పిల్లలంతా ఆట మానేసి ఆమె ఏమిచేస్తుందో చూడాలని చుట్టూ చేరారు.

కాని, ఆ అమ్మాయి 'మా నాన్న కూడా అదిచేస్తాడు' అని అరుస్తూ పరుగెత్తింది. ఇంకేం నిజంగా ఆమె డ్రూసీయే! వారి కుమార్తెయే!

అంతర్జాతీయ పరిశోధక సంఘంవారు స్విడ్జర్‌లాండ్ దేశంలో కొందరు ఫ్రెంచి దేశపు పిల్లలు తలదాచుకున్న ఒక పల్లెలో అడాల్ఫ్ రషీద్ జె—అనే పిల్లవాణ్ణి చూచారు. అతని చెప్పులు అరిగిపోయాయి; అతని బట్టలు చినిగిపోయాయి. అతని జేబీలలో ఏలాటి కాగితాలూ లేవు. వాని మెడలో కట్టబడిన బిళ్ళమీద మాత్రం అడాల్ఫ్ రషీద్ జె—అనే పేరు, వాడు పుట్టిన తేదీ వేసి ఉన్నాయి. కాని, వాడు ఎక్కడివాడో?

ఆ బాలునితోపాటు ఉన్న మిగతా పిల్లలకు మాత్రం తాము ఎవరో, ఎక్కడనుంచి వచ్చారో తెలుసు. కాని, వారిలో ఎవరికిగాని ఆ బాలుడు తమతో ఎక్కడ ఎప్పుడు కలశాడో తెలియదు. అతడు మాతో ఎట్లాగో చేరాడు, అని మాత్రమే వారు చెప్పారు. ఆ బాలుడు కూడా తన అమ్మా, నాన్న ఎవరో, తన ఇల్లు ఎక్కడుందో చెప్పలేక పోయాడు.

పరిశోధక సంఘంవారికి రషీద్ అనే పేరు కొంచెం వింతగా తోచింది. అతను పుట్టిన ఊరి పేరునుబట్టి అతనికా పేరు పెట్టి ఉంటారేమో అని ఊహించారు. అందుకని వారు దేశపటాల పుస్తకాలన్నీ వెదికారు. కాని, రషీద్ అనే ఊరు వారికి కనిపించలేదు.

ఒకనాడు పిల్లలంతా కలసి పడవల విషయం మాట్లాడుకుంటున్న సమయంలో ఆ బాలుడు మా అమ్మ, నాన్న, నేను పడవలో ఉండేవాళ్ళ మని చెప్పాడు.

ఆ విషయమన్నా అతడు ఎక్కడి వాడో చెబుతుందా ? అవును, ముమ్మాటికీ చెబుతుంది. ఏదైనా ఒక పడవలో తమకు బిడ్డ పుట్టినట్లయితే ఆ బిడ్డకు పడవపేరు పెట్టడం ఇంగ్లీషువారి ఆచారం. వెంటనే పరిశోధక సంఘంవారు నావలకు సంబంధించిన పత్రాలన్నీ వెతికి యుద్ధానికి ముందు రషీద్ అనే పేరు గల ఒక బ్రిటిష్‌వారి ఓడ మధ్యధరా సముద్రంలో ప్రయాణం చేస్తున్నదని కనిపెట్టారు. ఆ తర్వాత సిడ్జర్లాండు దేశంలోని బ్రిటిష్ రాయబారి మూలంగా అడాల్ఫ రషీద్ జె పుట్టిన తేదీ వివరాలు వెతికించారు. అందులో ఆ బాలుని పేరు, అతని తల్లిదండ్రుల పేర్లు కనిపించాయి. ఇంకేం!

ఆ సమాచారాన్ని రషీదు జె కు చెప్పగా అతను ఎంతో సంతోషించాడు. అందరు పిల్లలవలె అతడూ ఒక ప్రదేశానికి సంబంధించిన వాడే. బ్రిటిష్‌వారి పడవలో పుట్టడంచేత అతడుకూడా ఒక బ్రిటిష్‌వాడే.

తల్లిదండ్రులు కనుపించని బాలుడు అడాల్ఫ్‌కు ఈనాడు ఇంగ్లండులో ఒక చక్కని ఇల్లుకూడా ఉంది.

పరిశోధక సంఘాలు రహస్యాలను కనిపెడుతూంటే శరణార్థుల సంఘంవారు ఆ శరణార్థులకై వివిధ దేశాలలో ఇండ్లను సమకూర్చేవారు. శరణార్థులలో ఉపాధ్యాయులు, సీసపు పనివారు, వైద్యులు, కొయ్య పనివారు, ఇంజనీర్లు, రైతులు, చిత్రకారులు, అడవి ఉద్యోగులు, రచయితలు, బట్టల పనివారు, ఇంటి పనివారు ఇంకా చాలమంది పనివారు ఉన్నారని ఆ శరణార్థుల సంఘంవారు వివిధ దేశాల ప్రభుత్వాలకు తెలియ పరచారు.

వెంటనే వివిధ ప్రభుత్వాలవారు ఆ శరణార్థులను రమ్మని ఆహ్వానాలు పంపించారు. కొన్ని ఆహ్వానాలు పనితనం కలవారికి మాత్రమే వచ్చాయి. సకుటుంబంగా రావలసిందని కొందరికి వచ్చాయి. మరికొన్ని పెద్ద గుంపులుగా రమ్మన్నాయి. వారంతా పోయి తమ క్రొత్త ఇండ్లలో ఉండవచ్చును.

ముందుగా ఆస్ట్రేలియా, కెనడా, బ్రిటన్ దేశాలు వారిని ఆహ్వానించాయి. కాని, అది చూచి అన్ని దేశాలు ఆహ్వానాలు పంపించాయి. బెల్జియం దేశం 20 వేలమంది గని పనివారిని ఆహ్వానించింది. మూడు

నెలల్లోపల వారంతా అచ్చటికిపోయి చేరారు. బ్రెజీల్ దేశంలోని గోయాస్ అనేచోట ఈనాడు రెండు వందలకు పైగా శరణార్థుల కుటుంబాలు ఉన్నాయి. ప్రతి కుటుంబానికీ ఒక సొంత ఇల్లు, తోటకు జాగా, పశువులకు దొడ్డి ఉన్నాయి. గ్రామానికి బయటగా ఉన్న పొలాలలో అందరూ సమష్టిగా వ్యవసాయం సాగిస్తారు.

ఇక పడుచు శరణార్థుల సంగతేమిటి? మొదట తమ తమ ఇండ్లలో పెట్టుకోడానికి, దత్తు తీసుకోడానికి అందరూ చిన్న పిల్లలనే పంపమన్నారు. కాని, శరణార్థుల సంఘం ఈ పరిస్థితిని మార్చాలనుకుంది. టక్ అనే వాని తర్వాత శరణార్థుల సంఘానికి సర్వకార్య నిర్వాహకుడుగా వచ్చిన జె. డోనాల్డ్ కింగ్‌స్లీ శరణార్థులలో నేర్పరులైన పడుచువారిని గురించి అందరికీ తెలియజేశాడు. ఆ యువతీ యువకులంతా శిబిరాలలో, కేంద్రాలలో ఎలా పనిచేస్తున్నారో, బాల భటులుగా ఎలా సేవ చేస్తున్నారో అందరికి తెలియ జేశాడు. అంతటితో పడుచువారికై లెక్క-లేనన్ని ఆహ్వానాలు రాసాగాయి. ఆస్ట్రేలియా దేశం 500 మందిని రమ్మని తెల్పింది. వెంటనే అమెరికా, స్వీడన్, న్యూజీలాండ్, ఇంకా ఇతర దేశాలవారు తమ ఆహ్వానాలు పంపించారు.

ఏ రేయే పడుచువారిని ఏ యే దేశాలకు పంపించాలో సంఘం వారు యోచించారు. వారి వారి యోగ్యతల కార్డులను బాగుగా పరిశీలించారు. వారిని రక్షించే తల్లి దండ్రుల సలహాలు కూడా తీసుకున్నారు. ఆహ్వానాన్ని అంగీకరించిన తర్వాత ప్రతి శరణార్థి ఆరోగ్యాన్ని తనిఖీ చేశారు. ఎందుకంటే, పుష్టిగా ఉన్నవారే ఇతర దేశాలకు పంపబడాలని ఆ సంఘంయొక్క తీర్మానం.

విదేశాలకు వెళ్ళదలచిన యువతీ యువకులు ఆ యా నౌకాశ్రయాలను చేరుకున్నారు. ఒకే దేశానికి వెళ్ళే నిమిత్తం పలుప్రాంతాలనుంచి వచ్చిన వారందరు కలిసి ఒక వర్గంగా ఏర్పడ్డారు. సంఘంవారు వారికి కావలసిన అధికార పత్రాలు సిద్ధంచేసేలోపల యువతీ యువకులకు క్రొత్త ప్రదేశాల్లో జీవితం ఎలా ఉంటుందో, వారు అక్కడ ఏ యే భాషలు మాట్లాడాలో బోధించారు.

ఆ పడుచు వారందరు తమకు సహాయం చేసిన ఆ సంఘంవారికి కృతజ్ఞత చూపించారు.

తొమ్మండుగురు యువకులు అమెరికా దేశానికి వెళ్ళబోయే ముందు అందరూ కలసి తమ సంఘ నాయకునికి "మేమంతా ఈ ప్రయాణం చేయడానికి ఉత్సాహంగా ఉన్నామని మీకు తెలుసు. మేమంతా రేపు హాయిగా ఓడలో వెళ్ళిపోతాం. కాని, ఇదంతా

మీ సహాయ సానుభూతుల ఫలితమే. మేము మీ కెలా కృతజ్ఞత చూపించగలం ? మా క్రొత్తదేశంలో మేము చక్కగా పనిచేస్తామని, మంచి పౌరులుగా, మంచి అమెరికా దేశీయులుగా పేరు పొందగలమని ఇందు మూలంగా మీకు మా కృతజ్ఞత తెలుపుతున్నాం," అని ఒక జాబు వ్రాశారు.

అమెరికాలో శరణార్థులైన యువతీ యువకులకు, పిల్లలకు క్రొత్త ఇండ్లు సంపాదించడం, వారిని ఆహ్వానించడం, వారి వారి ఇండ్లకు తీసుకుపోవడం ఇలాంటి పనులన్నీ ఐరోపా బాల రక్షక సంఘంవారు జరిపించారు. ఆ సంఘంలో వివిధ సమాజాలకు చెందిన స్త్రీ పురుషులు పని చేశారు. ఓడలోనుండి, విమానంలోనుండి దిగిన పడుచువారిని, పిల్లలను, పెద్దలను ఆ సంఘంవారు ప్రత్యేకంగా ఆహ్వానించారు.

ముందుగా ఆహ్వాన కేంద్రం న్యూయార్కు నగరం లోని బ్రాంక్స్ అనే స్థలంలో ఏర్పాటుచేశారు. అక్కడ శరణార్థులందరూ నివసించి, ఆ క్రొత్త ప్రదేశంయొక్క వాతావరణానికీ, జీవితానికి అలవాటు పడ్డారు. ఆ కేంద్రంలో సంతోషం తాండవించేది. ఆట పాటలవల్ల వారు సన్నిహితులై, అన్యోన్యంగా ఉంటారు.

ఆ కేంద్రంలోని పనివారు తమతోకూడా ఉన్న పడుచువారిని, పిల్లలను ఆదరంతో జ్ఞాపకానికి తెచ్చుకుంటూంటారు. ఫ్రెడ్డీ అనే చిన్న పిల్లవాడు వచ్చినప్పుడు పిల్లలకు చిత్రంగా కనబడ్డాడు. అతని దగ్గర చాలా వస్తువులు ఉండేవి. అతను తనచుట్టూ పిల్లలను చేర్చుకొని ఆ వస్తువులను బయటకు తీశాడు. ముందు ఓ సబ్బుబిళ్ళ. అందరూ దాన్నిచూచి మెచ్చుకుంటూ నవ్వారు. మర్లా అతడు రెండో వస్తువును తీశాడు. అది కూడా ఓ సబ్బుబిళ్ళే. అందరూ ఆశ్చర్య పోయారు. అతడు మూడో వస్తువును తీశాడు—అదీ సబ్బు బిళ్ళే. అందుచేతే ఫ్రెడ్డీ ఆ పిల్లలకు చాలా చిత్రమైనవాడు.

అమెరికా దేశీయుడగు ఓ సంగీత విద్వాంసుని ఇంటికి ఫ్రెడ్డీ పంపబడ్డాడు. అక్కడికి పోగానే అతని సబ్బు బిళ్ళకు ప్రాముఖ్యత తగ్గిపోయింది. ఎందుకంటే, అక్కడ ఓ పియానో ఉంది. ఇప్పుడు ఫ్రెడ్డీకి "తంద్రి" వాయించే పియానో చాలా ఇష్టం. ఫ్రెడ్డీకి ఇంకా జ్ఞాపకం ఉన్న లాట్వియా దేశపు పాటలు అతని తలిదండ్రులు కూడా పాడుకుంటూరు.

కేంద్రానికి చేరిన పడుచువార్పై అమెరికా రక్షక సంఘంవారికి చాలా అభిమానం.ఎందుకంటే వారందరూ కూడా ఆశలతో జీవితాన్ని నిర్మించుకునే యావనులు.

తమ జీవితంలో జరిగిన దారుణ కృత్యాలను తలచుకొని వారు ఇంకా భయపడుతుంటారు. కానీ, దాదాపు అందరూ గతాన్ని మరచిపోయి హాయిగా ముందుచూపు చూస్తున్నారు.

14 ఏండ్ల రెజినా అనే బాలిక తనకు కొత్తగా కలిగిన జీవితాశలను గురించి ఇంగ్లీషులో వ్రాసి "న్యూ లైఫ్" అనే పత్రికకు పంపింది. "నేను చిన్నప్పటినుండీ డాక్టరును కావాలని అనుకుంటున్నాను. డాక్టర్లు తెల్ల దుస్తులతో చాలా చక్కగా కనిపిస్తారు. అందుకే నేనుకూడా డాక్టరును కావాలనుకున్నాను," అని దానిలో వ్రాసింది.

"జర్మనీ దేశంలోని మా కేంద్రంలో నేను చిన్న పిల్లలను రక్షించే ఆస్పత్రిలో సహాయంచేశాను. మా కేంద్రంలో డాక్టరు ఎలా పనిచేస్తుందో చూచి నేను కూడా డాక్టరునైతే అలాపని చేయాలనుకున్నాను. నేను ఇప్పుడు నా జీవితాన్ని గురించి యోచించాను. ఇప్పటికీ నాకు డాక్టరును కావాలనే కోరిక ఉంది. జబ్బుగా ఉండేవారు పని చేయలేరు. తమకు కావలసిన కూడు, గుడ్డ మొదలైనవి సంపాదించుకోలేరని నాకు తెలుసును. డాక్టరు వారికి తగిన సహాయం చేయవచ్చును."

రెజినా బాలికను పెంచే అమెరికను తలిదండ్రులు ఆమె హైస్కూలు చదువు ముగించిన తర్వాత డాక్టరుగా పోవాలనే కోరిక ఉంటే వైద్య కళాశాలకు పోవచ్చునని చెప్పారు.

బెల్జియం దేశంనుండి వచ్చిన జార్జ్ అనే యువకునికి కాలేజీకి పోవాలనే ఆశ ఉండినది. అతని అమెరికను తలిదండ్రులు అలానే చదివించారు. అతను ఆనర్స్ బి.ఏ. పాస్ చేయడం చూచి వారు చాలా సంతోషించారు. అంతటితో జార్జ్ ఒక ఉపాధ్యాయుడు కావాలను కున్నాడు. వెంటనే అతడు ఉపాధ్యాయ పదవికి చదువుతూ, భాషా విషయాలు బోధిస్తూ డబ్బు సంపా దించ గలిగాడు.

హంగరీ దేశంనుండి వచ్చిన ఇమ్రీ అనేవాడు తాను రైతు కావాలన్నాడు. సంఘంవారు అతనికి అయోవా అనేచోట ఒక ఇల్లు చూపించారు. అతను బడి ఐపోగానే, శలవుల్లో తన్ను కాపాడే తలిదండ్రులకు సాయంచేస్తాడు. అతను ఇప్పటికీ రైతు కావాలని చెప్పడంచేత ఆ చదువు పూర్తికాగానే అతన్ని వ్యవసాయ పాఠశాలకు పంపిస్తారు. ఇలానే వారివారి ఇష్టప్రకారం అందరినీ చదువుకోమంటారు.

కొంతమంది పడుచువారికి కొన్ని ప్రత్యేకమైన ఏర్పాట్లు చేయాలి. కొంతమంది వేరుగాపోయి విడి

కుటుంబాలతో ఉండేందుకు భయపడతారు. ఒకే కేంద్రంలో అందరితో ఉండడానికి అలవాటు పడ్డవారు అలానే ఉండి పోవాలనుకుంటారు. అన్నికా అనే గాయక బాలిక ఇలాంటి వారిలో ఒకతె. సంఘంవారు ఆమెను అమెరికన్ ప్రొటెస్టంట్ సంస్థకు చెందిన పడుచువారి జట్టులో వదలివేశారు. అక్కడ ఆమె ఆనందంగా ఉంటూంది.

జాక్ అనే బాలుడు స్వయంగా పనిచేసుకోడానికే పూనుకొన్నాడు. అతనికి ఒక అమెరికన్ హోటలు మేనేజరు కావాలని తోచింది. కాబట్టి, అతని తలిదండ్రులు పెద్ద బాస్టన్ హోటల్‌లో వంటయింటి యజమానిగా చేర్పించారు. అతను క్రమేణా ఆ హోటల్ సహాయ నిర్వాహకుడుగా వృద్ధి చెందాడు.

మిగిలిపోయిన శరణార్థుల సంఖ్య నెలనెలకు తగ్గిపోసాగింది. ఒకదాని వెంబడి ఒకటిగా కేంద్రాలు మూసివేశారు. కాని, ఇంకా ఎట్టి ఆహ్వానాలు రానట్టివారు చాలామంది మిగిలిపోయారు.

కాని, ఆ మిగిలిపోయినవారిలో చాలామంది మంచి చదువరులు ; శక్తిమంతులు. కొంతమంది వికలాంగులు, వృద్ధులుకూడా మిగిలిపోయారు. యుద్ధంలో కాలో చెయ్యో పోయినవారికి ఇండ్లు ఇవ్వడానికి జనులు నిరాక

రించారు. అలాంటివారిని కాపాడడం తమపైనే పడు తుందని ప్రభుత్వంవారుకూడా వెనకడుగు వేశారు.

కింగ్స్లీ అనే ఆయన తిరిగి ఆ అనాథలకోసం ఒక ప్రకటన చేశాడు. తిరిగి ప్రపంచం అందుకు జవాబు చెప్పింది. క్రమ క్రమంగా పనివారికి, వికలాంగులకు ఆహ్వానాలు అందసాగాయి. అంతర్జాతీయ శరణార్థుల సంఘంవారు గుడ్డివారికై ఇండ్లు కట్టేందుకు సహాయం చేయాలనే షరతుమీద చాలామంది గుడ్డి వారిని నార్వే దేశం ఆహ్వానించింది. బెల్జియం దేశం వృద్ధుల నందరినీ రమ్మంది. ఇలా అన్ని దేశాలు సహాయపడ్డాయి.

న్యూజెర్సీలోని లోడీయందున్న శరణాలయం వారు అమెరికన్ కేథలిక్ సంఘంద్వారా ఫ్రాంక్ అనే కుంటి బాలుని, అతని 7 గురు సోదర సోదరీమణులను ఆహ్వానించారు. వారిది అద్భుతమైన కుటుంబం. వారికి తలిదండ్రులు లేరు. నాజీల శిబిరంలో ఫ్రాంక్ యొక్క యువ సోదర సోదరీమణులు కుటుంబాన్ని ఒక్కటిగా ఉంచగలిగారు. పెద్దవారు నాజీల పనివారుగా ఉండి తమకు ఇచ్చిన ఆహారాన్ని అందరికీ పంచి, తిని జీవించారు.

లోడీ యందలి ఇంటిలో ప్రతివారికీ ఫ్రాంక్‌ను చూస్తే చాలా సంతోషం. అతను బలే తమాషాగా, హుషారుగా, ఆనందంగా ఉండేవాడు. ఒక కాలుతో అతను కుంటు

కుంటూ ఆడడం చూచిన ఒకరు లోహపు కాలును చేయించి ఇచ్చారు.

వెంటనే అతడు 'నే నిప్పుడు మంచుమీద పరు గెత్తుతూ తిరగగలను,' అని ధైర్యంగా చెప్పేవాడు.

అత నలా చేయడంచూచి అందరూ పొగడేవారు. అతడు వేగంగా నడవడం చూచిన ఒక వైద్యుడు తన ఆస్పత్రికి వచ్చి మిగతా కుంటివారికి అట్టి ధైర్యం కలిగించమన్నాడు.

నిజంగానే అతన్నిచూచి అందరూ బాగా నడవడం నేర్చుకున్నారు. ఈ విధంగా ఫ్రాంక్ చాలా వైద్యశాల లకు పోయి అందరికీ బాగా నేర్పించాడు.

అంతర్జాతీయ శరణార్థుల సంఘం తనపని పూర్తి చేయవలసిన 1950 వ సంవత్సరం వచ్చేసరికి, ఐక్యరాజ్య సంఘ ప్రణాళికప్రకారం కింగ్స్లీతోపాటు అతని అనుచరు లంతా మిగిలిపోయివున్న 25 వేల మందికై రెండింతల పని చేశారు. అంతర్జాతీయ పరిశోధక సంఘంవారి పత్రా లన్నీ జర్మనీ దేశంలోని హైకమీషనరుకు పంపించి వేశారు. ఇకమీద వారికేమైనా రహస్యాలు తెలిస్తే ఆ పత్రాలను ఉపయోగించుకోవచ్చు నని తెలియజేశారు.

తప్పిపోయినవారిని వెతకడం చాలా కష్టమైనా, అప్పు డప్పుడూ ఒకటి రెండు సమాచారాలు తెలుస్తూనే ఉన్నాయి. అలానే మరూజా అనే అమ్మాయి

సమాచారం తెలిసింది. మరూజా పదకొండు సంవత్స రాల బాలికగా ఉండినప్పుడు చాలామంది శ్పానిష్ పిల్లలతో యుద్ధభూమినుండి తప్పించుకొని పోయింది. ఒక పడవలో అట్లాంటిక్ సముద్రంలో వారు వెడుతూండగా అమెరికన్ నావికులు చూచి కాపాడారు. అమెరికాలో మరూజా బాలికను మిస్సోరీకి పంపించారు. అక్కడ ఆమె ఆనందంగా చదువుకొంది. ఆమె హైస్కూలుకు పోగానే ఒక బాలసంఘానికి పెద్దగా ఎన్నుకోబడింది.

ఆమె తన్ను కాపాడుతున్న తలిదండ్రులను, స్నేహి తులను ప్రేమిస్తున్నా, ఎప్పుడైనా ఒక నాటికి తన సొంత తలిదండ్రులు కనబడకపోతారా అనే ఆశతో ఉండింది. ఇప్పుడు ఆమెకు పదహారు సంవత్సరాలు. ఆమె తలి దండ్రులు ఇంగ్లాండ్‌లో ఉన్నారని అంతర్జాతీయ పరిశోధక సంఘంవారు తెలిపారు. వెంటనే ఆమె వారిని చేరుకుంది.

ఈ విధంగా అంతర్జాతీయ శరణార్థుల సంఘం పని చేసింది. 1950 వ సంవత్సరం నాటికి అది 1,499,000 మంది శరణార్థులను కాపాడింది. 7,90,398 మంది శరణార్థులకు క్రొత్త ఇండ్లు సమకూర్చింది. అంతర్జాతీయ పరిశోధక సంఘం విజయవంతంగా 70,253 మంది తప్పిపోయిన వారిని కనిపెట్టింది. వారిలో 2,975 మంది బాల బాలిక లకు, యువతీ యువకులకు శిశు పరిశోధక సంఘంవారు వసతి కల్పించారు.

# తెరిసీ, పైరీ వంటివారికోసం

బాంబులతో ధ్వంసం చేయబడిన ఆ ఫ్రెంచి దేశపు పాలికాపు గుడిసెలో చీకటిలో, చిత్తడిలో, రాళ్ళలో రప్పలలో ప్రాకులాడుతున్న ఆ అమ్మాయిని వారు చూచినప్పుడు పదో పదకొండో సంవత్సరాల వయస్సు ఉంటుందని అనుకున్నారు. కాని, నిదానించి చూసి 14 ఏండ్ల బాలికని తెలుసుకున్నారు. ఆ చిక్కిపోయిన చిన్న బాలికను చూసి వయస్సును పోల్చుకోలేక పోవడం వింతకాదు.

ఆమె పేరు తెలియనందున వారు ఆమెకు జీనైన్ అని పేరు పెట్టారు. ప్రక్క పట్టణంలో బాంబుల బారి నుండి తప్పించుకొన్న ఒక యింట్లో ఫ్రెంచి దేశపు బిడ్డలను కాపాడడానికై ఒక కేంద్రం నిర్మించారు. అక్కడికి తనను తీసికొని పోవడానికై వచ్చినవారిని ఆ బాలిక ఆనందంతో పిలువలేదు. ఆమె ఏడుస్తూ, దొర్లుతూ విదలించుకో సాగింది. బహు ప్రయాసతో వారు ఆమెను కారులోకి చేర్చగలిగారు.

కేంద్రంలో వారు ఆమెకు చినిగిపోయిన బట్టలు తీసివేసి బాగా స్నానంచేయించి, మంచి దుస్తులు ఇచ్చి చక్కని ఆహారాన్ని పెట్టారు. కాని, అప్పటికీ ఆమెకు వారిపై నమ్మకం కుదురలేదు. ఎందుకంటే చాలా

కాలంగా ఆమె దొంగతనంగా తన ఆహారాన్ని సంపాదించుకోడానికి అలవాటు పడింది. కేంద్రంలోకూడా ఆమె చిన్న పిల్లల దగ్గరనుంచి ఆహారాన్ని అమాంతంగా లాక్కొనేది. వారు తమ ఆహారాన్ని రక్షించుకోబోతే వారితో పోట్లాడేది.

ఆమె మాటలనుబట్టి తమ ఫ్రెంచి దేశపు బాలిక అని కొందరు చెప్పారు. కాని, ఆమె ఇల్లు ఎక్కడుందో, ఆమె ఎలా ఆ గుడిసెలోకి రాగలిగిందో అడిగితే చెప్పేది కాదు. పనివారిలో కొంతమంది ఆమె ఇంకా తమరిని సందేహిస్తూందని వూహించారు. మరికొందరు ఆ ఘోర కృత్యాలు ఆమెకు జ్ఞాపకం లేవని అనుకున్నారు. వాటిని మరచిపోవడమే మంచిది.

ఆమెను పరీక్షించిన వైద్యుడు ఆమెకు చేపనూనెను ఇచ్చి, ఏలాటి ప్రశ్నలుగాని వేసి కలతపెట్టవద్దని చెప్పాడు. ఇప్పుడు ఇచ్చే ఆహారం ఆమెకు తిరిగి శక్తిని కలిగిస్తూంది. క్రమేణా ఆమెకు అంతా జ్ఞాపకానికి రావచ్చునని అతడు తలచాడు.

ఒకనాడు కేంద్రానికి ఆహార పదార్థాలు తెచ్చే బండిలోఅచ్చటి పనివారితో మాట్లాడడానికై ఒక మనిషి వచ్చింది. ఆమె వారిని కొన్ని ప్రశ్నలు అడుగుతూ వారి జవాబులను తన పుస్తకంలో వ్రాసుకో సాగింది. ఆ

తర్వాత ఆమె వారితోకూడా పాటలు పాడింది. ఆ పాటల్లో ఒక పాత ఫ్రెంచి గేయంకూడా ఉంది. జీనైన్ బాలిక వారితో చేరలేదు. కాని, ఆ సంగీతం ఆమెను కూడా వినమని లేపింది. వారు మొదట పాటను నిలుప బోయే సమయంలో ఆమె ఒక్కదూకు దూకి, వారి దగ్గరకు పరుగెత్తి, ఆ గది ద్వారంకడ ఉన్న ఆమెను కౌగలించుకొని, అచ్చటికి 50 మైళ్ళ దూరంలోఉన్న ఒక పల్లెపేరును చెప్పింది. అబ్బ! ఇప్పటికి ఆమెకు జ్ఞాపకం వచ్చింది.

వెంటనే ఆమె చెబుతున్నదంతా వారు ఆత్రంగా విన్నారు. ఆమె పేరు తెరిసీ. ఇంటివద్ద అమ్మ, నాన్న, పైరీ అనే పెద్దన్నయ్య ఉన్నారు. ఆమె ఇంటిపేరు చెప్పలేదు గాని, ఊరిపేరు, ఆమె పేరు, ఆమె అన్న పేరు చాలును. రెండోరోజు ఒక పనికత్తె తెరిసీతో కూడా ఒక కారులో ఆ గ్రామానికి బయలుదేరింది.

వారు గ్రామాన్ని సమీపిస్తుంటే తెరిసీ ఆనందానికి అంతులేదు. వారు ఆ గ్రామంయొక్క వీథిలో నిలువగా, దగ్గరగా ఉండిన ఒక చిన్న అంగడిలోనుండి ఒక కుంటివాడు వచ్చాడు. వెంటనే ఒక మెరుపులా తెరిసీ బయటకు దిగి, "మా చిన్నాయన! మా చిన్నాయన జాక్వెస్!" అని అరచింది.

నా ముద్దు తెరిసీ అంటూ అతను ఆమెను చేతుల్లోకి తీసుకొన్నాడు. అతనితో కూడా వచ్చిన ఒక పారిపోయిన పిల్లవాడు వారిద్దరినీ కౌగలించు కున్నాడు.

ఆ కుంటివాడు చెప్పింది చాలా విషాదకరమైన కథ. తెరిసీ యొక్క తండ్రి యుద్ధానికి పోయాడు గాని, ఇంత వరకూ తిరిగి రాలేదు. ఆవును ఇవ్వలేదని తెరిసీ తల్లిని నాజీలు కాల్చి చంపేశారు. ఆమె అన్న పైరీని నాజీలు తమతో తీసుక పోయారు. తెరిసీ జాడే తెలియలేదు. ఆమె అప్పుడు అడవుల్లోకి పారిపోయింది. ఆ కుంటివాడు మాత్రం యుద్ధంలో గాయపడి తిరిగివచ్చి తనకోసం కనిపెట్టుకొని ఉన్న భార్యను చేరుకున్నాడు. తన అన్న కాపురమంతా పోయిందని అతడు విచారంగా చెప్పాడు.

కొంతకాలం తర్వాత జర్మనీ నుండి పైరీ తిరిగి వచ్చాడు. అక్కడ అతన్ని నాజీలు ఫ్యాక్టరీలో చాలా గంటలు పని చేయాలని నిర్బంధించే వారు. యుద్ధం పూర్తికాగానే అతడు తన ఇంటిని వెతుక్కుంటూ వచ్చేశాడు. దారిలో ఒక మనిషి అతన్ని శరణార్థులను రక్షించేచోటికి తెచ్చి విడిచాడు. అక్కడివారు అతనికి ఇంటికిపోయే ప్రయాణ సౌకర్యాలు కలిగించారు. అతనే ఇప్పుడు పినతండ్రి దగ్గర ఉన్నాడు. భగవంతుని కృపవలన తెరిసీకూడా వచ్చింది.

ఆ కుంటివాడు, అతని భార్య, పైరీ వీరు ముగ్గురు నివసించుచుండిన ఆ ఇల్లు చాలా చిన్నది. పల్లెకు ఒకమైలు దూరంలో ఉంది. నాజీలు అతని ఇంటినుంచి మంచిమంచి పనిముట్లు, సామానులు ఎత్తుకపోయారు. వారి ఆవుకూడా చాలాకాలం క్రిందటే చనిపోయింది. అతను వసంతకాలంలో నాటిన కొద్ది విత్తనాలుకూడా సరిగా మొలవక పోవడంచేత వానితో లాభమే లేకపోయింది. ఆ తర్వాత కరువు వచ్చింది. జీవితం దుర్భరమైంది. కాని, వారికి ఒక తోటకూడా ఉండడం చేత తెరిసీని పోషించుకో గలరు.

తెరిసీ రాకవల్ల కలిగిన ఆనందంనుంచి పినతల్లి జారెటీ జట తేరుకున్న తరువాత ఆ గ్రామంలోని పడుచు వారి యొక్క, పిల్లల యొక్క, ఇతర ప్రజలయొక్క పరిస్థితిని గూర్చి తెరిసీతోకూడా వచ్చిన సంఘ సేవకురాలు వాకబు చేసింది. వారికందరికీ ఆహారం ఉందా? ఆ భార్యా భర్తలు లేదంటూ తల ఆడించారు. ఇప్పుడే వారికి తగిన ఆహారంలేదు. మరి రాబోయేది చలికాలం.

ఆ సంఘ సేవకురాలు తిరిగిపోతూ "నేను మళ్లీ వస్తాను. వెంటనే మంచి వార్తతో తిరిగివస్తాను" అంటూ వెళ్ళిపోయింది.

ఆమె తన వాగ్దానం నిలబెట్టుకుంది. మరుసటి వారంలో ఆమె ఫ్రాన్సుదేశపు జాతీయ ప్రభుత్వ అధికారితో తిరిగి ఆ గ్రామానికి వెళ్ళింది. కాని, వారు ఆ కుంటివాని కుటుంబం దగ్గరకు పోయేముందు ఆ పల్లె అధికారితో మాట్లాడారు.

ఆ తర్వాత వారు తెరిసీ, పైరీ మొదలైనవారి దగ్గరికి సంతోష కరమైన వార్తతో వెళ్ళారు. శీఘ్ర కాలంలోనే, అక్కడ ఆహార ముంటుంది. పసిపాపలకు, చిన్న బిడ్డలకు, పైరీలాంటి వారికి అందరికీ అన్న ముంటుంది. మంచి పాలు, రొట్టె, శక్తినిచ్చే మాంసం, కూరగాయలు అన్నీ వస్తాయి. "సంతోషంగా ఉండండి. ఆహారం వస్తుంది," అని ఆమె వారితో చెప్పింది.

ఆ సేవకురాలు తెరిసీ కుటుంబానికి తెల్పిన సంతోష కరమైన వార్తలనే ఐరోపా ఖండంలో యుద్ధం మూలంగా నాశనమైన దేశాలలోని వేలకొలది జనులు వినసాగారు. ప్రపంచంలో ఇంకా అనేక దేశాలలో వున్న లక్షలకొలది నిస్సహాయులకు కూడా ఈ సమాచారం తెలిసింది. మూడేళ్ళు దాటకముందే వారందరికీ సహాయం లభించింది. ప్రపంచ పునరుద్ధరణ సంఘంనుంచి సహాయం లభించ గలదని వారి చెవిని పడినదో లేదో, వెంట వెంటనే ఆహార పదార్థాలు, వస్త్రాలు, ఔషధాలు

మొదలైనవి వారి చేతికందాయి. ఈ అభాగ్యులు ఏ దేశాలవారో ఆ ప్రభుత్వాలన్నీ ప్రపంచ పునరుద్ధరణ సంఘం కార్యకలాపాలలో తమవంతు పాత్రను నిర్వహించడం చేత ఇవన్నీ జరిగాయి.

1946 వ సంవత్సరం డిసెంబరునెల 11 వ తేదీన జరిగిన జనరల్ అసెంబ్లీ సమావేశంలో, ఐక్యరాజ్య ఆర్థిక, సాంఘిక సంఘ డైరెక్టర్ జనరల్ ఫియోరెల్లో లాగార్డియా అనే ఆయన ఐక్యరాజ్య అంతర్జాతీయ శిశు సంరక్షణ నిధిని ఏర్పరచాలని ప్రతిపాదించాడు. ఆ నిధి రెండో ప్రపంచ యుద్ధంలో పీడింపబడ్డ బాల బాలికలందరికీ సహాయం చేయాలని, అందుకు ప్రపంచం లోని అన్ని ప్రభుత్వాలనూ విరాళాల నివ్వాలని కోరాలనీ అతను చెప్పాడు.

ఆ సలహాను అందరూ అంగీకరించారు. ఆ నిధిద్వారా 18 ఏండ్ల లోపున ఉన్న బాధితులలో వీలైనంత ఎక్కువమందికి జాతి మత రాజకీయ భేదాలు పాటించ కుండా సహాయం జరగాలని వారు తీర్మానించారు.

ఆ నిధి ఏర్పరచ వలెనని తమ సమ్మతిని తెలుపుతూ ఐక్యరాజ్య సంఘ ప్రతినిధులు అద్భుతంగా సేవ చేస్తున్న స్వచ్ఛందసేవక సంఘాలవారిని మెచ్చుకున్నారు. యుద్ధంలో దెబ్బతిన్న దేశాలుకూడా తమ యువజనులకై

చేస్తున్న సేవను వారు గుర్తించారు. ప్రపంచ పునరుద్ధరణ సంఘం కూడా సహాయం చేసింది. కాని, ఇవన్నీ కలిసి పని ప్రారంభించడం మాత్రమే జరిగింది.

ప్రతి ప్రతినిధి శిశుసంరక్షణ నిధికి విరాళాన్ని పంపమని తన ప్రభుత్వానికి తంతి పంపించాడు. ప్రపంచంలోని ప్రతి దేశాన్నుంచీ మేము భాగం ఇచ్చేందుకు చాలా సంతోష పడుతున్నాం అంటూ, తాము ఎంత ఇవ్వ బోయేదీ తెలుపుతూ జవాబులు వచ్చాయి. ఆ మొత్తం కొన్నిలక్షల డాలర్లుఅయినా ఆ పైకం చాలలేదు. అంత ఎక్కువ ధనం కావలసి ఉంది. అంతమంది పడుచువారు, పిల్లలు నిర్జీవస్థితిలో సహాయానికై కనిపెట్టుకున్నారు.

నార్వే దేశీయుడైన యేక్ ఆర్థింజ్ అనే ఆయన సలహాప్రకారం విరాళాల సేకరణ సంఘాన్ని స్థాపించారు. దానికి ప్రపంచంలో ఎక్కడ ఉండేవారైనా సరే, ఎవ్వరైనా సరే పిన్నా పెద్దా అనే భేదం లేకుండా తమ విరాళాలను పంపవచ్చును. దానికిగూడా ప్రపంచం లోని ప్రతిదేశంనుండీ పిన్నలు, పెద్దలు, వృద్ధులు, స్త్రీలు, పురుషులు, పాఠశాలలు, సంఘాలు, సమావేశాలు, క్రైస్తవ మఠాలు అన్నీకూడా ప్రేమతో ఉదార బుద్ధితో విరాళాలు పంపించాయి.

3 ఏండ్లలోపల 50 దేశాల ప్రజలు తమ సొంత విరాళాన్ని, ప్రభుత్వ విరాళాన్ని విరాళాలే సంఘానికి పంపవలసి ఉంది. ఆస్ట్రేలియా, అమెరికా, కెనడా, ఇండియా, పాకిస్థాన్, పనామా, పెరూ...ఇంకా ఎన్నో లెక్క లేనన్ని దేశాలు విరాళాలు పంపించాయి. ఇలా సహాయం చేసిన దేశాలలోనే కొన్ని దేశాల పడుచు వారికై ఆ నిధినుంచే సహాయం జరగ వలసిన స్థితి ఉంది. అయినా, యుద్ధం మూలంగా ధ్వంసమైన దేశాల లోని పడుచువారికై వారుకూడా విరాళా లిచ్చారు.

ధనం సిద్ధమైంది. కాని, దాన్ని ఎవరు ఖర్చు పెట్టడం? కనిపెట్టుకొని ఉండే లక్షలాది ప్రజలకు దాని ద్వారా ఆహారం, వస్త్రాలు, మందులు పంపేది ఎవరు?

ఐక్యరాజ్య సమితి చాలా సంఘాలు గల ఒక పెద్ద సంస్థ. దాని కృషి ప్రపంచమంతా జరుగుతుంది. ప్రతిదినము దాని పనులు నెరవేర్చుటకై వేలకొలది మంది పనిచేస్తున్నారు. ఐక్యరాజ్య సమితి చాలా జాగ్రత్తగా నడుపబడడం మూలాన ప్రతి పనివానికీ తాను ఏంచేయాలో తెలుసును. ఐక్యరాజ్య అంతర్జాతీయ శిశు సంరక్షణ సంఘం అందుకై వినియోగించాలి. ఐక్యరాజ్య సమితిలో దానికి ఒక ప్రత్యేక స్థానం ఇవ్వబడింది.

ప్రపంచ ప్రజా జీవితాన్ని మంచి స్థితికి తీసుకు రావడానికై కృషిచేసే ఐక్యరాజ్య ఆర్థిక సాంఘిక సంఘంలో దానికి స్థానం ఇచ్చారు. మూల సంఘానికి చెందిన ఆహార, వ్యవసాయిక సంఘంయొక్క, ఐక్యరాజ్య విద్యా, విజ్ఞాన, సాంస్కృతిక సంఘంయొక్క, ప్రపంచ ఆరోగ్య సంఘం యొక్క సహకారంతోనే శిశు సంరక్షణ సంఘం పనిచేస్తుంది.

శిశు సంరక్షణ సంఘాన్ని నిర్మించడానికై ఆర్థిక సాంఘిక సంఘం వివిధ దేశాలనుండి 26 మందిని ఎన్నుకొంది. ఆ సంఘం కార్యక్రమ నిర్వాహకుడుగా మారిస్ పేట్ అనే అతన్ని నియమించారు. అతను అనుభవశాలి యైన అమెరికను వ్యాపారి. మొదటి ప్రపంచ యుద్ధంలో అమెరికను సహాయ సంఘంలో పనిచేశాడు. రెండో ప్రపంచ యుద్ధంలో అంతర్జాతీయ రెడ్ క్రాస్ సంఘపు యుద్ధ కార్యక్రమ బందీల రక్షకుడుగా పనిచేశాడు.

వెంటనే, తనతో పాటు పనిచేయగల వారినే పేట్ తన పనివారినిగా ఏరుకున్నాడు. వారంతా ఐక్యరాజ్య సమితి కార్య నిర్వాహకుల జాబితాలో వ్రాసుకోబడ్డారు. అలాంటి వారంతా తమ తమ పూర్తి కాలాన్ని సంఘ శ్రేయస్సుకై వినియోగించి పని చేయాలి.

ఐక్యరాజ్య సమితి కార్యక్రమాన్ని సాకల్యంగా నడుపు కార్య నిర్వాహక సంఘానికి పెద్ద ట్రిగ్వేలీ అనే ఆయన. ఆయనే సమితి ప్రథమ ప్రధాన కార్యదర్శి. అతనికి సమితి చట్టప్రకారం సర్వ కార్యాలపైన అధికారం ఉంటుంది. సర్వ సంఘాలు, సమావేశాలు జరిపించాలి. మొదటి నుండి ట్రిగ్వేలీ తన బాధ్యతను నమ్మకంగా నెర వేర్చాడు. ట్రిగ్వేలీ శిశు సంరక్షణ సంఘంయొక్క నిజమైన స్నేహితుడు. పడుచువారికై ఆ సంఘం చేసిన పనిని అతడు ఎన్నోమార్లు ప్రపంచానికి రేడియోల ద్వారా వినిపించాడు. ప్రజలకు అతనిపై అభిమానము, గౌరవము, నమ్మకము ఉండడం చేతనే అడిగిన వెంటనే తప్పకుండా నిధికి క్రొత్త క్రొత్త సహాయంచేస్తూ, తమ తోడ్పాటు ఇచ్చారు.

1896 వ సంవత్సరం జూలై నెల 16 వ తేదీన నార్వే దేశంలోని ఆస్లో నగరంలో ట్రిగ్వేలీ జన్మించాడు. అతను పసివాడుగా ఉన్నప్పుడే తండ్రి చనిపోవడంచేత అతని తల్లి ఆస్లో నగరపు పొలిమేర లోని గ్రారడ్ అనే చోట తన్ను, తన బిడ్డను పోషించుకునేందుకై ఒక భోజనశాలను నడిపింది. అక్కడ ట్రిగ్వేలీ హైస్కూలు విద్య చదువుకుంటూ కుటుంబ ఆదాయానికై వింత వింత పనులు చేసేవాడు.

అతనెంత పని తొందరలో ఉన్నా ఆటలు బాగా ఆడుకునేవాడు. నేను మంచులో జారడానికే పుట్టాను అని అతను అనేవాడు. పొడుగ్గా, బలంగా ఉండి అతను కుస్తీ పట్టడంలో, మంచులో నడవడంలో, టెన్నిస్ ఆటలో సమర్థుడయాడు. అతను పడవలపోటీ జట్టులో కనబడగానే అందరూ సంతోషంతో అరిచేవారు. ఎందుకంటే, అతను తమాషాగా ఉండి వింతలు చూపించేవాడు. ఏమి కలిగినా సరేనవ్వుతూ ఉండేవాడు. ఆ తర్వాత అతను అమెరికాలో ఉన్న రోజుల్లో బేస్ బాల్ ఆటనుకూడా నేర్చుకున్నాడు.

అతన్ని పనికి పెట్టుకున్నవారుకూడా అతనంటే చాలా ఇష్టపడేవారు. అతను పనిలో లీనమై చక్కగా చేసేవాడు. 15 ఏండ్ల ప్రాయంలోనే స్థానిక ఆరోగ్య భీమా కంపెనీలో నిర్వాహక కార్యదర్శిగా నియమింపబడ్డాడు. 16 ఏండ్ల వయసులో ఒక కూలీపార్టీ శాఖకు అధ్యక్షుడుగా ఎన్నుకోబడ్డాడు. అప్పటికే అతను మానవ సేవలోని మహాత్మ్యాన్ని అర్థం చేసుకొన్నాడు. అతడు అన్ని జాతులవారినీ ప్రేమించాడు. వారికి సహాయం చేయాలనుకున్నాడు. కాబట్టి, పనివారికోసం, వారి కుటుంబాలకోసం తానొక వకీలు కావాలనుకున్నాడు.

ఆ దృఢ సంకల్పంతో ఆస్లో విశ్వ విద్యాలయంలో న్యాయశాస్త్ర పాఠశాలలో చదువుతూ నార్వే దేశపు కూలివారి పార్టీలో పనిచేయసాగాడు. ఆ చదువు పూర్తికాగానే ఆ పార్టీకి ప్రధాన కార్యదర్శిగా నియమింపబడ్డాడు.

తన చిన్ననాటి ప్రియురాలినే అతడు పెండ్లి చేసుకొన్నాడు. ముగ్గురు కూతుళ్లు కలిగారు. ప్రతి కుమార్తె వయసురాగానే మంచులో తిరిగి, టెన్నిస్ ఆడి, పడవలలో పోయే జట్టులతో చేరేది. ట్రిగ్వేలీ ఎప్పుడూ తన ఇల్లు కుమార్తెల స్నేహితులతో నిండి ఉండడం చూచి ఆనందించేవాడు. ఎందుకంటే, అతనికి పడుచువారిపై చాలా ఇష్టం.

నార్వే దేశపు జాతీయ ప్రభుత్వం కార్మిక పక్షం వశంకాగానే ట్రిగ్వేలీ ముందు ప్రధాన సలహాదారుడుగాను, ఆ పైన న్యాయశాఖా మంత్రిగాను నియమింప బడ్డాడు. అతను న్యాయశాఖా మంత్రిగా ఉండి కార్మిక వివాదాలు పరిష్కరించవలసి ఉంది. రెండో ప్రపంచ యుద్ధానికి ముందు నార్వే దేశంలో ఏలాటిసమ్మెలూ ఉండేవికావు. ఎందుకంటే, ఇరుపక్షాల వారూ ట్రిగ్వేలీతో సంప్రతించేవారు. ఎలాగో దాదాపు అన్ని విభేదాలూ తీరిపోయేవి. అతను యజమానులచేత,

కూలీలచేత మెచ్చుకోబడేవాడు. కాని, అతనుమాత్రం న్యాయాన్ని తప్పేవాడు కాడు:

ఆ తర్వాత ట్రిగ్వేలీ నార్వే దేశపు వాణిజ్య శాఖా మంత్రిగా పనిచేశాడు. రెండో ప్రపంచయుద్ధం ఆరంభ మయిన కొద్ది రోజులకు అతను నార్వే వ్యాపార నౌకలకు తన అమూల్య రేడియో సందేశాన్ని వినిపించాడు. నాజీలు నార్వేపై దండెత్తారు. నార్వే దేశీయులు పోట్లాడడానికి సిద్ధపడ్డారు. ట్రిగ్వేలీ కార్యవర్గం ఒకచోటినుండి ఇంకోచోటికి తరుమబడ్డాకూడా వారు మాత్రం నాజీలు ఆక్రమించని ప్రదేశాలకు ధైర్యంగా సామగ్రిని పంపించేవారు.

నాజీలు వ్యాపారస్థుల ఓడలను తమకు వశం చేయాలని నిర్బంధించినప్పుడు ట్రిగ్వేలీ "వద్దు; మీారు వారికి లొంగవద్దు. మనపక్షంవారి రేవులలోకిపొండి" అని చెప్పాడు. వెంటనే ఓడల నావికులు అతనిమాట జవదాటకుండా అనుసరించారు.

నార్వే దేశపు ప్రభుత్వోద్యోగులతో లండనుకు పోయిన ఆఖరువాడు ట్రిగ్వేలీ. అక్కడనుండి వారు తమ ప్రభుత్వాన్ని నడిపారు.

యుద్ధం పూర్తికాగానే శాన్‌ఫ్రాన్‌సిస్కోలో జరిగిన ఐక్యరాజ్యాల సమావేశానికి నార్వేకు ట్రిగ్వేలీ

ప్రాతినిధ్యాన్ని వహించి, నార్వే విదేశ వ్యవహార మంత్రిగా హాజరయ్యాడు. ఆతని కుమార్తెకూడా సహాయ కార్యదర్శిగా అతనితోపాటు హాజరయింది.

ట్రిగ్వేలీని ఎరిగిన ఎవరుగాని అతడు ఐక్యరాజ్య సమితికి ప్రధాన కార్యదర్శిగా ఎన్నుకోబడ్డందుకు ఆశ్చర్య పడలేదు. అతను తన పదవిని స్వీకరిస్తూ, "నేను మీ అందరియొక్క సేవకుణ్ణి...మీ అందరియొక్క సహాయం తప్పక లభిస్తుందని నేను నమ్మి ముందుకు చూస్తున్నాను...మనం ముందు ముందు కష్టాలను ఎదుర్కోవలసి వస్తుంది గాని, పని ఎంత కష్టమైతే ఫలితమంత గొప్పది. సకల నాగరిక ప్రపంచ భవిష్యత్తు కూడా ఈనాడు అపాయకర పరిస్థితిలో ఉన్నది", అని చెప్పాడు.

# అన్ని భాషల్లోనూ అంతే

ఆర్టురో అనే బాలుడు స్కూలుకు పరుగెత్తి పోతున్నాడు. ఇప్పుడు ఎవ్వరూ అతన్ని ఈడ్చుకొని పోవడం లేదు. అతనికి ఇప్పుడు స్కూలుకు తప్పితే వేరే చోటికి పోవాలని లేనే లేదు. ఈనాడు అతన్నిచూచి తోటివారెవ్వరైనా నవ్వితే అతను మంచి జవాబిస్తాడు. అవహేళన చేసిన బాలురు అతని జవాబు చూచి సిగ్గుపడుతారు.

అతనికి మొన్నటినుండీ కలిగిన కష్టం చాలా ఇదిగా ఉంది. ఎందుకంటే తక్కిన వారంతా హాయిగా ఉన్నారు. అతనూ మొదట సంతోషంగా ఉన్నాడు. పులుసు, పాలు త్రాగడం చాలా ఆహ్లాదంగా ఉండేది. కాని, పాలు త్రాగడంచేత అతనికి కష్టం కలిగింది.

రెండు వారాల క్రితం ఆ ముసలి ఉపాధ్యాయుడు సంతోష కరమైన వార్తను తెచ్చినరోజు మధ్యాహ్నమే ఆ విషయం చెప్పి ఉంటే, ఆర్టురో యొక్క అవ్వ దాన్ని అర్థం చేసుకొని ఉండేది. ఆనాడు ఒక క్రొత్తమనిషి కారులో ఆ ఊరికి వచ్చాడు. అతను వెళ్ళిపోగానే ఉపాధ్యాయుడు ఇంటి ఇంటికీ పోయాడు. "ఒక వారానికే కాదు, చాలా వారాలవరకు ఆహారం వస్తుంది," అని అతడు చెప్పాడు. చాలా కాలంగా ఆకలితో బాధపడు

తున్న చిన్నవారి కంతా ఆహారం వస్తుంది. తమ ఇటలీ దేశపు ప్రభుత్వంతోపాటు భాగస్వాములుగా ఉన్న దూరదేశపు దయామయులైన స్నేహితులనుండి ఆహారం వస్తుంది. దిన దినమూ పాఠశాలలోని ఆడవారు ఒకరు మార్చి ఒకరు అన్నం వండి వడ్డిస్తారు.

ఆ ముసలి ఉపాధ్యాయునికి మంచివార్త తెలిసిందని ఎవరూ ఆశ్చర్య పడలేదు. యుద్ధం పూర్తికాగానే ఇంకెవ్వరూ ఉపాధ్యాయులు లేనప్పుడు అతనే స్కూలు నడుపుతానన్నాడు. అతను వృద్ధుడై శీఘ్రంగా అలసిపోయే స్థితిలో ఉన్నప్పటికీ, తానే స్వయంగా పాఠాలు చెప్పగల నన్నాడు. స్కూలు, ఇల్లు ధ్వంసమైపోతే ఏం? పిల్లలు పాఠాలకై అతని ఇంటికి రావచ్చు! అతని భార్యే ఆ మాట చెప్పింది. ఆ ఇల్లు చిన్నదయితే ఏం? వారంలో రెండు రోజులు పిల్లలు, మూడు రోజులు పెద్దలు చదువుకుంటారు. అంతే. "వారంతా సర్దుకోవచ్చు. ఏదో ఒకదోవ ఉండనే ఉంది" అని అతడు వారికి చెప్పేవాడు.

అతను చెప్పిన ప్రకారమే అంతా నడచింది. అతని దగ్గర ఒక్క చివికి పోయి, చిరిగిపోయిన భూగోళశాస్త్రం మాత్రమే ఉంది. అయితే నేం? ఆర్టురో బాలునికి, అతని తోడి పిల్లలకు కావలసిన వింత విషయాలన్నీ అతని తలలో ఉన్నవి. వారు పాఠాలు వ్రాసుకునేందుకు

*4

పెన్సిళ్ళుగాని, కాగితాలుగాని లేవు. కాని, అతని ఇంటి వెనుక నేల నున్నగా ఉండేది. మంచి దినాలలో వారు పుల్లలతో ఆ నేలలో వ్రాయడం నేర్చుకునే వారు. అవును, ఏదో ఒకమార్గం ఉంది.

ఆ తర్వాత ఆహారం వచ్చింది. మొట్టమొదటి సారిగా వేడివేడి సూపును రుచి చూచినప్పుడు అది ఎంత ఇష్టంగా, పసందుగా ఉందో, ఆ గిన్నెడు పాలు ఎంత బాగా ఉన్నాయో ఆర్టురో బాలుడు ఎన్నటికీ మరువ లేదు. ఆ దినం వంటమనిషి పిండితో తయారు చేసిన పాలను చూచి, ప్రతి ఒక్కడూ ఆశ్చర్య పోయాడు. నీళ్లలో కలుపబడి, కొంతసేపు నిప్పుపై పెట్టిన తరువాత చల్లగా చేయబడింది—అంతే! ఎంత చక్కనిపాలు. ఎవరు అనుకున్నారు అలా ఔతుందని.

ఆర్టురో ఇంటికి పోగానే ఆ ఎండవేళ భోజనాలు ఆరంభించినందుకు అతని అవ్వ చాలా సంతోషించింది. కాని, అతను పొడినుండి పాలను చేసిన విధం చెప్పగానే ఆమె కోపగించుకొంది.

ఆర్టురో ఎంతబాగా చెప్పాలో అంతచక్కగా చెప్పాడు. కాని, ప్రతి మాటకూ ఆమె కోపం ఎక్కువై "నీవు దాన్ని తాగకూడదు. అది ఇంకో పన్నాగం. ఆ



కొత్తవాడి కుర్రే. విషం—నిజంగా అదో విషపుపొడి" అని అరచింది.

అప్పుడు ఆర్టురో ఏమి చెప్పినప్పటికీ ఫలంలేక పోయింది. ఆమెమాట సరైంది. తన తప్పుకాదని ఆమెకు తెలుసు. ఇతరుల పిల్లలు చావచ్చు గాని, ఆమె కుటుంబానికి ఒక్కడుగా మిగిలి ఉన్న ఆర్టురోమాత్రం చావకూడదు. ఇది ఆమెకోరిక. అతనికి ఇప్పుడు 14 సంవత్సరాలు. ఆమె ఎంతో కష్టపడి అతనికి తిండి సంపాదించి పెంచింది. దాన్ని ఇప్పుడామె జ్ఞాపకానికి కూడా తెచ్చుకోలేదు. ఎవడో ఒకడు ఏదోపిండి తెచ్చిపెట్టి చంపేయాలనా ఆమె అతన్ని పెంచింది! కాదు!

"చెప్పు. ఆ విషపు పాలలో ఒక్కచుక్కకూడా తాకనని ఒట్టువేసి చెప్పు," అని ఆమె అతన్ని నిలదీసి అడిగింది. అతను అలానే అని చెప్పాడు.

మరుసటి దినం పిల్లలకు బడి. కాని, ఆ ఉపాధ్యాయుడు ఏర్పాటు చేసిన భోజనానికై పెద్దవారంతా వచ్చారు. ఆర్టురో రాగానే స్త్రీలందరూ అతని వైపు చూచారు. ఆ విషపు పొడి విషయం మీఅవ్వ మాతో కూడా మాట్లాడిందిలే అన్న భావం వారి చూపుల్లో అతనికి గోచరించింది. తన విషయం ఇతర బాలురకు తెలియకుంటే బాగుండునని అతడు అనుకున్నాడు. కాని,

వారికి తెలిసి పోయింది. విశ్రాంతి సమయంలో వారంతా అతనికై కనిపెట్టుకొని కూర్చున్నారు.

"అయ్యో పాపం! ఆర్టురో పాలుత్రాగ కూడదు" అని వారు అతన్ని ఎగతాళి చేయడం మొదలు పెట్టారు. అతని అవ్వను ఏమీ తెలియని దద్దమ్మ అని అన్నారు.

వారు ఆ మాటలు మాత్రం జాగ్రత్తగా గురువు గారు లేనిది చూచే అన్నారు. ఈ విషయం ఆర్టురోకు కూడా తెలుసును. పాలు బాగున్నాయని ఆ ఉపాధ్యాయుడు నమ్మాడు. కాని, ఆర్టురో యొక్క అవ్వ దాన్ని విషం అనడంబట్టి ఆమెకు అతనిపై నమ్మకం లేదని తేలింది.

నిన్న మధ్యాహ్నంవరకూ ఆర్టురో దాన్ని సహించాడు. కాని, ఆ ముసలి బడిపంతులు తలవని తలంపుగా ఇంటిచుట్టూ తిరుగుతూ, ఒకమూల పిల్లల ఎగతాళి కేకలన్నీ విన్నాడు. అతను నవ్వుకుంటూ వెళ్ళిపోయాడు. కాని, బడి వదలగానే ఆర్టురోను మాత్రం అక్కడనే వుండమన్నాడు.

"నీ కష్టం ఏం నాయనా? రెండురోజులుగా నీ విచారానికి అదేనా కారణం. దాన్ని నేను చూడలేదనుకున్నావా?" అని అడిగాడు.

ఆర్టురో తల ఆడించాడు గాని, జవాబు చెప్పలేదు.

"చెప్పు. అదేమిటో నేను తెలుసుకోవాలి ఆర్టురో!" అని అతను ఖచ్చితంగా అడిగాడు.

"ఆ పాల పిండినుండి తయారుచేసే పాలు మా అవ్వ నన్ను తాగవద్దంది," అని ఆర్టురో చెప్పాడు.

ఆ ఉపాధ్యాయుడికి కష్టంగా తోచింది. "కాని, నీకు ఇష్టంలేదని చెప్పావే" అన్నాడు.

"అది అబద్ధం. నేను దాన్ని మొదటి రోజున తాగాను. చాలా బాగుంది. కాని, మా అవ్వ దాన్ని విషమని అనుకుంది. దాన్ని తాగేవాళ్ళంతా జబ్బుచేసి చని పోతారని ఆమె చెబుతూంది. నన్ను తాగవద్దని ఒట్టు వేయించుకొంది. మరి ఆమె..." అంటూ అతను విచారంగా చెప్ప సాగాడు.

అలాగా! అని మధ్యనే ఉపాధ్యాయుడు అందు కున్నాడు. "ఆమె ఆ విషయం అందరికీ జంకులేకుండా చెప్పినట్లుంది. నన్ను, నా భార్యను మట్టుకు మినహా యించింది. నాకు ఎవ్వరూ ఆ విషయం చెప్పనందుకు ఆశ్చర్యంగా ఉంది. నీవు కూడా చెప్పలేదే ఆర్టురో!" అన్నాడు.

"మీరు పాలు బాగున్నాయని అన్నారండీ! అందు కనే మేము అనుకున్నాం మీకు—"

ఉపాధ్యాయుడు అందుకున్నాడు. 'నాకు అర్థమయింది నాయనా! నాకు నొప్పి కలిగించడం నీకు ఇష్టంలేదు. రా, మనం ఇద్దరం నీ అవ్వ దగ్గరకు పోదాం,' అన్నాడు.

వాళ్ళ అవ్వ ఇంటిముందు చెట్టుక్రింద కూర్చొని దూరంగా చూస్తుండడం వారు చూచారు. ఆమె ఉపాధ్యాయుణ్ణి గౌరవంగా ఆహ్వానించింది గాని, ఆనందంగా మాత్రం కాదు. ఆమె కండ్లలో విచారం కనబడుతూంది.

ఆ ఉపాధ్యాయుడు మాట్లాడడం మొదలుపెట్టగానే ఆమె దూరానికి చూడ సాగింది. ఆమె పెదవులు ఏదో ఒక నిశ్చితమైన అభిప్రాయాన్ని తెలుపుతున్నాయి. ఆమె నిర్లక్ష్యాన్ని లెక్క పెట్టకుండా అతను ఆ వూరి చిన్న వారికై ఆహారం పంపుతున్న స్నేహితులను గురించి మాట్లాడ సాగాడు. వారు ఆవిధంగా ఎలాగ చేయ గలిగారో, కొండల్లో వున్న తమ్ము ఎలా గుర్తించారో అతనికి ఇంకా తెలియలేదు. కాని, ఆ పని జరగడానికి కొంతకారణం తమ రోము దేశపు ప్రభుత్వం అని అతనికి తెలుసు. ఆ ఉపాధ్యాయుడు కూడా వారిని భాగ స్వాములు అని పిలచాడు. ముందు ముందు అతనికి కథ

పూర్తిగా తెలుస్తుందిలే. అప్పుడు అతను దాన్ని అందరికీ చెప్పగలడు.

నెమ్మదిగా చిరాకును తగ్గించుకొని ఆమె ఉపాధ్యాయుని చూచేందుకు తిరిగింది. కాని, అతను ఆ పాల పిండిని గురించి చెప్పడంతోటే తిరిగి కోపంతో, "లేదు. నా ఆర్టూరో దాన్ని తాగకూడదు" అని అరచింది.

"మంచి విషయం కానిదాన్ని నీకెప్పుడైనా చెప్పానా ముసలమ్మా! నామాట విను. అది విషంకాదు. దాన్ని పంపిన దూరదేశపు దయామయులు చాలా గౌరవనీయులు. ఇప్పుడు మూడు రోజులుగా మన చిన్నవారంతా ఆ పాలు త్రాగుతున్నారు. ఎవరికీ జబ్బురాలేదు. అప్పుడే వారి కండ్లు కాంతివంత మైనాయి. కాని, మన పిల్లవారికేకాదు సహాయం జరిగింది; మన దేశంలో అందరూ పాలు తాగుతున్నారు. వారెవ్వరూ చనిపో లేదే!" అని ఉపాధ్యాయుడు చెప్పాడు.

ఆ ముసలామె నిశ్శబ్దంగా ఉంది. తన వేళ్ళతో పైగుడ్డను మెలివేస్తూ నిలబడింది.

"నీవు ఈ మంచిదాన్ని ఆర్టూరోకు ఇవ్వవా? ఆ ఎండిన పొడికూడా పాలనుండే తయారు చేసినట్లుంది. నాకు ఇంకా సరిగా తెలియలేదు. కాని, నీవు కూడా ఆర్టూరోకు అందరివలె తాగమని చెప్పాలని నేను చెబుతున్నాను."

ఆ పెద్ద చెట్టుక్రింద కూర్చున్న ఆర్టురో తన అవ్వ ఎన్నటికీ బదులు ఇవ్వదని అనుకున్నాడు. కాని, కడకు ఆమె కండ్ల నీరు కారుస్తూ, చేతులు వణకుతూ "నా ఆర్టురో ఆ పాలు తాగవచ్చును," అని చెప్పింది.

ఆ ఉపాధ్యాయుడు నవ్వుతూ ఆదరంగా ఆమె భుజంపై తట్టుతూ "ముసలమ్మా! నీవు బాగా తీర్మానించావు. కాని, నేను ఇప్పుడు నీకో గొప్ప విషయం చెప్పాలి. మనకు ఆహారం తెచ్చేవారు రొట్టె చేసేందుకు కావలసిన వాటిని కూడా తెస్తారు. అప్పుడు ఆడవారంతా తమ ఇండ్లలో రొట్టెలు తయారుచేసి భోజన సమయానికి పాఠశాలకు తెస్తారు. నీ రొట్టెలు అందరికన్నా బాగుంటాయి కాబట్టి, నువ్వు ఆ రొట్టెలు తయారుచేసే వారిపై అధికారివిగా ఉండు. ఉండవూ?" అన్నాడు.

తిరిగీ ఆ ముసలామెకు కోపం వచ్చింది. ఈ మారు అధైర్యపడుతూ "లేదు, లేదు" అంది.

"అది మన చిన్నవారు తినేందుకు గదూ. దాన్ని జాగ్రత్తగా సరిగా తయారుచేస్తే వారికి చాలా బలం కలుగుతుంది," అని అతను చెప్పాడు.

తిరిగీ ఆమె పైగుడ్డ అంచు మెలివేస్తూ కొంతసేపు నిశ్శబ్దంగా ఉండి వణకే గొంతుతో "అలాగే చేస్తాలే,"

అని చెప్పి పైగుడ్డ నెత్తిన వేసుకొని ఇంట్లోకి పరుగెత్తింది.

అందుకే ఆర్టురో ఇప్పుడు బడికి, ఇతర పిల్లల దగ్గరకి అంత జోరుగా పోతున్నాడు. అందరి స్త్రీలలో రొట్టెలు చేసే వారిపై అధికారిగా అయ్యవారు ఎవరిని ఎన్ను కున్నారు? అందరూ ఏమీ తెలియని దద్దమ్మ అన్న ఆమెనే; అతని అవ్వనే! అందుకే అతనికి ఇప్పుడు అంత ధైర్యం!

ఆర్టురో బాలుడు ఉన్న ఇటలీ దేశపు గ్రామంలోని యువ జనులకు పంపబడిన పాలపిండి ఐక్యరాజ్య అంతర్జాతీయ శిశు సంరక్షణ నిధి సంఘంవారు తమ కార్యక్రమాన్ని ప్రారంభించినప్పుడు చేసిన ప్రణాళికలో ఒక భాగం.

ఈ సంఘం ముందు ఏం చేయాలి? అన్న ప్రశ్నకు బదులు చెప్పడం వారికి చాలా కష్టం అనిపించింది. వేల కొలది పడుచువారికి ఒకేమారు ఆహారం, బట్టలు, ఇళ్లు, వైద్యసహాయం కావలసిన సమయం. చాలా ముఖ్యంగా ఎవరికి సహాయం కావాలో వారు ఎలా నిర్ణయించ గలరు?

ముందు అందరికీ కావలసింది ఆహారం. కాబట్టి, ఆహారం ముందు పంపాలని వారు తీర్మానించారు. కాని,

ఎక్కడికి? ఐరోపాలో యుద్ధం మూలంగా నాశనమైన దేశాలకు, ఆసియా ఖండానికి, ఫసిఫిక్ దీవాలకు ఆకలితో అల్లాడుతున్న పడుచువారికీ, చిన్నవారికీ ఆహారం పంపించాలి. కాని, ఎక్కడో ఒక్క దగ్గర్నించి మాత్రమే పని ప్రారంభించాలి. ఐరోపా దేశంలోని వారికి ఆహారం శీఘ్రంగా అందగలదు కాబట్టి, వారు ముందు ఐరోపాలో పని ప్రారంభించాలని నిర్ణయించారు.

ఎలాంటి ఆహారం పంపడం అన్న మరో ప్రశ్న ఎదురైంది. ఎక్కువ పుష్టికరమైనదే గాక, నౌకలపై సులభంగా పంపడానికీ, చెడిపోకుండా నిలవ చేయడానికీ అనువుగా ఆ ఆహారం ఉండాలి. సులభంగా, చౌకగా, ఎక్కువగా వచ్చే ఆహారాన్నే నిధి కొనాలి.

ఈ విషయంలో శిశు సంరక్షణ సంఘంవారు ఆహార వ్యవసాయ సంఘంవారి యొక్క, ప్రపంచ ఆరోగ్య సంఘంయొక్క సలహాను అడిగారు. వారంతా కలసి చాలా సంవత్సరాలుగా పిల్లల పెంపకంలో ఆరితేరిన వారిని కొందరిని చేర్చి పుష్టికరమైన ఆహారాన్ని నిర్ణయించే సంఘాన్ని ఏర్పరచారు. ఆ సంఘంలో కెనడా, చైనా, క్యూబా, చెకోస్లోవేకియా, ఫ్రాన్సు, గ్రేట్ బ్రిటన్, గ్రీస్, హంగరీ, ఇటలీ, నార్వే, పోలెండ్, అమెరికా ఈ పన్నెండు దేశాలవారిని సభ్యులుగా నియమించారు.

వెంటనే వారు జవాబు చెప్పారు. పాలు, పాల పిండి, జున్ను, చేపనూనె, కొవ్వు పదార్థాలు, మాంసం, చేపలు, కోకో, చిక్కుడు కాయలు, వేరు సెనగగింజలు, పండ్ల రసం, చక్కెర మున్నగునవి పంపమన్నారు.

నిధికి అమ్మటానికై ఏ యే దేశాలలో ఈ ఆహారం ఉంది? టెలిఫోన్ ద్వారా, తంతిద్వారా, విమానాల ద్వారా ప్రపంచమంతా విచారించారు. వెంటనే జవాబులు వచ్చాయి. వారు చెప్పిన వెలలుకూడా చాలా తక్కువైనవే! నిధి ఎంత సరకుకు ఆర్డరు ఇచ్చినదో చెబితే మనం నమ్మలేం. మూడు సంవత్సరాల లోపల శిశు సంరక్షణ సంఘ అమెరికా నుండి కొనవలసిన పాలపిండి మాత్రం 24,50,00,000 లక్షల పౌనులకుపైగా ఉంది. దానితో ఎన్నోకోట్ల కప్పుల పాలు తయారు చేయవచ్చు.

ఎంత ఆహారాన్ని కొన్నప్పటికీ చిక్కిపోయి వున్న కోట్లకొలది చిన్నవారికి అది చాలదని వారు తెలుసుకున్నారు. వారు తలచిన దానికంటే ఎంతోమంది ఎక్కువగా శరణార్థులున్నారు. యుద్ధంమూలాన ధ్వంసమైన ఐరోపాలోని ప్రతి దేశపు ప్రభుత్వాన్నుంచీ ఉత్తరాలు రాసాగాయి.

అన్ని ఏర్పాట్లతో పాటు ఇంకొక్క ఏర్పాటుమాత్రం జరుగవలసి ఉంది. ప్రతి దేశపు ప్రజలు తమ ప్రభుత్వాం

ద్వారా ఐక్యరాజ్య సమితియొక్క అనుభవజ్ఞులను ఆహ్వానించందే ఆ దేశంలో పని జరుగలేదు. కాబట్టి, ఇప్పుడు యుద్ధంలో దెబ్బ తిన్న దేశాలలో పని ప్రారంభింప బడుతుంది. సంఘువారు నిర్ణయించి ఆ నిర్ణయాన్ని ప్రతి ప్రభుత్వానికీ తెలియు చేశారు.

"మేము రావాలని మీరు కోరుతారా?" అని తంతిని పంపించారు.

"ఎంత తొందరగా రాగలరో అంత తొందరగా రండి" అంటూ ఆల్బేనియా, ఆస్ట్రియా, బల్గేరియా, చెకోస్లావేకియా, ఫిన్‌లాండ్, గ్రీస్, హంగరీ, ఇటలీ, పోలెండ్, రుమేనియా, యూగోస్లావియా దేశాలవారు చెప్పారు. 1947 వ సంవత్సరం తర్వాత ఫ్రాన్స్ దేశం కూడా వారి సహాయం కోరింది.

"మాకు ఎక్కువ ఆహారం కావాలి," అని పోలెండ్ తంతి పంపింది.

ఒక్కొక్క దేశానికీ ఎంత ఆహారం ఓడలపై పంపించాలో తెలిసికొనేందుకై శిశు సంరక్షణ సంఘం అప్పుడు అమెరికా సంయుక్తరాష్ట్రాల శిశు సంరక్షణ సంఘపు సహాయ నిర్వాహకరాలుగా ఉండిన డాక్టర్ మార్థా ఎలియట్ అనే ఆమెను వివిధ దేశాలకూ పంపించారు. ఆమె వివిధ ప్రభుత్వాల అధికారులను

వారి వారి దేశంలో ఎంతమంది పడుచువారు బలహీన స్థితిలో ఉన్నారో అడిగింది. ఆమె ఆ ప్రభుత్వాలవారు తమకు తామే ఎంత ఆహారం ఇచ్చుకోగలరో, స్వయం సేవక సంఘాలు ఏంచేస్తున్నాయో అడిగి తెలుసుకొంది. ఆయా దేశాల రిపోర్టులతోకూడా "మీరు పంపే ఆహారాన్నంతా మేము మా బాల బాలికలకు యివ్వడానికి బాధ్యత వహించగలము. మీరు పంపే ఆహారంతోపాటు మా దగ్గర ఉండే ఆహారాన్ని, లేక మేం ఉత్పత్తిచేసే ఆహారాన్ని కలుపుకుంటాం," అనే హామీలనుకూడా తెచ్చింది.

ముందు ముందు ప్రాముఖ్యత వహించబోయే ప్రతి దేశపు ప్రజలూ తమ ప్రభుత్వాలద్వారా, నిధితో భాగస్వాములుగా ఉండడానికి అది మొదటి మెట్టు. ఐరోపా ఖండంలోని ప్రతి దేశమూ తనకు ప్రపంచ శిశు సంరక్షణ సంఘం ఇచ్చిన ఆహారంతో తానుకూడా అంత, లేక అంతకన్నా మించి ఆహారాన్ని కలుపుకుంది. దానితోపాటు ప్రభుత్వమూ, స్వయం సేవకులూ ఆహారం పంచిపెట్టే కేంద్రాల్లో పనిచేశారు.

తమ దేశాలలో సుమారు ఎంతమంది పడుచువారు, పసివారు చాలా తొందరగా నిధి సహాయానికై వేచి యున్నారో డాక్టర్ ఎలియట్‌తో చెప్పడానికి ఆ ప్రభుత్వాల వారికి వీలుకాలేదు. తిరుగాడుతున్న వారు,

ఇల్లులేనివారు-ఇలా ఎంతమంది ఉన్నారో ఎవరు చెప్పగలరు? కాని, వారికి సాధ్యమైనంతగా పనిచేశారు. శిశు సంరక్షణ సంఘం ఆఫీసులో ఆ సంఖ్యలన్నీ చేర్చి కూడగా కొన్ని లక్షలు కావడంచూచి వారు దిగ్భ్రమ చెందారు.

ఆహారాన్ని ఓడల కెక్కించి పంపడానికై ఏర్పాట్లు చేయబడ్డాయి. ఆ ఆహారం ప్రతి దేశంయొక్క ముఖ్య పట్టణానికి పంపబడుతుంది. అచ్చట నిధి తరఫున ఉండే ప్రతినిధి దాన్ని సహాయానికై కనిపెట్టుకొని ఉండే యువజనులకు పంపిస్తాడు. పెద్దపట్టణాల్లోని వారికీ, మారుమూలాలల పల్లెల్లోనివారికీ, కొండ ప్రాంతాల్లోని వారికీ, మైదానాల్లోని వారికీ ఆ ఆహారం పంపబడు తుంది. ప్రతిచోటా బాంబులమూలంగా ధ్వంసం చేయ బడిన రైలురోడ్లు, కూలిపోయిన వంతెనలు, విరిగి పోయిన బండ్లు ఉండగా ఆ పనిని వారు ఎలా చేయ గలిగారు? దృఢసంకల్పం ఉంటే చాలు కొండలను పిండి చేయవచ్చు. అంతే! వారు తమ దృఢ సంకల్పం చేతనే ఈ పనిని విజయవంతంగా నెరవేర్చగలిగారు.

మొట్టమొదట పాఠశాలల్లోనూ, అనాథ శరణా లయాల్లోనూ, ఆస్పత్రుల్లోనూ, క్రైస్తవ మఠాల్లోనూ, మరి ఇతర బహిరంగ ప్రదేశాల్లోనూ పాల గిడ్డంగులను పెట్టారు. ఇవి ఏవీ లేనిచోట్ల పొలాల్లోనూ, రోడ్ల

ప్రక్కల్లోనూ చిన్న గుడిసెలు వేశారు. పొయ్యి, మేజా పెట్టడానికీ, వచ్చిన పిల్లలూ, పెద్దలూ కూర్చోడానికీ స్థలమే ఉండేదికాదు. స్టవ్‌లు, కెటిల్‌లు, కట్టెలు లభించడం కష్టంగా ఉండినప్పటికిన్నీ పాల గిడ్డంగులు కట్టబడ్డాయి.

పనిచేసేవారిలో ఒక ఆమె ఇలా వ్రాసింది: "మేము 7½ గంటలకు వచ్చేవారం. తల్లులు రొట్టె ఇవ్వలేని పిల్లలకని కొంత రొట్టెను తెరవెనకాల ఉంచేవారం. 7¾ గంటలనుండీ పిల్లలు వచ్చేవారు. వారు చాలా చిన్నవారు. పసిపాపలను తలిదండ్రులో, అన్నలో తెచ్చేవారు. చిన్నవారంతా వేడిపాలకై గిన్నెలు పట్టుకొని వరుసగా వచ్చేవారు."

"చాలామంది పిల్లలు వేడి వేడి పాలతో అందరి వెనుకగా పోయి ఒక ప్రదేశంలో కూర్చొని ఆ వెచ్చని ఆవిరిపై తమ చేతులుపెట్టి వెచ్చచేసుకోవడం నేను చూచాను. కొన్ని క్షణాలకు వారు ఆత్రంగా మా దగ్గరకు వచ్చేవారు. మేము, స్వయంసేవకులు తయారు చేసిన రొట్టెలను వాళ్లకు ఇచ్చేవాళ్ళం. వాళ్లు రొట్టె కావాలని వస్తారేగాని అడిగేవారు కాదు. కొంతమంది ఉద్యోగస్థులు మాతోపాటు ఉండి పిల్లలు వెళ్లిన తర్వాత అదంతా శుభ్రం చేసేందుకు సహాయం చేసేవారు."

పాల గిడ్డంగులపని అయిపోతుంటే పడుచువారికై ఆహారం రాసాగాంది. వెంటనే అన్ని కేంద్రాల్లోనూ వేలమంది అన్నం తీసికొనేందుకు వచ్చేవారు. అది చాలా నిరాడంబరమైన భోజనం. పాలు, రొట్టె, సూపు. కాని, ఎంత హాయినిస్తుంది? ఆ భోజనాలకై అయ్యే ఖర్చులో సగం శిశుసంరక్షణసంఘం నిధి ఇస్తుంది. సగం ఆ దేశప్రభుత్వం భరిస్తుంది.

మొదటి చలికాలంలో ఐరోపాలోని భోజనపు కేంద్రాల సంఖ్య 30 వేలు. దినానికి 35 లక్షలమందికి పెట్టబడేది.

ఐక్య రాజ్యాలవారు కలిసి మెలసి ఒక్కసంఘంగా అన్నివిధాలైన పనులు చేయడం చాలా మహత్తరమైన భాగస్వామ్యం. ఒకజాతి తల్లులు ఇంకోజాతి తల్లులతో కలిసి రొట్టెలు తయారు చేశారు. పడుచువారు నిధి పని వారికి వంటచేయడంలో సహాయ పడ్డారు. అది వారి చదువులో వంట నేర్చుకునే భాగం. పడుచువారు కూర గాయలు పండించి భోజన కేంద్రానికి పంపేవారు. శిశుసంరక్షణ సంఘం కొత్తరకాల ఆహారాన్ని ఓడలకు ఎక్కించి పంపడానికి పనిచేసేవారు. షార్క్ అనే చేప నూనె, కాడ్ చేపనూనె కంటే 33 రెట్లు పుష్టికరమైనదని తెలియడంచేత, షార్క్ చేపనూనెను న్యూజీలెండ్‌లో తీసి కెనడాకు పంపి, పిల్లలకు సరిపోయే చిన్న

సీసాలలో పెట్టి, ఐరోపా దేశాలవారికి జాగ్రత్తగా పంపించేవారు. కొంకాయ నూనెను ఫిలిప్పైన్ దీవులనుండి చెకోస్లావేకియాకు చేర్చి అచ్చటినుండి ఇతర ఐరోపా దేశాలకు పంపించేవారు. దాన్ని పిల్లలు రొట్టెలపై వేసుకొని ఆనందంగా తినేవారు.

నెలనెలకు ఐరోపా దేశపు రేవులకు అంతకంతకు ఆహారంతో ఓడలు వచ్చేవి. మూడు సంవత్సరాల కంతా పన్నెండు దేశాలలోనూ కలిసి ప్రతిదినం భోజనం చేసేవారి సంఖ్య 69 లక్ష లయింది. జర్మనీ దేశపు పది లక్షల మంది పిల్లలకై కాడ్ చేపనూనె ప్రత్యేకపు ఏర్పాటు మూలంగా పంపబడింది.

నిధి భాగస్వాములు ఎక్కడెక్కడ అన్నం పెట్టారో అక్కడంతా పడుచువారు ఉత్సాహంగా గోడల పైనంతా కాగితాలు అతికించారు. వాటిపై "శిశు సంక్షేమ సంఘం" అనే పదం కనబడింది. అన్ని భాషల్లోనూ అంతే. ఆ కొత్త పదాన్ని అందరూ అర్థం చేసుకున్నారు. మొదట దాన్ని వారి వారి భాషలలో వ్రాసుకున్నారు గాని, అది అందరికీ అర్థంకాలేదు. అందుచేత, అసలుపదాన్నే అందరూ ఉపయోగించారు. కష్టం తీరిపోయింది.

ఆస్ట్రియా దేశపు పడుచు వారు చక్కని "శిశు సంక్షేమసంఘం," అని ప్రకటన కాగితాలు ముద్రించారు.

*5

వారు వాటిని వియన్నాలో ప్రదర్శించినప్పుడు తమ పనికి చాలా గర్వపడ్డారు. తర్వాత వాటిని లేక్ సక్సెస్ నగరానికీ, అమెరికా లోని పెద్దపెద్ద నగరాలకూ పంపించారు. చెకోస్లొవేకియాలో పాఠశాల — ప్రకటన కాగితాల పోటీ జరిగింది. అందులో గెలిచిన మోస్తరు అన్ని కేంద్రాలలో చూపెట్టడానికే సంఘంయొక్క 1949వ సంవత్సరపు క్రిస్‌మస్ కార్డులోగూడా అది ముద్రించబడింది. బొహీమియా దేశంలోని రూజోల్ఫోవ్ అనే చిన్నగ్రామంలో 8 ఏండ్ల జిక్తానెమ్కోవా రాసిన మోస్తరును అమెరికనులు తమ క్రిస్‌మస్ కార్డులలో ముద్రించారు. ప్రాగ్‌లోని న్యాయాధికారులు దాన్ని ఎన్నుకొన్నప్పుడు అది అంత చిన్నపిల్లయొక్క పని అని అనుకోలేదు.

ఆ చిన్న జిక్తా తన పటాన్ని ఉపాధ్యాయునికి అందిస్తూ "మేపోల్ అనే స్తంభంచుట్టూ పిల్లలు నృత్యం చేస్తుండే ఆనందాన్ని తెలుపుతుంది. పై భాగం చుట్టూ ఉన్న పూలమాల ఆనందంగా ఉండే పిల్లలసంఖ్య లెక్కలేదని తెలుపుతుంది," అని చెప్పింది.

చాలా పటాలు పిల్లలు ఆనందంగా చెప్పులు, గుడ్డలు, ఆహారం తీసుకోవడం చూపించాయి. పై వాటితోపాటు నిధివారు ఇప్పుడు మందులు, సబ్బులు పంపిస్తున్నారు. చెప్పులకు, గుడ్డలకు నిధి సంఘంవారు ఒక ఏర్పాటు



చేశారు. స్వయం సేవక సంఘంవారు చాలా బట్టలను, చెప్పులను పంపించారు. కాని, దానితోపాటు సంఘం ఉన్ని, దూది, తోలు వివిధ దేశాలకు పంపించారు. అక్కడివారు తమకు కావలసిన వాటిని తయారుచేసుకో వచ్చును. దీని మూలంగా ప్రభుత్వాలవారు నేతపని, గుడ్డల తయారు, చెప్పుల తయారు మున్నగు పనులు కల్పించారు. పనివారితోపాటు వేలకొలది స్వయం సేవకులుకూడా పనిచేశారు.

హంగరీలో స్త్రీ పురుషులు చెప్పులు, పిల్లల దుస్తులు తయారు చేశారు. చెకోస్లొవేకియాలో బిడ్డలకై ప్రత్తి వైద్యశాలలకు పంపబడింది. ఫిన్లాండులో ప్రత్తి స్కూళ్ళకు పంపబడింది. అక్కడ తల్లులు దానితో బిడ్డలకు దుస్తులు తయారుచేశారు. పడుచువారుకూడా పాల్గొన్నారు. బాలురు చెప్పులు చేయడం, బాలికలు గుడ్డలు కుట్టడం నేర్చుకున్నారు.

నాలుగు సంవత్సరాల లోపల శిశుసంరక్షణ సంఘం 50 లక్షల డాలర్ల విలువగల పదును చేసిన చర్మము, తోలు, ఉన్ని, ప్రత్తి ఎగుమతిచేసింది. లక్షలాది పిల్లల చెప్పుల జతలకు సరిపోయే చర్మం, కంబళ్ళకు సరిపోయే ఉన్ని, దుస్తులకు సరిపోయే దూది పంపబడింది.

కేంద్రాలలో ఎలా అభివృద్ధి జరుగుతూందో చూడ డానికి శిశు సంరక్షణ నిధియొక్క ప్రతినిధులు వెళ్ళి

నప్పుడు వారు అచ్చటి పనివారి బాధ్యతలు చూచి సంతోషపడ్డారు. ప్రతిదీ సరిగా ఉండినదని కాదు; జనులు అంతపని చేస్తున్నారని కాదు. కాని, 70 డిగ్రీల ఉత్తర అక్షాంశంలో ఉన్న ఫిన్లాండులోని నోర్గాన్ కేంద్రం లోని ఉపాధ్యాయుడుకూడా చాలా చక్కగా కృషి చేస్తూండడం చూచి వారు చాలా ఆశ్చర్యపడ్డారు. అది నిజంగా ఆశ్చర్య పడవలసిన విషయమే!

120 మంది జనులు నివసించే నోర్గాన్ గ్రామాన్ని చేరేందుకు పనివారు విమానంలో, పడవలో, బండిలో పోవాలి. నిధి పంపే ఆహారంకూడా అలానే పోతుంది. ఆ గ్రామంలోని 24 మంది పిల్లల బడి ఉపాధ్యాయుడు తన రికార్డు చూపించాడు. అతను చేస్తున్న పని అంతా అందులో ఉంది.

యుద్ధంనుండి పరుగెత్తి పోయిన అరబ్బులు ఎడారిలో తిండిలేక, ఇండ్లులేక, మందులేక కష్టపడుతున్నారని 1948 వ సంవత్సరం వేసవిలో పాలస్తీనా దేశంనుండి నిధివారికి తెలుపబడింది. వెంటనే సంఘం పనికి పూను కొంది. నెలకులోపలనే పదార్థాలన్నీ బీరూట్ నగరాన్ని చేరాయి. రెండు వారాలకంతా లెబనాన్, ట్రాన్స్ జోర్డాన్, ఉత్తర పాలస్తీనా, సిరియా, ఇజ్రాయిల్ కేంద్రాలలోని శరణార్థులకు ఆహారం చేరింది.

శిశు సంరక్షణ సంఘం, ఐక్యరాజ్య పాలస్తీనా శరణార్థి సహాయ సంఘం ఈ రెండుకూడా భాగస్వాములై వారికి సహాయం చేశాయి. పిల్లలకూ, పడుచువారికీ కనబడ్డచోట పాలు, అన్నం ఇచ్చేందుకై కేంద్రాలు నిర్మించారు. సిరియాలో రోమన్ల పెద్ద మహాలునందు పూరి గుడిసెలలో వందలాది జనులు నివసిస్తున్నారు. వేలకొలది ఏండ్లకు ముందు గుట్టల్లో చెక్కబడిన గుహల్లో మరికొందరు నివసిస్తున్నారు. హెబ్రాన్ నగరంలో వారు పూర్వపు సాలమన్ రాజు యొక్క వంటఇంటిని స్వాధీనపరచుకొన్నారు. సాలమన్ రాజు ఒకమారు హెబ్రాన్ నగరానికి వచ్చి అచ్చటి ప్రజల భక్తి, బీదరికపుబాధ చూచి కొంత నిధిని ఏర్పరచి ప్రపంచం ఉండేవరకూ బీదవారికి అన్నం పెట్టమన్నాడని ఒక కథ ఉంది. అప్పటినుండీ అచ్చటి ప్రజలు బీదవారికి అన్నం పెడుతున్నారు. కాని, యుద్ధం రావడంతో పెట్టటానికి అన్నం లేదని వారు తెలుసుకున్నారు. అప్పుడే సంరక్షణ సంఘంవారు వచ్చి సహాయంచేసి తిరిగీ దాన్ని మొదలు పెట్టారు.

దాదాపు 5 లక్షలమంది మధ్యప్రాచ్య దేశాలలోని యువతీ యువకులకూ, పిల్లలకూ, తల్లులకూ పుష్టికరమైన ఆహారం ఇవ్వబడింది. మందులు, గుడ్డలు, దుప్పట్లు తీసుకున్నారు. డాక్టర్లు, దాదులు తిరిగి పనిచేశారు. తల్లి

దండ్రులుకూడా వారితో కలిసి పనిచేశారు. ఏలాంటి అంటువ్యాధులూ రాలేదు.

శిశు సంరక్షణ సంఘాన్ని మెచ్చుకుంటూ ఎన్నో జాబులు రా సాగాయి. ఒజ్నికమ్, వెలాస్కో, మేజిరిసీ పట్టణాల్లోని విద్యార్థి సంఘాలు యిలా వ్రాశాయి: "మీరు మాకు చేసిన సహాయానికి మా హృదయ పూర్వకమైన కృతజ్ఞతను తెల్పుతున్నాం. మేం ఒక చిన్న కొండ ప్రాంతపు గ్రామంలో నివశిస్తాం. మాలో చాలామంది బాల బాలికలు చాలాదూరం నడచి పాఠ శాలకు రావాలి. మీరు పంపే పాలు, వెన్న, కొవ్వు, మాంసం, చేపనూనె మాకు సంవత్సరం పొడుగునా శక్తిని కలిగిస్తాయి. ఇప్పుడు మాకు సగటున రెండు కిలోగ్రాముల శక్తి లభించింది.

"ఇందుకు బదులుగా మానవ జీవితాలను మంటగలిపే యుద్ధాలు లేకుండా చేయుటకై దేశదేశాల మధ్య శాంతి ఒడంబడిక జరిపేందుకు మేం మాశక్తి కొలదీ పని చేస్తాం. మా పాఠశాల తరఫున మా కృతజ్ఞత తెలుపుతున్నాం."

ఆ జాబుతోకూడా 420 మంది కొండజాతి తలి దండ్రుల తరఫున, వారి పిల్లల తరఫున ఈ క్రింది పద్యం పంపబడింది:

మర్యాదగల వనితల్లారా!
ప్రాముఖ్యతగల పురుషుల్లారా!
మాపై చూపిన మీ దయకు
మరి మరి పెరిగే మంచి గుండెలకు
ఇదిగో నండీ హృదయ పూర్తిగా
ఆనందంగా అందరమూ అర్పిస్తున్నాం—
వందనాలను—అందుకోనండి.

వెలాస్కోలో కొండల నుండి
పచ్చిక బీళ్ళలో వడిగా నడచి
పాఠశాలకు పరుగున పోయే
బాల బాలికల తరఫున మేము
పదే పదే మీ కానందంతో
వందనాలను చేసెదమండీ!
పాఠశాలలో మెదడులె కాక
కడుపుల కూడా మేపెద రండీ!
పెట్టిన రొట్టె, కప్పులా కోకో
అంతా ఘుమ్మని వాసన వచ్చును
మంగళవారం తప్పరు ఎవ్వరు
ఏదో కారణ మొకటుంది.
అందుకు మేమో చిన్న విషయం చెబుతున్నాం
ఆనాడే మాకంతా కమ్మని సూపు ఇచ్చేది;
మా కంతా ఎంతో సంతోషం!

శారీరకంగా, మానసికంగా
మేమంతా హాయిగ ఉన్నాం—అని
చెప్పేందుకు గర్విస్తున్నాం.
అందుకే మేము ఆనందంతో
అందిచ్చే వందనాలను అందుకోనండి.
మీ కందరికీ ఆనందం ఐశ్వర్యాం
కలగాలంటూ ప్రార్థిస్తాం.
మా దేశానికి ఆహ్వానిస్తాం.
కొండజాతులం పిల్లవారలం
వెలాస్కోలో ఉన్నవారలం
ఆహ్వానిస్తాం రారండి.
వసంత ఋతువులో—కొండరావి
పిల్ల వాయువుల—వాసన కమ్మన!
పైన్ చెట్లు ఆనందంతో గలగల మంటాయ్.
రాచబాటలు వసంత కుసుమపు
సువాసనలతో రా రమ్మంటాయ్
భరద్వాజ పక్షులన్నీ పాటలు పాడును.
బెస్కిడి బాటలు గడచిన పిదప
ఆకాశంలో చుక్కలన్నీ
భూదేవిని అలంకరించి
ముద్దుగ మీతో మాటలాడగ

పరుగున వచ్చిన విధముగ
వెలుగుల జిమ్మను మీ పరమాత్మ.

వెలాస్కోలో పిల్లవారలం
మరువలేము మిమ్మెన్నటికీ.

ఇంకొక కవరులో ఒక వార్తాపత్రిక తునక కనబడింది. అందులో "బల్గేరియన్ తల్లులమగు మేము శిశు సంరక్షణ సంఘానికి కృతజ్ఞతను చూపిస్తున్నాం. మీరు మాకు ఇచ్చిన పదార్థాల సహాయానికే గాక, మొదటి నుండి అంతర్జాతీయ ఐక్యత—ఐక్యరాజ్య సమితి ఏర్పడ వలయునని, ఏర్పడగలదని మీరు నమ్మి నిరూపిస్తున్న సత్యానికి మేము సంతోషాన్ని చూపిస్తున్నాం," అని ఉంది.

# జట్టుల రాక

ఆ రోజు చాలా ఎక్కువగా పని చేయడం చేత ఆ దాది అలసి పోయింది. కాని, కోపెన్ హేగన్ నగరానికి జాబును రేపే పంపాలి. కాబట్టి, ఆమె లేచి తను జాబులు వ్రాసే పుస్తకాన్ని తీసుకొని లాంతరు యొక్క గుడ్డివెలుతురులో కూర్చుంది.

ఆమె చేతులు చలికి ముడుచుకొని పోవడం చేత పెన్సిలు పట్టుకొని రాయడమే కష్ట మనిపించింది. కాని, ఆమె తొందరగా రాసుకుంటూ నవ్వుకో సాగింది. ఆ పడుచువారు, ఆ పిల్లలు—ఎంత ముద్దుగా కనిపిస్తారు!

ఆమె జాబులో ఇలా రాసింది: "నేనూ, డాక్టర్ లుండ్, మిలుశ్యాస్ హాంబర్‌స్కా ఒక కారులో స్త్రిబో పట్టణానికి దగ్గరగా ఉన్న ఒక చిన్న పట్టణంలోని పాఠశాలకు బయల్దేరాం. డాక్టర్ లుండ్ కారును నడుపుతుండినాడు. రోడ్డంతా మంచుతో కప్పబడి వుంది. తటాలున కారు దొర్లి ఒక గోతిలో పడింది. మొదట మేమే దాన్ని రోడ్డుమీదకి లాగాలనుకున్నాం. కాని, వెంటనే సహాయం కావాలని గుర్తించాం. మేము దాటివచ్చిన దగ్గరి నగరంలోకిపోయి అడగ్గానే కొందరు రైతులు తమ జట్టులతో మాకు సహాయం చేయడానికై వచ్చారు. వారు కారును రోడ్డుపైకి లాగిన తర్వాత

వారిలో ఒకడు మాకు ముందు దోవ చూపించడానికి పూనుకున్నాడు. కొద్ది దూరంపోగానే ఆ రోడ్డుపై కారు పోవడానికి వీలులేక పోయింది. అందుచేత, మేము విలువ గల వస్తువులను మోసుకుంటూ ఆ పొలాలగుండా నడువ సాగాం.

"ఒక గంట తర్వాత మేము మాకై కనిపెట్టుకొని ఉన్న పంతులమ్మ పాఠశాలను చేరుకున్నాం. ఆ పంతులమ్మ మాకోసం చాలా శ్రద్ధ తీసుకొంది. మమ్మ తన వంట ఇంటికి పిలచి బట్టలు వెచ్చచేసి, వేడి వేడి టీ ఇచ్చి తినేందుకు కొంత ఆహారం ఇచ్చింది. ఆ తర్వాత మేము మాపనికి పూనుకొన్నాం. ఆ పని ముగిసే సమయంలో ఒక మనిషి వచ్చి, వాతావరణం మారడం మూలాన దాదాపు నూరుమంది పిల్లలు అచ్చటికి కొంత దూరంలో ఉన్న ఒక సత్రంలో వదిలిపెట్టబడి ఉన్నారని చెప్పాడు. వారు మా దగ్గరికి రావాలని ఉండినారు గాని, ఆ చెమ్మ నేలలో తగుల్కొన్నారు. దయచేసి మీరు వారి దగ్గరికి పొండి, అని ఆ మనిషి మమ్మ ప్రార్థించాడు. మేం ఎలా కాదనడం? మంచు పైన పోయే బండ్లు ఏవీ లేకపోవడం చేత రెండు గుఱ్ఱాల సామాను బండిని ఒక దానిని ఆ పంతులమ్మ మాకు ఏర్పాటు చేసింది. దానిపై మేం బయలుదేరాం. మాకు ఆ పంతులమ్మ ఇచ్చిన కొన్ని మాంసం

ముక్కలు మాత్రం ఉండినాయి గాని దుప్పట్లు లేవు. ఆ రోడ్డు బాగా లేదు. చాలా చోట్లలో ఎత్తుగా, ఇరుకుగా ఉంది. రెండు ప్రక్కలా మంచు పేరుక పోయింది. చలి మూలంగా నేం ముడుచుక పోయాం. కాని, అక్కడికి చేరుకున్నాం."

ఆమె డెన్మార్క్ దేశపు ఎల్స ఆండ్రియాప్సన్ అనే ఆమె. డాక్టర్ లుండ్ తోనూ, కుమారి హాంబర్ శాక్ తోనూ కలిసి చెకోస్లావేకియా దేశంలో బి.సి.జి. జట్టును స్థాపించింది. ఐరోపా దేశంలో యుద్ధం మూలంగా నాశనమైన దేశాలలో తిరిగే ప్రతి జట్టూ చేసే పనే ఆమె ఇప్పుడు వ్రాసింది. వారంతా కూడా స్కాండినేవియా దేశాల రెడ్ క్రాస్ సంఘాలయొక్క శిశు సంరక్షణ సంఘంలోనివారు.

క్షయ దగ్గునుండి కాపాడేందుకై ప్రజలకు వేసే సూది మందును బట్టి వారి సంఘాలకు బి. సి. జి. అనే పేరు వచ్చింది. కాల్ మెట్టీ, గ్యారిన్ అనే ఇద్దరు ఫ్రెంచి దేశపు డాక్టర్లచేత ఆ మందు కనిపెట్టబడింది. వారు ఇద్దరూ మొదటి ప్రపంచ యుద్ధ సమయంలోనూ, దాని తర్వాత చాలా కాలంగా పరిశోధించి ఆ మందును కనిపెట్టారు. రెండో ప్రపంచ యుద్ధ కాలంలో నాజీలు తమపై దండెత్తినప్పుడు తమ పిల్లలను, బాలురను, పడుచు వారిని కాపాడు కోడానికై

డేనులూ, నార్వే దేశీయులూ ఆ మందునే ఉపయో గించారు. వారే ఐరోపా దేశీయులందరికీ ఆ మందును ఉపయోగించాలని ఐక్యరాజ్య సంఘానికి చెప్పారు. స్కాండినేవియా దేశాలలోని బి.సి.జి. సంఘం వారి కార్యక్రమం చాలా సులభమైంది. డెన్మార్కు దేశపు, నార్వే దేశపు డాక్టర్లూ, నర్సుల జట్లులూ కావలసిన పరికరాలతో పోయి, ముందుగా పిల్లవారికీ, పడుచు వారికీ క్షయదగ్గుగురించి పరీక్ష చేశారు. డాక్టర్ రాబర్ట్ కోల్ అనే జర్మనీ దేశపు శాస్త్రజ్ఞుడు కనిపెట్టిన ఆ పరీక్ష మూడునాలుగురోజుల్లోపల ఒక మనిషికి క్షయ దగ్గు ఉండేదీ, లేందీ తెలుపుతుంది. దగ్గు లేనివారికి రాకుండా టీకాలు వేస్తారు. ఉన్నవారికి ఎక్స్ రే ఫోటోలు తీసి పరీక్షించి ఆస్పత్రులకు పంపిస్తారు.

కోపెన్ హేగన్, ఆస్లో నగరాల్లోని పరిశోధనా లయాలు ఎక్కువకాలం పనిచేసి క్షయదగ్గు మందులనూ, పరీక్షించే యంత్రాలనూ తయారుచేసేవి. డాక్టర్లూ, నర్సులూ తాము ఎన్ని గంటలు పనిచేశారో చూచు కొనే వారు కాదు. కాలం జరిగేకొద్దీ క్షయరోగుల సంఖ్య తగ్గిపోసాగింది.

యుద్ధం ముగిసింది. కాని, పలు దేశాలనుండి పసివారికీ, పడుచువారిక ఎక్కువగా క్షయదగ్గు ఉందని చెప్పగా డేనులు వెంటనే సహాయానికి పూనుకున్నారు.

వారు తమ రెడ్ క్రాస్ సంఘాలద్వారా, ఆరోగ్య సంఘాల ద్వారా బి. సి. జి. జట్టులను తయారుచేసి 1946 వ సంవత్సరం యూగోస్లావియా దేశంలోనివారికి సహాయం చేయమని పంపించారు. వారితోకూడా స్వీడన్ దేశపు జట్లు, నార్వే దేశపు జట్లు చేరి ఆస్ట్రియాలో, చెకోస్లావేకియాలో, జర్మనీలో, హంగరీలో, ఇటలీలో, గ్రీసులో, పోలెండ్ లో పని ప్రారంభించాయి. వారంతా చాలా బాగా పనిచేశారు. సహాయం ఎక్కువగా కావలసి ఉండడంచేత, వారు పడ్డ అంత కష్టం మూలాన కూడా తగిన సహాయం జరుగలేదు. అందుచేత, వారు ప్రపంచ ఆరోగ్య సంఘంయొక్క, శిశు సంరక్షణ సంఘంయొక్క సహాయాన్ని కోరారు.

మీరు మాతో చేరరా? అని వారు అడిగారు.

కాని, అప్పటికే ప్రపంచ ఆరోగ్య సంఘం క్షయదగ్గు నివారణకై పనిచేస్తూంది. అది స్థాపించబడిన వెంటనే క్షయదగ్గు విషయంలో అనుభవజ్ఞులైన కొంతమందిని నియమించి వారిని పోయి ప్రతిదేశ ప్రభుత్వానికీ ఆ వ్యాధి విషయంగా దాన్ని ఎలా అరికట్టాలో, ఎలా మాన్పాలో సలహా లివ్వమని చెప్పింది. కాబట్టి, స్కాండినేవియావారు దాని సహాయాన్ని అడగడం చేత, దానికి పడుచువారిని కాపాడే అవకాశమే కాక, బి. సి. జి. లో తన పరిశోధనలను ఇంకా ఎక్కువగా

జరుపడానికి కూడా అవకాశం లభించింది. వారు వెంటనే చేరేందుకు అంగీకరించారు. శిశు సంరక్షణ సంఘంకూడా అందుకు సమ్మతించింది. పైగా దానిలో తగిన డబ్బు ఉండడంచేత ఎక్కువగా పని చేసేందుకు కూడా వీలుకలిగింది.

తిరిగీ గొప్ప అనుభవజ్ఞులను పంపేందుకు ప్రపంచ ఆరోగ్య సంఘంతోనూ, డాక్టర్ల, నర్సుల జట్లను పంపేందుకు స్కాండినేవియా దేశస్థులతోనూ, పదార్థాలూ, పరికరాలూ పంపేందుకు శిశు సంరక్షణ సంఘంతోనూ, ప్రభుత్వాలతోనూ భాగస్వామ్యం ఏర్పడింది. ప్రభుత్వాలుకూడా తమ తమ దేశంలో కాగల ఖర్చుల భరించడానికి ఒప్పుకున్నాయి. భాగస్వామ్యంలోని ఒక భాగస్థుడు కూడా వెనకడుగు వేయకూడదు.

డేనుల రెడ్ క్రాస్ సంఘానికి సంబంధించిన డాక్టర్ ఎస్తర్ అమండ్‌సన్ అనే ఆమె ఆ కార్యక్రమానికంతా పెద్దగా నియమింపబడింది. ఆమె సలహాల ప్రకారం బి. సి. జి. జట్టులకు డాక్టర్లూ, నర్సులూ మొదట స్కాండినేవియానుండీ, తర్వాత వివిధ దేశాలనుండీ ఎన్నుకోబడ్డారు. ఆ జట్లు ఆల్బేనియా, బల్గేరియా, చెకోస్లావేకియా, ఫిన్లాండు, గ్రీస్, హంగరీ, ఇటలీ, పోలెండ్, రుమేనియా, యుగోస్లోవియా, జర్మనీ దేశంలోని బ్రిటీష్, అమెరికావారి ప్రాంతాలలోని

స్థలాలకూ పోయారు. ప్రతి దేశంలోనూ స్కాండి నేవియా వారు కొత్తవారిని చేర్చుకుంటూ వారికి అన్ని పనులూ నేర్పించారు.

చాలా దేశాలు పంపిన కారులూ, మందులూ ఐరోపా ఖండంలోని జట్లకు నౌకలపై పంపించబడ్డాయి. మొదట ప్రతిజట్టుకూ కావలసిన సామగ్రి చాలా కొద్ది పాటిదిగా ఉండింది. కాని, కాల క్రమేణా కార్లలో చాలామంది డాక్టర్లను, నర్సులను, యంత్రాలను తీసుకపోయేవారు.

బి. సి. జి సూది మందు ఒక కొత్త చిక్కును కలిగించింది. అది తయారైన కొద్ది కాలంలోపలనే ఉపయోగింపబడాలి. కాబట్టి ఒక విమానాన్ని కొన్నారు. అది కోపెన్‌హేగన్‌లోని జేనుల పరిశోధనశాలనుండి ఇతర పట్టణాలకు రకరకాల మందులు తీసుకునిపోతూ తిరుగుతుంది. కొద్దికాలం తర్వాత అమెరికా సంయుక్త రాష్ట్రాలవారు ఒక విమానాన్ని పంపారు.

వారు ఇతర ప్రదేశాలకుకూడా పోయారు. పల్లెల్లోని, పట్టణాల్లోని పిల్లల దగ్గరికీ, పడుచు వారి దగ్గరకీ వెళ్ళారు. ఎక్కడెక్కడ బాలబాలికలు చేరి ఉంటారో అక్కడికంతా పోయారు. కొంతమంది పిల్లలు సూది మందు వేసుకోవడంలో కొరకడం, కొట్టడం, కొంతమంది

నవ్వుకొని సూది వేయించుకోవడం అక్కడివారందరికీ అలవాటైపోయింది.

ఆ సూది వేసేచోట ఉన్న తమాషాను చూచి ఒక పిల్లవాడు ఇంకో పిల్లవాడి కార్డును తీసుకొని రెండోసారి పోయాడు. పని తొందరలో ఉన్న నర్సు అతన్ని సరిగా గమనించలేదు. కాని, మూడోతూరి పోగానే అతన్ని పట్టేసింది.

ఒక పాఠశాల దగ్గర బాలురంతా పరీక్ష చేయబడ గానే ప్రతి వానికీ ఒక ఎర్రని లేక నీలం కార్డును ఇచ్చారు. ఎర్రకార్డు వారంతా ఒకవైపూ, నీలంకార్డు వారంతా ఇంకోవైపూ చేరి ఫుట్ బాల్ ఆటను ఆడడం డాక్టరు చూచాడు. యూగోస్లావియా దేశంలోని నొవా గ్రేడిస్కా నగరం దగ్గర ఒకపల్లె పాఠశాలలోని బిడ్డలను పరీక్షిస్తూ కేరన్ గెయ్ ర్సా అనే నర్సు ప్రతిబిడ్డనూ పరీక్షకై తనతొడపైన కూర్చో బెట్టుకునేది. కనిపెట్టుకొని వుండేవారి వరుసలో ఒక 17 సంవత్సరాల యువకుడు ఇదంతా చూచాడు. కాని, అతను కూడా నెమ్మదిగా ఆమె తొడపై కూర్చున్నాడు.

దిన దినమూ, వారం వారమూ బి. సి. జి. జట్లు పనిచేశాయి. అందరూ ఎక్కువ గంటలు పనిచేశారు. కొందరు డాక్టర్లు, నర్సుల సహాయంతో పెద్ద నగరా లలో దినానికి ఎన్నివేల మందికి సూదులు వేయ

గలరో అన్నివేల మందికి వేశారు. రెడ్ క్రాస్ సంఘం పనివారూ, స్వయం సేవకులూ బిడ్డల తలిదండ్రులకు వారెందుకు పని చేస్తున్నదీ ఎంతో విపులంగా చెప్పినప్పటికీ ఇంకా విశదంగా చెప్పడానికి కాలం వ్యర్థం చేయవలసి ఉండేది. భాషకూడా చాలా కష్టంగా ఉండేది. కొన్ని సమయాల్లో తర్జుమా చేసేవారు తప్పులు చెప్పేవారు. పోలెండ్ దేశంలోని ఒక పాఠశాలలోని గుంపును చూచి ఒక డేనిష్‌నర్సు దయచేసి వరుసగా నిలబడండి అని చెప్పగా అందరూ ఒకరిపైన ఒకరు నిలబడాలని అనుకున్నారు.

డెన్మార్క్ దేశంనుండి మొదటి బి. సి. జి. జట్టులో ఒకడుగా పోయిన జాన్‌బుంక్లెన్ అనే ఆయన శిశు సంరక్షణ సంఘానికి ఇలా వ్రాశాడు: "మేము యూగోస్లావియాకు పోతూ నగరాలకూ, పట్టణాలకూ, పల్లెలకూ పోయాం. ప్రతి చోటా మేము యుద్ధంలో జరిగిన విధ్వంసమంతా చూచాం. అప్పుడే వాటిని రిపేరు చేయడానికి చురుకుగా జరుగుతున్న పనులను కూడా చూచాం. ప్రతివాడూ సహాయం చేస్తున్నాడు. ఒక చోట కొందరు 13–16 సంవత్సరాల బాలురు ఒక రైలు రోడ్డును నిర్మించడం మేము చూచాము.

"చాలా పట్టణాలు పెద్ద పల్లెల్లా కనిపించేవి. ఒక ముఖ్యమైన బాట, దానికి రెండు ప్రక్కలా రైతుల

ఇండ్లూ కనిపిస్తాయి. రైతులు పశువుల్ని రాత్రుల్లో అక్కడ పెట్టుకొని పగలు పొలాల్లోకి తోలుకు పోయే వారు. మేం తెల్లవారీ, సాయంకాలమూ చూచిన పశువులతోనూ, ఎద్దుబండ్లతోనూ, జట్కాల తోనూ, ఇతర సదుపాయాలతోనూ నిండి చాలా ఇరుకుగా ఉండే స్థలాలను మీరు ఊహించుకో వచ్చును.

"చదువనూ, వ్రాయనూ తెలియని దూర ప్రాంతపు జనులకు మేము అవన్నీ నోటి మాటలతోనే తెలియ చెప్పే వారము. మేము సూదిమందు ఎప్పుడు వేస్తామో, ఎక్కడ వేస్తామో దండోరా మూలంగా తెలిపించే వారము. దానికీ వారు రాకపోతే ఒక రెడ్ క్రాస్ సంఘం మనిషి ఇంటింటికీ పోయి చెప్పేవాడు. అలా మేము చాలా మందికి మందు వేయ గలిగాము. సోంబర్ అనే చోట మేము నూటికి తొంభై మంది పసుచు వారికి టీకాలు వేశాము.

"మా ఆస్పత్రి ఎలా పని చేస్తుందో మీరు తెలుసు కోవాలని నా కోరిక. మా దగ్గరికి పిల్లలను తీసుకువచ్చే తలిదండ్రులు చాలా దూరంనుంచి వచ్చే వారు. వారు సాధారణంగా అర్ధరాత్రి బయల్దేరి ఎద్దు బండ్ల మీదో, గుఱ్ఱాల బండి మీదో, లేక నడిచో వస్తే, మేము పని ముగించే సమయానికి మమ్మల్ని చేరుకునే వారు. వారు అంత దూరంలో ఉండడం మూలాన

ఇంటిలో వారందరూ ఒకే మారు బయల్దేరి కట్టెలూ, ఆహారమూ తెచ్చుకునే వారు. వారికి అదంతా ఓ వన విహారంలా ఉండేది. ఎక్స్‌రే యంత్రం క్రింద ఉండడం చేత వారు తమ వ్యాధులన్నీ పోతాయని అనుకునే వారు. వారికి అది చాలా తమాషాగా ఉండేది.”

యూగోస్లావియా దేశంలో క్షయదగ్గు ఒక చెడ్డ వ్యాధి. యుద్ధకాలంనుంచీ అక్కడ లక్షమంది జనులకు 300 మంది ప్రకారం క్షయరోగం మూలంగా చనిపోతున్నారు.

బి. సి. జి. సంఘం పని ప్రారంభించిన రెండేండ్ల కంతా తొమ్మిది దేశాల్లో 1,40,00,000 మంది ప్రజలకు పైగా క్షయ దగ్గు పరీక్ష చెయ్యబడింది. వీరిలో సగం మందికి పైగా సూదిమందు వేశారు.

ప్రతిచోట డాక్టర్లూ, నర్సులూ, జట్టులూ స్నేహితుల వలె ఆహ్వానించబడ్డారు. వేసవి కాలంలో వారి కార్లూ, బండ్లూ పూలతో అలంకరించబడేవి. వారిని పాటలు ఆహ్వానించేవి. వారికి బహుమతులు కూడా చాలా వచ్చాయి. తన మనుమళ్ళూ, మనుమరాళ్ళూ సూది మందు వేసుకున్న తర్వాత రుమేనియా దేశంలో ఒక ముసలామె ఒక మూటతో అక్కడికి వచ్చింది. ఆ మూటను విప్పి ఒక కోడి గ్రుడ్డును తీసి అచ్చటి నర్సుకి ఇచ్చింది.



పిల్లలు ఇండ్లలో చేయబడిన ముతుక ఆట బొమ్మలను తమ కొత్త స్నేహితులకై తెచ్చారు. పెద్ద వారు అందంగా నేసిన పైదుస్తులూ, టోపీలూ, వెండి గిన్నెలూ తెచ్చారు. ఒక పోలెండ్ దేశపు పాఠశాలలో తొమ్మిది సంవత్సరాల బాలుడు తాను చిత్రించిన ఒక పటాన్ని డాక్టరుకు బహుమతిగా ఇచ్చాడు. ఆ బొమ్మలో డెన్మార్కు నుండి ఒక స్టీమరు వచ్చినట్లూ, ఆ స్టీమరుపై పోలెండు దేశం యొక్క, డెన్మార్క్ దేశం యొక్క జెండాలు ఎగురుతున్నట్లూ, వాటిని రక్షించేటట్లూ చిత్రించాడు.

పరీక్షమూలంగా క్షయదగ్గు ఎక్కువగా ఉన్నదని తేలిన వేలకొలది పిల్లవారికి ఎక్కడ వీలైతే అక్కడ వైద్యశాలల్లో రక్షణ ఇవ్వబడింది. అక్కడకూడా శిశు సంరక్షణ సంఘం సహాయపడింది. వందల కొలది ఎక్సరే మిషన్లూ, కావలసిన మందులూ, కొత్తగా కనిపెట్టబడిన మందులూ పంపబడ్డాయి. పది దేశాల్లోని 30 వైద్య శాలలకూ కావలసిన కొత్తమందునంతా శిశు సంరక్షణ సంఘం పంపింది. ఒక్క పోలెండ్ దేశానికి మాత్రం 152 ఆస్పత్రులకు సరిపోయే ఎక్సరే మిషన్లూ, మిగతా వస్తువులూ పంపింది. ఐరోపా ఖండంలో బి. సి. జి. పని బాగా అభివృద్ధి అయిన వెంటనే ఇతర ఖండాలలోకూడా ఆ పని చేయడానికై ప్రపంచ ఆరోగ్య సంఘమూ,

శిశుసంరక్షణ సంఘమూ పూనుకున్నాయి. ఉత్తర ఆఫ్రికాలో వెంటనే పని జరగాలని నిశ్చయించి ఆల్జీరియా, మొరాకో, టునీషియా ప్రదేశాలనుండి డాక్టర్లను ఎన్నుకొని వారిని ఐరోపాఖండానికి పోయి అచ్చటజరిగే పనినిచూచి నేర్చుకొనమని పంపించారు. ఆ తర్వాత ఈజిప్ట్ టాన్‌జీర్స్, ఇజ్రాయిల్, లెబనాన్, సిరియా ప్రాంతాల్లోని వారు కూడా పోయారు.

కొద్ది కాలానికే పనిచేస్తున్నవారి ఉత్తరాలు రాసాగాయి. మొరాకోనుండి డాక్టర్ మాక్స్ పెల్లెట్ అనే అయన, "నేను సుల్తాను నగరులోనూ, మార్కెట్ దగ్గరా, మసీదుల దగ్గరా నాపని చేస్తున్నాను. నేను ఎప్పుడూ అంతటి గుంపులను చూడలేదు! పిల్లలకూ, పెద్దలకూ టీకాలు వేయడం అంతపెద్ద కష్టమైన పనిగా కన్పించలేదు. కాని, నా ఆల్కహాల్ దీపాన్ని ఆర్పివేస్తూ, నా కాగితాలను ఎగురగొడుతూ, కండ్లలోకీ సామాన్లలోకీ ఇసుకను వెదచల్లుతున్న గాలిబాధ చాలా కష్టంగా ఉంది," అని వ్రాశాడు.

బి. సి. జి. జట్టుల విషయం సుల్తానునుండి వివిధ ప్రాంతాల పెద్ద అధికారులకు తెలిసింది. ఎంత తొందరగా ఆ వార్త అందరికీ వ్యాపించిందో చూచి డాక్టర్లూ, నర్సులూ చాలా ఆశ్చర్యపడ్డారు. మొరాకో దక్షిణ ప్రాంతాలకు పంపబడ్డ డాక్టర్ క్లాడ్ సైమన్ అనే

ఆయన ఎడారిలోని ప్రతి ఊటచెలము దగ్గరా తన్నూ, తన జట్టునూ ఆహ్వానించడానికై ఆ తెగవారంతా తమ పిల్లలతో కూడా వేచివుండడం చూచి చాలా ఆశ్చర్య పడ్డాడు.

బి. సి. జి. సూదిమందు చెడిపోకుండా ఉండేందుకు ఆఫ్రికాలోని ప్రతికారూ ఒక రెఫ్రిజిరేటరునో, చలువ పెట్టెనో కలిగి ఉండేది. ప్రతిదీ కేంప్‌కు సరిపోయే వస్తువులనూ, అమర్చిన పరికరాలనూ కలిగి ఉండేది. వాటికి అవన్నీ కావాలి. డాక్టర్ జీన్ మైకేల్ మిల్లెట్ అనే ఆయన మొరాక్కోలోని తన అనుభవాలను ఇలా వ్రాశాడు :

'మొరాక్కోలో మొదటి మూడు నెలల్లో మాకు కలిగిన పెద్ద చిక్కు ఏమిటంటే, రైలు పట్టాలనుకూడా పెకలించుకపోయే వరదలు వచ్చేటట్లు కురిసిన వర్షమే. కొన్ని మార్లు వందమైళ్ల వరకూ మేము ప్రయాణాం మానుకొని ముందుండిన రోడ్లను రిపేరు చేసుకో వలసి ఉండేది. కాని, అట్టి కష్టాలు కలిగినప్పటికీ మేము దినానికి 50 నుండి 100 కిలోమీటర్ల వరకూ ప్రయాణాం చేసే వాళ్ళము.'

"అచ్చట ప్రజలకుగల మూఢ నమ్మకం కూడా మాకు చాలా అంతరాయం కలిగించింది. అట్లుండినప్పటికీ మేము ఏమిచేసేదీ ప్రజలు అర్థం చేసుకొన్నందుకు మాకు చాలా

ఆశ్చర్యంగా ఉంది. వారు మాపనికి చాలా మెచ్చు కున్నారుకూడా. మాపని పూర్తికాగానే అక్కడివారంతా చేరి మాంసం మొదలైన పదార్థాలతో మాకు ఓ పెద్ద విందుచేసే వారు. పురుషులు ఆడేవారు; స్త్రీలు పాడే వారు; కొన్ని సమయాల్లో పాము డాన్సుకూడా చేసే వారు. మా కెంతో ఆనందం కలిగేది."

ఐరోపా ఖండంలోని ఆహార కేంద్రాలతోనూ బి. సి. జి. జట్లులతోనూ కలసి పనిచెయ్యడంలో మునిగి ఉన్నప్పటికీ శిశుసంరక్షణ సంఘంవారు మాత్రం ప్రపంచంలోని పడుచువారిలో సగం మందికి పైగా నివసించే ఆసియా ఖండాన్ని మఱిచి పోలేదు. ఐరోపా ఖండమంతా తిరుగుతూనే, ఆ సంఘంయొక్క ఒక బి. సి. జి. జట్టు బర్మా, ఇండోచైనా, ఇండోనేషియా, పాకిస్థాన్, ఫిలిప్పైన్, హాంకాంగ్, సింగపూర్, ఉత్తర బోర్నియో, సారవాన్, బ్రునెయ్ ప్రదేశాల్లో తిరిగింది. ఆ జట్టులో అమెరికా సంయుక్త రాష్ట్రాల ఆరోగ్యశాఖ మాజీ ప్రముఖ వైద్యుడగు డాక్టర్ థామస్ పారన్ అనే ఆయనా, ఇండియా ఆరోగ్య శాఖనిర్వాహకుడు డాక్టర్ సి. కె. లక్ష్మణన్ అనే ఆయనా ఉండినారు.

వారు చూచిన ప్రతిచోటా ఆయా దేశాల పడుచు వారి విషయమై ప్రభుత్వాలనూ, ఆరోగ్యశాఖాధి కారులనూ అడిగారు. వారు ఉపాధ్యాయులనూ, వివిధ

మత ప్రచారకులనూ, బాల బాలికలనూ విచారించారు. ఇంకా పాఠశాలల్లోని, ఇండ్లలోని పిల్లల దగ్గరికి స్వయంగా కూడా పోయారు.

వారు ఏమి చూచారు? ఆసియాలో ప్రతిచోటా ప్రజలు ఆకలిమంటతో బాధపడుతున్నారని వారి శిశు సంరక్షణ సంఘానికి తెలియచేశారు. ఆకలి, వ్యాధులు, భయంకమరగు మలేరియా జ్వరము, చర్మ వ్యాధులు వారిని పీడిస్తున్నాయి. చర్మ వ్యాధులు పల్లె ప్రాంతాల వారికి వచ్చి చర్మాన్ని తినివేసి, ఎముకలనుగూడా తినివేస్తాయి అని వారు తెలియ పరచారు.

డాక్టర్ పేరన్ తిరిగి రాగానే సంఘం తాను ఏమిచేయాలో నిర్ణయించేందుకు పారిస్ నగరంలో సమావేశమైంది. వారిద్దరూ ఆసియాలో తిరిగిన ప్రతి దేశంనుండీ "మాకు సహాయం చేసేందుకు భాగ స్వాములు అవండి" అని సంఘానికి విజ్ఞాపనలు వచ్చాయి. కాని, అప్పుడు ఉండిన ధనం ఆసియా దేశపు ప్రజలందరికీ ఆహారం, మందులు పంపేందుకు సరిపోలేదు. వారు అందుకు చేసిన ప్రణాళిక చాలా ముఖ్యమైంది. ఎందు కంటే, అది ఆసియా ఖండంయొక్క నేటిస్థితి కేకాక,ముందు కాలానికి కూడా ఉపయోగ పడుతుంది. సంరక్షణసంఘం పనిచేసే ప్రతిచోటా దాన్ని అమలు జరుపాలి. అది ఏమంటే ప్రతి దేశపు ప్రభుత్వంతోనూ కలిసి వారి పడుచు

వారిబాగుకై మంచి ప్రణాళికలు వేయాలి. కాని, అందుకు చాలా కాలం పడుతుందని వారికి తెలుసును. అయితే, ఆ మార్గం ఒక్కటే వాటిని మంచిస్థితికి తేగలదు.

కాని, ముందు యుద్ధంమూలంగా కలిగిన నష్టానికి వెంటనే జరుగవలసిన సహాయం ఆసియా ఖండంలో బాధపడే పడుచువారికీ, పిల్లలకూ జరగాలి. వెంటనే ఆహారం, మందులు నిండిన ఓడలు చైనాదేశంలోని రేవు పట్టణాలకూ, ఇండియా, పాకిస్థాన్‌లలోని శరణార్థుల కేంద్రాలకూ, ఇండోనేషియాలకూ, లాంబాక్ ద్వీపానికీ వచ్చాయి. జపాను యువజనులుకూడా వారి భాగాన్ని తీసుకున్నారు. కొన్ని ప్రత్యేక ఏర్పాట్లద్వారా వారికి 30 లక్షల పౌనుల పాలపొడి, ప్రత్తి పంపబడింది. సింహళానికీ, ఇండియాకూ, పాకిస్థానుకూ బి. సి. జి. జట్లు వచ్చి పని ప్రారంభించాయి.

తల్లులూ, పిల్లలూ పాల గిడ్డంగులకు వరుసగా పోతుండగా, పడుచువారు భోజనాలకు ఏర్పాట్లు చేస్తుండగా ప్రభుత్వంవారు శిశు సంరక్షణ సంఘంతో ప్రణాళిక విషయం చర్చించారు. కొన్ని ప్రభుత్వాలు అప్పుడే తమ పడుచువారికై అట్టి ప్రణాళికలు తయారు చేసుకున్నాయి. ఇంకా అధికంగా ఆస్పత్రులూ, ఆరోగ్య కేంద్రాలూ నిర్మిస్తే, వారు చక్కని డాక్టర్లనూ, నర్సులనూ, ఇంకా చాలా మందిని తయారు చేయగలరు.

ముందు ముందు తమ పడుచువారికై, వారి శ్రేయస్సుకై, వారి అభ్యుదయానికై తాము ఇప్పుడు ఏమేమి చేయాలో కొన్ని ప్రభుత్వాలు సలహాలను అడిగాయి. లాటిన్ అమెరికావారుకూడా శిశుసంరక్షణ సంఘం ఉద్యోగస్థులతో ఇలాంటి విషయాలే మాట్లాడారు.

ఆసియాలో 16 సంవత్సరాల క్రిందివయసువారు 40 కోట్లకు పైగా, లాటిన్ అమెరికాలో 15 సంవత్సరాల క్రింది వయసువారు 5,10,00,000 మందికిపైగా హీనస్థితిలో అల్లాడుతున్నారు. చాలా మంది బలహీనంగా ఉండి నారు. ఎంత పెద్ద ప్రభుత్వమైనా వారికి సహాయం చేయడానికి పూనుకోగలదా? కాని, శిశు సంరక్షణసంఘం అందుకు పూనుకుంది. ప్రణాళికలను తయారు చేస్తూ అది ప్రతి ప్రభుత్వాన్నీ వారు ముందు ఏమి చేయాలనుకున్నారో విచారించింది. ఇందుకు సమాధానం ఇచ్చేందుకు ప్రభుత్వాలవారు ప్రపంచ ఆరోగ్య సంఘంవారి, ఆహార వ్యవసాయ సంఘంవారి సలహాలు తీసుకొన్నారు.

జవాబులు వివిధ దేశాలనుండియివచ్చాయి. కాని ఏప్రభుత్వంగానీ తాను స్వయంగా చేసుకోగల పనిని పేర్కొనలేదు. నిధివారు ఇచ్చే దానికి సమానంగానో, లేక అంతకు మించో ధనాన్ని తాము కలుపుకో గలమని వారు చెప్పారు. "మా పిల్లలను పీడించే వ్యాధులతో పోట్లాడేందుకు మేము పూనుకుంటాం. మేము పండించే

పంటనుండి మాపిల్లలకు ఎలా పుష్టికరమైన ఆహారం ఇవ్వాలో తలిదండ్రులకు తెల్పేందుకు ఆహార కేంద్రాలు నిర్మించి చూపిస్తాం. మా చిన్న పిల్లలకూ, పడుచువారికీ, తలిదండ్రులకూ ఆరోగ్య సూత్రాలు చెప్పేందుకు జట్టులు పంపిస్తాం. మా యువజనులకు ఆస్పత్రివసతులు కల్పిస్తాం. అతి త్వరలో చాలమంది డాక్టర్లనూ, నర్సులనూ తయారుచేస్తాం," అని ప్రభుత్వాల వారు తెలియ పరిచారు.

ఒక్కొక్క దేశంలోనే వ్యాధులను నిర్మూలింప సాగారు. చర్మ వ్యాధుల నివారణకు పూనుకున్నారు. అన్ని జట్లకూ పెన్సిలిన్ సూదిమందు పంపబడింది. అది ఒకటి రెండు మాత్రలు వేస్తే చర్మవ్యాధి పోతుందని కనిపెట్టారు.

ఒక్కొక్క దేశంలోనూ ఆహార కేంద్రాలు నిర్మించారు. పిల్లలకు నియమ ప్రకారం భోజనాలు పెట్టారు. శిశుసంరక్షణ సంఘం పంపిన పాలతో మున్నగు ఆహారం, తమ దేశంలో పండిన కూరగాయలూ, పండ్లు వీటి మూలంగా తమ పిల్లల ఆరోగ్యం ఎలా అభివృద్ధి అయిందో వైద్యులూ, నర్సులూ, ఉపాధ్యాయులూ, తలిదండ్రులూ చూచారు.

ఒక్కొక్క దేశంలోనూ పండించబడిన ఆహారాన్ని మంచి మార్గంలో ఉపయోగించడానికి తగు శ్రద్ధ తీసుకో

బడింది. ఐరోపాలోని 7 దేశాల జట్లు చిలికిన పాలపొడి తయారుచేసే కార్యాలయాన్ని స్థాపించి, పాడి అయ్యే కాలంలో పాలను సేకరించి పొడిచేసి, సంవత్సరం పొడుగునా ఉపయోగించుకొన్నారు.

ఒక్కొక్క దేశమూ తన యువజనులకూ, పెద్ద వారికీ మంచి ఆరోగ్య నిబంధనలు నేర్పింది. గ్రామ ప్రాంతాలకు వచ్చే జట్లు రేడియోలు, సినిమాలు, సబ్బులు, మందులు తెచ్చారు. ఎక్కడ సినిమాలు చూపినా వాల్ట్ డిస్నీ యొక్క సినిమాలు తక్కిన అన్నిటికన్నా బాగా తెలిసినవి. ప్రతిచోటకూ అట్టి జట్లే వచ్చాయి.

ఒక్కొక్క దేశంలోను పడుచువారికి ఎక్కువగా ఆస్పత్రులు నిర్మించ బడ్డాయి.

ఒక్కొక్క దేశంలోనూ పడుచు వారికై బాగా అనుభవంగల పనివార్లు నియమించబడ్డారు. ఐరోపాలో యుద్ధం మూలంగా చదువు భగ్నమైపోయిన విద్యార్థులకు ఫ్రాన్సు, స్వీడన్, స్విడ్జర్‌లాండ్‌లలో ప్రత్యేక పాఠశాలలు నిర్మించి ఆ యా విద్యలు నేర్పించారు.

ఒక్కొక్క దేశంలోనూ సంరక్షణ సంఘంనుంచి విద్యార్థులకు వేతనములు బహూకరించబడ్డాయి. కాలేజీలకు, విశ్వవిద్యాలయాలకు, వైద్య పాఠశాలలకు

యువజన ఆరోగ్య విషయాలు చదివేవారందరికీ బహుమతులు ఇవ్వబడ్డాయి. పలు రకాల పనిచేసే వారిలో చాలా మందికి ఐక్యరాజ్యసమితి బహుమతులు ఇవ్వబడ్డాయి. అలా ఇచ్చినవి 20 వేలు అయ్యాయి. శిశు సంరక్షణసంఘం కూడా చాలా ఇచ్చింది.

శిశు సంరక్షణసంఘం సహాయంతో విద్యార్థులు చదివే చాలా పాఠశాలలూ, కళాశాలలూ ఉన్నవి. వీనిలో కలకత్తాలోని ఆరోగ్య కేంద్రం ఒకటి. అఖిలభారత వైద్య ఆరోగ్య సంస్థ దాన్ని నడుపుతూంది. ఆ సంస్థకు కూడా శిశు సంరక్షణసంఘం సహాయం చేసింది. దక్షిణ, తూర్పు ఆసియా దేశాలలో పడుచువారికై పనిచేసే వైద్యులూ, నర్సులూ, ఇతరులందరూ ఇక్కడే అన్నీ నేర్చుకుంటారు.

శిశు సంరక్షణసంఘం సహాయం మూలాన పారిస్‌లో నిర్మింపబడ్డ అంతర్జాతీయ శిశు కేంద్రంలో ప్రపంచం నలుమూలలనుండి విద్యార్థులు వచ్చి చదువుకుంటారు. వారిలో ఈసంఘం విద్యార్థులుకూడా ప్రతి సంవత్సరమూ ఉంటారు. పసిపిల్లలను గూర్చి, పడుచు వారిని గూర్చి తీసుకోవలసిన శ్రద్ధకు సంబంధించిన విషయాలన్నీ అక్కడ చేర్చబడి ఉన్నాయి. పలుదేశాలనుండి ప్రముఖులంతా పోయి అక్కడ బోధిస్తారు. పడుచువారికై శాస్త్రజ్ఞులు అక్కడ పరిశోధనలు జరుపుతుంటారు.

ఈ సంఘం సర్వసభ్య సమావేశంలో వినిపించబడిన మూడున్నర సంవత్సరాల కార్యక్రమం ఇది: ఈపని ఆసియాలో 12 దేశాలలోనూ, ఐరోపా ఖండంలో 14 దేశాల్లోనూ, లాటిన్ అమెరికాలో 17 దేశాల్లోనూ, మధ్య ప్రాచ్యంలో 8 దేశాల్లోనూ, ఉత్తర ఆఫ్రికాలో 5 దేశాల్లోనూ జరిగింది. శిశు సంరక్షణసంఘం జట్లు ప్రపంచమంతా తిరిగి యువకులకై ఈ పని చేశారు.

# తిండి ఉంటేనే శాంతి

వాషింగ్టన్ నగరంలోని పాన్ అమెరికన్ (అఖిల అమెరికన్ దేశాల) సంఘంయొక్క అందమైన అజ్‌టక్ తోటలో అది సాయంకాల సమయం. చెట్ల క్రింద, పూల మొక్కల ప్రక్కన యువతీ యువకులు చాలామంది చేరారు. వారంతా 4–హెచ్ క్లబ్బు సభ్యులు. నాలుగు దీపాలపండుగ చేయడానికి వచ్చారు. మానవునికి ముఖ్యమైన తల, గుండె, చేయి, ఆరోగ్యం వీటిని తెలుపుతూ నలుగురు పడుచువారు నాలుగు మైనపు వత్తులు వెలిగిస్తారు. వారితోకూడా అంతర్జాతీయ సహకార స్నేహభావానికి గుర్తుగా 5 వ వత్తిని వెలిగిస్తారు. అప్పుడు అందరూ ప్రపంచ శాంతికి పాటుపడుతామనీ, ఒకరికొకరు వివిధ విషయాలు తెలుపుకుంటామనీ ప్రమాణం చేస్తారు.

1950 వ సంవత్సరం జూన్ నెలలో ఒకనాటి సాయంకాలం అజ్‌టక్ తోటలో చేరిన పడుచు వారందరూ అంతర్జాతీయ యువ వ్యవసాయదారుల మొదటి సమావేశానికి ప్రతినిధులుగా వచ్చినవారు. అమెరికా సంయుక్త రాష్ట్రాలలోని 47 రాష్ట్రాలనుండీ, పోర్టోరికో నుండీ వచ్చిన వారంతా 4–హెచ్ సంఘ సభ్యులు. ఫిన్లాండ్ దేశంవారు, తక్కిన ఇతరులు కూడా ఆ సంఘం పేరుతోనే వచ్చారు. ఇంగ్లాండునుండి వచ్చినవారు

యువజన వ్యవసాయ సమితి ప్రతినిధులుగా వచ్చారు. ఆ సమితికి స్కాట్ లెండ్ లోనూ, ఐర్లెండ్ లోనూ, వేల్స్ లోనూ, ఇంగ్లండులోనూ సభ్యులున్నారు. కాని ఆ పేర్ల తేడాలో ఏమీ లేదు. ఇంకో ముఖ్యమైన విషయం ఏమిటంటే -దూర దేశాలనుండి వచ్చిన 76 మంది తమ తమ దేశాలలో ఇదే విధమైన పని చేస్తుండినవారే. ధాన్యం, కూరగాయలు పండించడం లోను, ఆవులు, పందులు, గొర్రెలతోనూ, ఇంటిపనుల లోనూ మునిగి ఉండేవారు.

దూర దేశాలనుండి వచ్చినవారు అమెరికను పొలా లను చూచేందుకు వచ్చారు. వారంతా 4-హెచ్ సంఘం యొక్క మెంబర్ల అతిథులుగా ఉండి వారితో పాటు పొలాల్లోపనిచేశారు. అలాగే అమెరికనులుకూడా దూర దేశాలకు పోయారు. ఇది ఐక్యరాజ్య సమితికి సంబంధించిన వ్యవసాయ సంఘం 1948 సంవత్సరంలో వేసిన అంతర్జాతీయ రైతు యువజన సహకార సంఘం యొక్క ప్రణాళిక.

ఆ ప్రతినిధులు వాషింగ్టన్ నగరంలో సమావేశానికి హాజరై ప్రపంచమంతా అలాంటి సంఘాలు ఇంకా చాలా ఉన్నాయని తలచి సంతోషించారు. హిందూ దేశంలోని 5-ఎస్ సంఘాన్ని గురించి వారు విన్నారు. అదికూడా 4-హెచ్ సంఘం వంటిదే. రెండింటి

అర్థాలూ ఒకటే. ఆర్జెంటీనాలో 1000కి పైగా పెయిస్ అనే సంఘాలున్నాయని విన్నారు. ప్రతి దేశంలోకూడా చాలా సంఘాలున్నాయని వారు గుర్తించారు.

ఆ సమావేశంలో మాట్లాడుతూ యువ వ్యవసాయదారులంతా తమ దేశాలలో సంఘాల పేర్లు రకరకాలుగాఉన్నా తమ్ము ఎదుర్కొంటున్న సమస్యలు మట్టుకు ఒకటే రకమని గుర్తించారు. పొలాలను కాపాడడం, మంచి విత్తనాలు సంపాదించడం, చీడ పురుగులనుండి పైరును కాపాడడం, ధాన్యం కుప్పలను ఎలుకల నుండి రక్షించడం, జంతువులను పెంచితే వాటికి ఎలాంటి ఆహారం వేయడం, వాటికి జబ్బు చేస్తే ఏమి చేయడం? ఈ సమస్యలే వారికి కలిగాయి.

వివిధ ప్రభుత్వాలు వారికి సహాయం చేయడం మెచ్చుకోదగ్గ విషయం. ఏదో ఒక విధంగా ప్రభుత్వం వారికి సహాయం చేసింది. అమెరికా సంయుక్త రాష్ట్రాలలో ప్రభుత్వంవారి ఉద్యోగులు కొంతమంది యువజనుల సమావేశాలకు వచ్చి, 4–హెచ్ సంఘం ఏలా పనిచేస్తుందో చూచేవారు. వారంతాకూడా ఐక్యరాజ్య సంఘం వ్యవసాయశాఖ ప్రతినిధులు. అన్యోన్య స్నేహితం మూలంగా వారు ఐక్యరాజ్య సమితి ఆహార వ్యవసాయ సంఘం ప్రపంచంలోని గ్రామాల రక్షక సంస్థ అని తెలిసికొన్నారు.

ఆ యువ వ్యవసాయ దారులంతా అంతర్జాతీయ సంఘంగా ఏర్పడితే చాలా బాగుంటుందని తలచి తామంతా ప్రపంచ అహార వ్యవసాయ సంఘంతో కూడా ఉండిపోవాలని తీర్మానించుకున్నారు. ముందు కాలానికై ఇప్పుడే కొందరు యువకులు ప్రణాళికలను వేయసాగారు. ఆ కాలానికి వారు ముసలివారై అంతర్జాతీయ యువతీ యువకుల సంఘంలో స్థానం లేకుండా పోవచ్చును. కాని ప్రపంచ ఆహార వ్యవసాయ సంఘం దాని భాగంగా ఉండి తమ ప్రభుత్వాల ద్వారా సహాయం చేస్తుంది. వారి 4–హెచ్ సంఘ ఆదర్శం ప్రపంచ ఆహార వ్యవసాయ సంఘ ఆదర్శంతో జతపరుచబడి ఉంటుంది. ప్రపంచ ఆహార వ్యవసాయ సంఘం యొక్క ఆదర్శం "ఆహారం పుష్కలంగా ఉండాలి"—అని. 4–హెచ్ సంఘంయొక్క ఆదర్శం—ఉత్తమ రకపు పంటలు పండించాలి—అని.

1943వ సంవత్సరం మే నెలలో అధ్యక్షుడు ఫ్రాంక్లిన్ డి. రూజ్‌వెల్ట్ యొక్క ఆహ్వానంమీద వచ్చి వర్జీనియా లోని హాట్ స్ప్రింగ్స్ దగ్గర సమావేశమైన 44 దేశాల ప్రతినిధులతో ప్రపంచ ఆహార వ్యవసాయ సంఘం ఏర్పడింది. వారు అందరూ ఏకంగా పనిచేసి ప్రపంచంలో నుండి ఆకలిని తరిమివేసి సుస్థిర వ్యవసాయ విధానాన్ని స్థాపించాలని తీర్మానించారు.

యుద్ధం తర్వాత ఆహారం యొక్క అవశ్యకత ఉంటుందని వారికి తెలుసును. వారు దాన్ని ఎదుర్కొనేందుకై ప్రణాళికలను వేశారు. కాని రెండో ప్రపంచ యుద్ధానికి ముందుగానే చాలా కాలంగా ప్రపంచాన్ని ఆహార సమస్య ఎదుర్కొన్నది. ఆ ప్రతినిధులు ప్రపంచం రెండు భాగాలుగా ఉందని గుర్తించారు. ఒక భాగంలో ఆహారం సమృద్ధిగా ఉంది. ఇంకో భాగంలో ఆహారం, ఆరోగ్యం బొత్తిగా లేవు. ప్రపంచంలోని లక్షలాది జనులకు ఆకలి బాధ తప్పలేదు. వారికి అది తప్ప వేరే తెలియదు. కాని ప్రపంచంలోని పనివారిలో మూడింట రెండు భాగాలు రైతులే! అనేక కోట్లమందికి తగినంత ఆహారం ఉన్నప్పటికీ, అనేక కోట్లమందికి తగినంతగా లేదు. ప్రపంచంలో, ఎక్కువ ఆహారం పండించేందుకు ప్రణాళికలను కూడా వారు చర్చించారు.

1945 వ సంవత్సరం అక్టోబరు నెల 16 వ తేదీన క్విబెక్ నగరంలో 34 దేశాల ప్రతినిధులు దాని నిర్మాణ పత్రంలో చేవ్రాలు చేయడంతో ప్రపంచ ఆహార వ్యవసాయ సంఘం నెలకొల్పబడింది. మూడు సంవత్సరాల లోపల 60 దేశాలవారు దానిలో చేరారు. ఇంకా చాలామంది చేరేందుకు అర్జీలు పెట్టారు. వారంతాకూడా వివిధదేశాల జీవన పరిస్థితులను చక్కజేయడానికీ, వ్యవసాయం, పనులు, చేపలుపట్టడం—

ఇవన్నీ అభివృద్ధికి తేవడానికీ, వీటిగుండా సకల ప్రజానీకాన్నీ ఉత్పత్తి కార్యాలకు ప్రోత్సాహపరచ డానికీ పూనుకున్నారు.

ఇలా ప్రపంచ ఆహార వ్యవసాయ సంఘాన్ని నిర్మించడం ప్రపంచ ఆరోగ్య సంఘానికీ, ఐక్యరాజ్య ఆర్థిక సాంఘిక సాంస్కృతిక సంఘానికీ మార్గదర్శక మైంది. వాటినికూడా ఇదేవిధంగా నిర్మించాలను కున్నారు.

ఎఫ్. ఏ. ఓ. అంటే ప్రపంచ ఆహార వ్యవసాయ సంఘం. దానికి ఒక సామాన్యసభ ఉంటుంది. దానిలో సభ్యత్వంగల ప్రతి దేశంనుండీ ఒక ప్రతినిధి చొప్పున ఉంటారు. ఆ సభ ప్రతి సంవత్సరమూ సమావేశమై, అప్పటికి జరిగిన పురోభివృద్ధిని గురించీ, జరుగబోవు కార్యక్రమాన్ని గురించి చర్చిస్తారు. ఎఫ్. ఏ. ఓ. కు ప్రపంచ ఆహార సంఘం అనే ఒక కార్య నిర్వాహక సంఘం ఉంది. దానిలో 18 దేశాల ప్రతినిధులుంటారు. ఈ సంఘం ప్రతి సంవత్సరం పలుమార్లు సమావేశమై, సామాన్యసభ జరిపిన నిర్ణయాలను అమల్లోకి తెస్తుంది. ఎఫ్. ఏ. ఓ. కు ఒక ఉపసంఘంకూడా ఉంది. దానికి ఒక సర్వకార్య నిర్వాహకుడు పెద్దగా ఉంటాడు. ఎఫ్. ఏ. ఓ. లో మెంబరుగాఉన్న దేశాలలో ప్రముఖ వ్యవసాయదారులతో నిర్మించబడిన జాతీయ ఆహార

వ్యవసాయ సంఘాలు ఉండి కుడిభుజాలుగా పనిచేస్తాయి. ఈ సంఘాలన్నీ పరస్పర సంబంధం కలిగి ఉండి ఎఫ్. ఏ. ఓ. కార్యాలను అన్నిటినీ జరిపిస్తాయి.

ఎఫ్. ఏ. ఓ. మొదటి సర్వకార్య నిర్వాహకుడుగా ఉండిన సర్ జాన్ బాయిడ్ ఆర్ అనే ఆయన "ఇప్పుడు ప్రపంచమంతటా ఆకలి కనిపిస్తూంది. ప్రజలకు బాగా ఆహారం పెట్టకపోతే మనం చేసుకునే సంధులూ, సమాధానాలూ ఏమీ పనికిరావు. ఆహారమే శాంతి" అని చెప్పాడు.

ప్రపంచంలోని రైతులందరికీ సహాయంచేసి ఎక్కువగా ఆహారం పండించడమే ఎఫ్. ఏ. ఓ. యొక్క ముఖ్య కర్తవ్యం. యుద్ధం తర్వాత ప్రపంచంలోని పలు దేశాలలో కలిగిన ఆహారం కొరతవల్ల ఏర్పడిన ఆకలి మంటలను ఆర్పడానికై వెంటనే ఎఫ్. ఏ. ఓ. పూనుకో వలసి వచ్చింది. స్వయంగానే ఎఫ్. ఏ. ఓ. మెంబరు దేశాలన్నీ కలిసి అంతర్జాతీయ ఆహార సంఘాన్ని ఏర్పరచి ఆహారాన్ని, ఎరువులను, చేర్చి ఆ యా దేశాల అవసరాలనుబట్టి పంచిపెట్టారు. వారంతాకూడా ప్రజలకు ఎక్కువ ఆహారం మిగులుతుందని జంతువుల పెంపకం తగ్గించుకుంటూ మన్నారు. కలపకూడా కావలసి వచ్చింది. యుద్ధంలో కాలి కూలిపోయిన ఇండ్లను తిరిగి కట్టడానికి కొయ్యసామాను కావలసి వచ్చింది.

చెకోస్లొవేకియాలో జరిగిన ఎఫ్. ఏ. ఓ. సమావేశంలో కలప నరకడం 100 కి 10 వంతులు ఎక్కువ చేయాలని ప్రభుత్వాలవారు అంగీకరించారు. ఎఫ్. ఏ. ఓ. ప్రముఖులు పలు దేశాలకు పోయి వ్యవసాయం తిరిగి తొందరగా సాగేట్టు చూచారు.

దానితోపాటు ఎఫ్. ఏ. ఓ. వారు యుద్ధానంతరం ఆవశ్య పునర్నిర్మాణమునకు కూడా పూనుకున్నారు. దానివల్ల రాబోవుకాలంలో ప్రపంచం అధిక ఆహారాన్ని కలిగి ఉంటుంది. తమ స్వదేశముల కూడా త్యజించి ఐక్య రాజ్య సంఘంకోసం పాటుపడే స్త్రీ పురుషులలో వ్యవసాయరంగంలో బాగా అనుభవమున్న వారిని ఏరి ఎఫ్. ఏ. ఓ. తన సంఘసభ్యులుగా చేసికొంది.

ప్రపంచ ఆహార వ్యవసాయ సంఘం (ఎఫ్. ఏ. ఓ.) ఆ యా దేశాల ప్రభుత్వాల ద్వారా వ్యవసాయ సంఘాలకూ, వ్యవసాయ కళాశాలలకూ, వ్యవసాయ దారులకూ సహాయం చేసింది. ప్రజలు తమకు గల సందేహాలను తీర్చుకోడానికై వేలకొలది ఉత్తరాలను వాషింగ్టన్ నగరంలోని ఎఫ్. ఏ. ఓ. కార్యాలయానికి వ్రాసేవారు. వాటన్నిటికీ మంచి జవాబులు పంపబడేవి.

ఇలాంటి సహాయాన్ని చురుకుగా కలిగించేందుకై ప్రపంచంలోని వివిధ ప్రాంతాలలో ప్రాంతీయ కార్యాలయాలు స్థాపించబడ్డాయి. తమకు దగ్గరగా ఉన్న

వాటికి ప్రభుత్వాలు ఉత్తరాలను వ్రాసుకోవచ్చును. ఐరోపాకు ఇటలీలోని రోమ్ నగరంలోను, మధ్య ప్రాచ్య దేశాలకు ఈజిప్టులోని కెయిరో నగరంలోను, ఆసియాకు, దూరప్రాచ్య దేశాలకు సయాంలోని బేంకాక్ నగరంలోను స్థాపించారు.

చాలా శ్రమతో రైతులు పండించిన కొత్తరకపు విత్తనాలగింజల విషయమై ఎఫ్. ఏ. ఓ. కు చాలా ప్రశ్నలు వచ్చేవి. ప్రతి 4–హెచ్ సంఘ సభ్యునికి మిశ్రమ ధాన్యాన్నిగురించి తెలుసును. అవి అన్ని వాతావరణాల్లోనూ పండుతాయి. చీడ పురుగులవల్ల కూడా వాటికి భయంలేదు. అవి చాలా ఎక్కువగా పండడమే కాక చాలా మంచివి కూడాను.

ఇప్పుడు ప్రతిదేశంలోనూ విత్తనాల శాస్త్రజ్ఞులు ఉన్నారు. వారు ఏమిచేసేదీ ఎఫ్. ఏ. ఓ. ద్వారా వెంటనే అన్ని దేశాలకూ తెలుస్తుంది. విత్తనాలు చాలా తొందరగా వ్రాకిపోతాయి. చాలా శతాబ్దాల క్రింద అరబ్బులు చైనాదేశంనుంచి నారింజ విత్తనాలు మధ్య ప్రాచ్య ప్రాంతాలకు తీసుకపోయారు. రబ్బరు చెట్లు బ్రెజిల్ దేశం నుండి ఓడలపైన సింహళానికీ. మలయాకూ, తూర్పు ఇండియా దీవులకూ పోయాయి. ఉర్లగడ్డలు, తక్కాళిపండ్లు, పొగాకు, అమెరికానుండి చాలా దేశాలకు పోయాయి. ఇప్పుడు విత్తనాలు

వ్యాపిస్తున్నట్లు ముందెప్పుడూ ఎక్కడా జరుగలేదు. ఎఫ్. ఏ. ఓ. ద్వారా అవి విమానాలపై వివిధ దేశాల పరీక్షా కేంద్రాలకు పంపబడుతున్నాయి. అక్కడి పరిస్థితులు వాటికి సరిపోయేదీ లేనిదీ చూచిన తర్వాత ఆ కొత్త విత్తనాలు నాటబడతాయి,

ఎఫ్. ఏ. ఓ. వారు అన్నిరకాల ఆహార ధాన్యాలను గురించి ఒక పుస్తకాన్ని తయారు చేస్తున్నారు. అందులో ప్రతిధాన్యం యొక్క వివరాలు ఉంటాయి. అవి ఎక్కడ పండేది, ఎక్కడ దొరికేది, ఎలా పండించేది తెలుస్తుంది.

చాలా దేశాల ప్రభుత్వాలు వాటివలన సాధ్యమైనంత మంచి పుస్తకాలను ఇదే విధంగా తయారు చేస్తున్నారు. సంయుక్త రాష్ట్రాల వ్యవసాయ శాఖవారు తాము చాలా కాలంగా వివిధ పంటల గురించి పరిశోధించిన ప్రముఖులనూ పలుపంటల సేకరణనూ గురించి ఎఫ్. ఏ. ఓ. వారికి తెలియ జెప్పారు. బ్రిటిష్ కామన్‌వెల్తు వారు కూడా తాము సంపాదించిన పలురకాల ఉర్లగడ్డలు, ప్రత్తి, మరి ఇతర రకాల పంటల విషయం తెలిపారు. సభ్యులుగా ఉన్న ఇతర దేశాల ప్రభుత్వాలవారు కూడా అదే విధంగా చేశారు.

ఆ యా దేశాలవారికి, వారు అడిగిన దానికన్నా ఎక్కువగా తిరిగి తెలుస్తుంది. ఎఫ్. ఏ. ఓ. ద్వారా అమెరికా సంయుక్త రాష్ట్రాలవారు చాలా కొత్తరకాల

చెట్లను గురించి తెలిసికొన్నారు. వివిధ దేశాలలోని వివిధ పంటల విషయం విశదమైంది.

ఎఫ్. ఏ. ఓ. వారు విత్తనాలనూ, చెట్లనూ గురించి తెలిసికొని ఉత్తరాలు వ్రాయడంతో తృప్తి పడలేదు. వారి శాస్త్రజ్ఞులు పలు దేశాలకుపోయి తమకు తెలిసిన వానిని చెప్పి, తెలియని వానిని గురించి నేర్చుకుంటారు. ఒక ప్రత్యేక విషయాన్ని గురించి అడిగిన దేశానికి సహాయం చేయడానికై ఎఫ్. ఏ. ఓ. జట్టులు పోసాగాయి. ఇక్కడ కూడా భాగస్వామ్యం ఏర్పడింది. ఎఫ్. ఏ. ఓ. అనుభవ శాలురను పంపిస్తుంది. ప్రభుత్వాలవారు వారికి వసతులు కల్పిస్తారు. ఖర్చులు భరిస్తారు. వారు క్రొత్త వారిని తయారు చేస్తారు.

ఎఫ్. ఏ. ఓ. కు చెందిన ప్రభుత్వాల జట్టులవారు ఏం చేస్తారు? ఆ యా శాఖలకు సంబంధించిన ఆ యా పనులను వారు చేస్తారు. చీడ పురుగుల నుండి చెట్లను, వ్యాధులనుండి జంతువులను కాపాడుతారు.

ఎలుకలు, చీడ పురుగులు మా ధాన్యాన్ని పాడు చేస్తున్నాయి అని ఈజిప్టువారు తెలిపారు. వెంటనే ఎఫ్. ఏ. ఓ. జట్టు పోయి వాటినుండి ధాన్యాన్ని కాపాడు కొనే విధానం విశద పరచింది. అలానే ఆ జట్టులవారు ఆస్ట్రియాకు పోయి సేద్యంలో మిషన్ల ఉపయోగాన్ని



గురించి, థాయ్‌లెండ్‌లో చేపలు పట్టడాన్ని గురించి చెప్పారు.

ఒక్కొక్క విషయంలోనూ సహాయం చేయడమే కాక ఎఫ్. ఏ. ఓ. ప్రతి దేశానికీ అనుభవజ్ఞులైన కొంత మందిని పంపుతుంది. వారు ప్రభుత్వాలతో కలిసి మంచి పంటలు పండించడం, అడవుల పెంపకం, జంతువుల పోషణ, వాటి అభివృద్ధి గురించి చక్కగా బోధిస్తారు.

చీడ పురుగుల నుండి పంటలను కాపాడితే ప్రపంచం లోని యువతీ యువకులకే కాక ప్రజలందరికీ కావలసిన ఆహారం దొరుకుతుంది. మెక్సికోలోని తాపచూలాలో జరిగిన లాటిన్ అమెరికా ప్రాంతీయ సభలో మిడుతలను ఎదుర్కొనడానికై ఎఫ్.ఏ.ఓ. వారు తాము చేయవలసిన పనులనుగురించి యోచించడానికై ఆరు మధ్య అమెరికా దేశాలవారిని కలుసుకున్నారు. అప్పటినుండి మిడుతల నుండే కాక ఇతర చీడ పురుగులనుండి కూడా పంటలను రక్షించుకొనే విషయాలనుకూడా చర్చించారు. ఆచర్చ ఇప్పటికీ జరుగుతూనే ఉంది. ఇకమీద కూడా జరుగు తుంది. ఆ దేశాల వ్యవసాయదారులు కలసిమెలసి పని చేస్తున్నారు.

మంచి భూమిని జాగ్రత్తగా కాపాడుకుంటే ఎక్కువ ఆహారం పండించ వచ్చును. ఇటలీలో జరిగిన ఎఫ్. ఏ. ఓ.

యొక్క సమావేశంలో ఐరోపాలోని, మధ్య ప్రాచ్య దేశాలలోని 7 దేశాల వారు పాల్గొన్నారు.

ప్రపంచంలో ఐదింట మూడు పాళ్ళు వ్యాపించివున్న సముద్రాలనుండి మంచి శక్తి నిచ్చు చేపలను పట్టగలిగితే ఎక్కువ ఆహారం ఉంటుంది. ఎఫ్. ఏ. ఓ. సంఘం నిపుణులు అట్లాంటిక్ మహాసముద్రంలో చాలా బాగా పనిచేశారు. అలాగే ఇతర 7 సముద్రాలలోకూడా మంచి కృషి చేశారు.

దీని ఫలితంగా గొప్ప ఇండోనేషియా చేపల సంఘం ఏర్పడింది. సింగపూరులో జరిగిన మొదటి సమావేశంలో ప్రతినిధులంతా చేపలకు సంబంధించిన అన్ని విషయాలూ యోచించారు. ఇండో-పసిఫిక్ ప్రాంతంలో చేపలు ఎక్కడెక్కడికి మారుతుంటాయో తెలిపే కొత్త పటాలను తయారు చేయడానికి ఏర్పాట్లు చేశారు. చేపల పరిశోధన జరిపేందుకు ఉపయోగమయ్యే అనేక ఇతర విషయాలు తెలుసుకొన్నారు.

ఎఫ్. ఏ. ఓ. చేపల సంఘం నాయకుడు డాక్టరు డోనోవాన్ జె. ఫిన్. ఆయన రెండో సమావేశానికి వచ్చినప్పుడు లెబనాన్, ఈజిప్ట్, పాకిస్తాన్, సిలోన్. తాయిలెండ్, ఇండియా, ఫిలిప్పైన్స్ దేశాలకు పోయి వారి చేపల శాఖకు ఎఫ్. ఏ. ఓ. చేయబోయే సహాయాన్ని గురించి చెప్పాడు.

జంతువులను బాధించే వ్యాధులను నిలుప గలిగితే ఎక్కువ ఆహారం లభిస్తుంది. ఆఫ్రికాలోనున్న కెన్యా దేశంలోని నైరోబి నగరంలో, ఆసియా, ఆఫ్రికాల ప్రతినిధులు రైండర్ పెస్ట్ అనే వ్యాధి విషయమై యోచించడానికి సమావేశ మయ్యారు. అది ఆ ప్రాంతంలోని జంతువులకు వచ్చే చాలా ప్రమాదకరమైన వ్యాధి. ఎఫ్. ఏ. ఓ. ఆ వ్యాధిని పోగొట్టే సూది మందును తయారు చేసేందుకు సహాయపడింది. వివిధ దేశాలలో అది చాలా బాగా పనికివస్తూంది.

అమెరికా పశ్చిమోత్తర ప్రాంతంలో మాత్రం ఉండే అడవుల బీడుల్లో చెరకును పండిస్తే అమెరికనులకు ఎక్కువ ఆహారం లభిస్తుంది. ఎఫ్. ఏ. ఓ. ఏర్పాటుచేసిన ప్రాంతీయ సంఘాలన్నీ ఎక్కువ అడవి పంటలను పండించుటకు కృషి చేశాయి. ఇండియాలోని మైసూరు నగరంలో మొదటి అంతర్జాతీయ కలప ఉపయోగ సంఘంయొక్క సమావేశాన్ని ఎఫ్. ఏ. ఓ. జరిపింది.

ఎక్కువ ఆహారానికై ఎఫ్. ఎ. ఓ. చేసిన ముఖ్య ప్రణాళికలలో వరిపంట ప్రణాళిక ఒకటి. ఆసియా ఖండంలో సగంమంది బియ్యం తింటారు.

1940 వ సంవత్సరంలో ఎఫ్. ఏ. ఓ. ఆహ్వానం మూలంగా మొట్ట మొదటిసారిగా వరిపండించే అన్ని దేశాలు అంతర్జాతీయ వరి సంఘంగా ఏర్పడ్డాయి.

ఆ సమావేశం తాయ్‌లెండ్‌లోని బేంకాంక్‌లో జరిగింది. అప్పుడు ఉత్పత్తి విషయాల లెక్కలు చర్చించబడ్డాయి. భూమిని సారవంతం చేయడం, పంటలు మార్చడం, వ్యవసాయం, ధాన్య సేకరణ, వ్యాపారం మొదలైన విషయాలుకూడా చర్చించారు.

కాని, తయారుచేసిన ప్రణాళికల నన్నింటినీ నెరవేర్చాలి గదా! అందుకు అనుభవజ్ఞులు చాలా మంది కావాలి. 1950 వ సంవత్సరంలో పాకిస్తాన్‌లోని లాహోర్ నగరంలో ఆసియా, దూర ప్రాచ్య దేశాల వ్యవసాయశాఖ పనివారికై 3 మాసాల తర్ఫీదు తరగతులు ఏర్పాటు చేయబడ్డాయి. ఇందుకు ఆసియా దూర ప్రాచ్య దేశాల అభివృద్ధికి పనిచేసే అంతర్జాతీయ బ్యాంకియున్నూ, ఎఫ్. ఏ. ఓ. కు చేరిన ఆర్థిక సంఘమున్నూ భాగస్వామ్యం వహించాయి.

ఎక్కువ ఆహారం పండించడం సంగతి అలావుండగా, ఇంకో ముఖ్యమైన విషయంకూడా యోచించాలి. మీకు భోజనంపెట్టే తల్లికి బియ్యంతోపాటు పలు రకాల కూరలుకూడా ముఖ్యమని తెలుసును. ఎందుకంటే మీకు దేహాన్ని శక్తివంతంగాచేసే వివిధ పదార్థాలు తగిన కొలతల్లో ఉండాలి. ఎఫ్. ఏ. ఓ. వారుకూడా దీన్నే ఆలోచిస్తూ పలురాజ్యాల వారిని ఎక్కువ ఆహారం పండించడానికే కాక వారు ఇదివరకు పండించని చక్కని

రకరకాల పంటలు పండించమని ప్రజలకు చెప్ప మంటున్నారు.

ఫిలిప్పైన్ దీవుల్లోని పేంగసినాన్‌లో ఉండే లెక్కల బడిలోని జోసే శాన్‌టోస్ అనే బాలుడు, అతని ఇద్దరు స్నేహితులు ఎప్పుడూ ఐక్యరాజ్య సమితియొక్క ఆహార శాఖవారికి కృతజ్ఞులుగా ఉంటారు. ఎందుకంటే వారివల్ల ఆ ముగ్గురికీ రేచీకటి వ్యాధి పోయింది.

అది ఇలా జరిగింది: శిశు సంరక్షణ సంఘం ప్రచారకులు ఫిలిప్పైన్ దీవులకు పోయి అచ్చటి వారిని పరీక్షింపగా వారి ఆహారంలో కొన్ని ముఖ్యమైన విటమిన్‌లు లేవు. కాని, ఆ జీవకణాలను ఇచ్చే కూర గాయలను పండించడం అక్కడ సులభంగా వుండడం చేత ఆ పనివారు, ఎఫ్. ఏ. ఓ. వారు కలిసి పాఠశాల భోజన కేంద్రాలు ఏర్పాటు చేయాలనుకున్నారు. ఈ పాఠశాల భోజనాలతో పిల్లలకు, పడుచు వారికి కావలసిన విటమిన్‌లన్నీ లభిస్తాయి. శిశు సంరక్షణ సంఘంవారు వెంటనే వారికి పాలు, మాంసం, కాడ్ చేపనూనె, క్రొవ్వులు, కూరగాయలు, పండ్లు మొదలైనవి పంపించారు.

జోసే అనే బాలునికీ, మరి ఇద్దరికీ ఈ ఆహారంవల్ల వారి వ్యాధి పోయింది. చాలా కాలం వరకూ వారు పగలు మాత్రమే చూడగలిగే వారు. పెందలకడనే

పాఠశాల వదిలి ఇంటికి పోయేవారు. కాని, ఈ ఆహారం తినిన కొద్ది కాలానికే వారి కండ్లు బాగైనాయి.

ఈ భోజనాలు పెట్టే చోట్లకంతా తలిదండ్రులను, ఆరోగ్య శాఖవారిని, వైద్యులను, నర్సులను, ఉపాధ్యాయులను పిలచే వారు. వారి పిల్లల ఆరోగ్యం ఎలా అభివృద్ధి అవుతూందో చూపించేవారు. ఇండ్ల తోటల్లోనూ, మరి ఇతర తోటల్లోనూ ఏ యే కూర గాయలు పెంచాలో చూపించేందుకు మనిలాలోని 1000 మంది బాల బాలికలు తమ పాఠశాల కార్యక్రమంలో ఒక భాగంగా పెద్ద తోటను పెంచారు. అచ్చట పండే కూరగాయలనే వారి భోజనాలకు ఉపయోగించే వారు.

ఎక్కువ ఆహారం పండించేందుకు ఎఫ్. ఏ. ఓ. తన ఆశయాలను నెరవేర్చుకో గలిగిందా? 1949 లో ఎఫ్. ఏ. ఓ. సర్వ కార్య నిర్వాహకుడైన నారిస్ ఇ. డాడ్ అనే ఆయన ఈ ప్రశ్నకు సమాధానం చెప్పాడు. ఆయన చాలా కాలం క్రిందట కొద్ది భూమితో ప్రారంభించి ఇప్పుడు 2000 ఎకరాల సారవంతమైన భూమిని కొత్త విధానాలతో తీర్చాడు. అక్కడ అతను గోధుమ, బార్లీ పండించి పశువులను కూడా పెంచు తున్నాడు. ఆయన స్వయంగానే ఎఫ్. ఏ. ఓ. యొక్క కృషిని చూపిస్తున్నాడు.

ఆయన ఒక నివేదికలో ఈవిధంగా తెల్పాడు: "రెండో ప్రపంచ యుద్ధ కాలంనుండీ అధిక ఆహారం పండించే దేశాలవారు ఇంకా ఎక్కువగా పండించి మునుపటికన్నా ఎక్కువగా తింటున్నారు. కాని, హీన స్థితిలోని దేశాలు మునుపటికన్నా హీనస్థితికి పోయాయి.

"దీనికి కారణం ఏమిటి? హీన స్థితిలోని దేశాలలో చిన్న పిల్లలు ఎక్కువగా ఉన్నారు. ఆ దేశాలలో పంటలు చాలా తక్కువ. వారికి సహాయంచేస్తేనే గాని బ్రతకలేరు."

వారిని గురించి అధ్యక్షుడు ట్రూమన్ "ప్రజా సమాజాభివృద్ధికి ఎక్కువ ఉత్పత్తిచేస్తే ప్రపంచ శాంతిస్థాపన జరగగలదు. అధిక ఉత్పత్తికి క్రొత్త విజ్ఞాన, యంత్ర సాధనాలను ఎక్కువగా ఉపయోగించడం ముఖ్యం," అని చెప్పాడు.

1950 వ సంవత్సరంలో ఐక్యరాజ్య సమితిలోని దేశాలు, మరి ఇతర ముఖ్య శాఖలు కలిసి 200 లక్షల డాలర్లను హీనస్థితిలో ఉన్న దేశాల అభివృద్ధికై సమకూర్చాయి. ప్రతి దేశమూ విరాళం ఇచ్చింది. ఆ మొత్తంలోనుండి ఆహార సంఘానికి నూటికి 29 వంతుల భాగం వచ్చింది. మరి ఇతర సంస్థలకు కూడా అందునుండి భాగం వచ్చింది.

నారిస్ ఇ. డాడ్ ప్రపంచమంతా తిరిగి వచ్చినప్పుడు రేడియో ద్వారా ఇలా చెప్పాడు:—

"ప్రపంచంలో వరిపంట ఎక్కువైంది. నిజంగా అదంతా కాయకష్టం వల్లనే జరిగింది. రైతు మొదట కొద్ది భూమినిమాత్రమే సాగుబడిచేస్తాడు. అతను ఒకే కాలంలో చేతితో అన్ని చెట్లను నాటుతాడు. అది చాలా కష్టమైన పని. అతడు చేతితోనే కలుపు తీస్తాడు. చేతితోనే పంటను కోస్తాడు. చేతితోనే నూర్చి ధాన్యం తీస్తాడు.

"నేను ఒక తరగతిలోని డజను మంది బాలురను పారలు తీసుకొని త్రవ్వడానికి వంగియుండడం చూచాను. చాలా ప్రదేశాల్లో పాఱ ఒక మంచి వ్యయసాయపు పనిముట్టు అనేది మరవకండి. వారికే ఒక మరపాఱ ఇస్తే ఇంకా ఎంత బాగుగా పని చేసేవారో ఆలోచించండి.

"జనాభా ఎక్కువగా ఉన్న అక్కడ బాలురకు ఇంక వేరే పని లేదు కాబట్టి, వారలు అలాగ కష్టపడి పని చేస్తారని మీరు చెప్పవచ్చును. మరి వారి నెందుకు మరనాగళ్ళను ఉపయోగించేవారిగా చేయకూడదు? అని అడుగవచ్చును. కాని, వారికి ఇప్పుడవి లేవు.

ఇంకా చాలాకాలంవరకు వారు వాటిని సంపా దించుకోలేరు.

"హిందూదేశంలోని ఒక గ్రామంలో నేను ఒక రైతుతో మాట్లాడాను. ఆ గ్రామానికంతా తన 9 ఏండ్ల కుమార్తె చదువగలదు అని అతను చాలా గర్వపడుతున్నాడు.

"ఆ బిడ్డ వాళ్ళ తల్లివలె పొలంలో పనిచేయడానికి ఇష్టపడదని అతను నాకు చెప్పాడు. వాళ్ళ తల్లి ఆ బిడ్డ వయస్సులో ఉండినప్పుడే పొలంలో పనికి పోయేది. ఒక మనిషి కష్టం ఆ మనిషి తిండికే సరిపోతుంది. కాబట్టి పాఠశాలకుపోతే ఇంట్లో అన్నం దొరకదు. చదువు కోవడం వారికి వీలుకాదు.

"ఇంతవరకు కడుపార తినడం తెలియని ప్రజలకు ఇక ముందైనా సహాయపడడం ఎఫ్. ఏ. ఓ. యొక్క విధి."

ఆహారం సమృద్ధిగా ప్రపంచ ప్రజలందరికీ లభించా లనేదే ప్రపంచ ఆహారసంఘం (ఎఫ్.ఏ.ఓ.) పరమాశయం.

# రాత్రింబగళ్ళు వైద్యసహాయం

అబెడ్, నజీర్ అనే వారు ఎప్పుడూ బడినుండి చుట్టు త్రోవనే ఇంటికి పోయేవారు. ఆ త్రోవలో ఆగవలసిన స్థలం ఒకటి ఉంది. వ్యాపార ప్రదేశమైన కెయిరో నగరంలో పోతూ వారు పెద్ద మేడలను, అంగడులను, మార్కెట్ల దగ్గరి గుంపులను దాటుకుంటూ పోయి ఆ ఆగవలసిన దగ్గర ఆగుతారు. వారు ఎప్పుడు వచ్చినా సరే ఆ సమయానికి గిజేలోని పిరమిడ్లను చూచివచ్చిన వారితో ఒకకారు తప్పకుండా వచ్చివుంటుంది.

ఎంత ఆతురతగల ప్రజలు! చూడవచ్చిన వారిని గురించి, వారుచేసిన వింతలనుగురించి బండివారు కథలుగా చెప్పుకుంటారు. కొందరు పిరమిడ్ పైభాగం వరకు గోలచేస్తూ పోయి, కుడివైపు చుట్టూ తిరిగి క్రిందికి చూడకుండానే వచ్చేస్తారు. ఒంటెపైన కూర్చొని ఫోటోలు తీసుకొనేందుకు వారు ఎంతడబ్బు ఇస్తారు! వారు డబ్బు ఖర్చు అయినందుకు లెక్కచేయడం లేదు. వారు, తిరిగి వచ్చేటప్పుడు నవ్వుకుంటూ తమాషాలు చేస్తూ ఉంటారు.

కాని, 1947 వ సంవత్సరం అక్టోబరు నెలలో ఒకనాడు వారు కారు దిగునప్పుడు ఎట్టి నవ్వులుగాని, సంతోషం గాని లేవు. కొందరు విచారంతో గబగబ నడచి వెళ్లారు.

బిక్కిరి చూపులు చూస్తూ కొందరు భయంతో గుసగుస మని మాట్లాడుకొన్నారు. ఏమి జరిగిందో? అబెడ్, నజీర్ వీరిద్దరు బండితోలే వాడైన కాసిమ్ దగ్గరికి పరుగెత్తారు. అతడు టిక్కెట్లు లెక్క పెడుతున్నాడు.

"చూడవచ్చిన వారిలో ఎవరైనా పిరమిడ్‌నుండి కాలుజారి పడి దెబ్బతిన్నారా?" అని అబెడ్ అడిగాడు. ఆ ఛలోక్తికి నజీర్ నవ్వ సాగాడు.

"ఇంకా నీకు నవ్వే? ఎప్పుడో ఒకప్పుడు నీవూ చస్తావు. నేనూ చస్తాను. అందరూ చస్తారు" అన్నాడు కాసిమ్ టిక్కట్లని చూస్తూ.

అందరిలోనూ ఎప్పుడూ తమాషాగా ఉండే కాసిమ్ అలా మాట్లాడుతున్నందుకు ఆ బాలురు తత్తర పాటుతో చూచారు. ఏమిజరిగిందని అబెడ్ అడిగాడు.

నిజంగా అదేనన్నాడు కాసిమ్. అది మళ్లావచ్చింది. గిజే గుండా బండి తోలేవాడు ఒకడు చెప్పేడు— "కలరా. 40 సంవత్సరాలకు ముందు అగ్నిజ్వాల లాగా వచ్చింది. ఎవ్వరూ తప్పించుకోలేదు. అందరూ చచ్చారు. మా తాత చూచాడు," అన్నాడు కాసిమ్.

తర్వాత అతను "పరుగెత్తండి! మీ ప్రాణాలు కాపాడు కొనేందుకు పరుగెత్తండి" అంటూ చేతులు ఆడిస్తూ చెప్పాడు.

గుంపులనూ, బండ్లనూ తప్పించుకొంటూ ఆ బాలురు పరుగెత్తారు. ఇండ్లకుపోతూ వారు చీలిపోయారు. ఒక మూల తిరుగుడులో అబెడ్ ఇంకొక యువకునితో ఢీ కొట్టాడు. ఆ యువకుని చేతుల్లోని పుస్తకాలు క్రింద పడిపోయాయి.

"వెధవా!" అని ఆ యువకుడు అరచాడు. తర్వాత "అబెడ్! ఆగు! వెంటనే ఆగి నా పుస్తకాలు ఎత్తు!" అన్నాడు.

అబెడ్ రోజుకుంటూ నిలచాడు. అతను తన అన్నే! ఓరా అతని పేరు. ఓరా కెయిరోలోని అమెరికన్ విశ్వవిద్యాలయంలో లా చదువుతున్నాడు. వాళ్ళ తండ్రితో పాటు, లాయరు కావాలని అతని ఉద్దేశం.

అబెడ్, ఓరాయొక్క భుజాన్ని పట్టుకున్నాడు. మనం చనిపోతాం అంటూ అతని భుజాన్ని ఇంకా గట్టిగా పట్టుకున్నాడు. "నీవు, అమ్మ, నాన్న......ఇంకా అందరూ..."

ఓరా కోపంతో, "నీకు పిచ్చిపట్టిందా?" అన్నాడు.

"కలరా! కలరా వచ్చింది. గిజేగుండా బండి తోలుకొని పోతూ ఒక మనిషి కాసిమ్‌తో చెప్పాడట," అన్నాడు అబెడ్.

"కాసిమ్‌కు మతిపోయింది. వాడెవడో చెప్పిందంతా నమ్మినాడు" అన్నాడు ఓరా.

"కాదు. అది నిజం. నాకు తెలుసు," అని అబెడ్ నొక్కి చెప్పాడు. "రా! తొందరగా మనం పరుగెత్తాలి. అది అగ్ని జ్వాలలాగా వ్యాపిస్తుందని కాసిమ్ చెప్పాడు."

"నిదానించు తమ్ముడూ!" అన్నాడు ఓరా. "పుస్తకాలు తీసికో. మనం ఇంటికి పోదాం. ఆస్పత్రిలోని ఆలీతో టెలిఫోన్‌లో మాట్లాడుదాం. ఆ కొత్త వాడి కన్నా ఇతనిమాట నమ్మవచ్చు." ఆలీ అనే అతడు వారి పినతండ్రి కుమారుడు. కెయిరో ఆస్పత్రిలో పని చేస్తాడు.

"అందరూ చనిపోతారని కాసిమ్‌కు ఏం నమ్మకం?" అన్నాడు ఓరా.

"కలరా వచ్చినప్పుడు అతని తాత చూచాడట. అందరూ చచ్చారట. ఒక్కరూ తప్పించుకోలేదట," అన్నాడు అబెడ్.

ఓరా వెగటుగా నవ్వుతూ, "కాని, కాసిం తాత మాత్రం దాన్ని చెప్పడానికి ఎలా బ్రతికున్నాడు?" అన్నాడు ఓరా.

"ఓ!" అని సందేహించాడు అబెడ్.

ఆస్పత్రిలో ఒక లావుగా పొట్టిగా ఉండే ఫోను పనివాడు ఓరా పిలుపుకు బదులిచ్చాడు. "ఆలీ ఫోను దగ్గరికి వచ్చేందుకు వీలులేదు. మీా రెవరు? ఎక్కడ ఉన్నారు?"

"నేను అతని సోదరుడను. నేను మా ఇంట్లో ఉన్నాను" అన్నాడు ఓరా.

"అయితే అక్కడే ఉండండి. కదలవద్దండి. మీారేం చేయాలో రేడియో చెబుతుంది. కలరా వ్యాపించింది జాగ్రత్త."

ఆ రాత్రిలోపలే ఈజిప్టు ప్రభుత్వాధికారులు జనులు గుంపులుకూడే మార్కెట్లను, సంతలను మూసివేశారు. సరిహద్దులలో మంచి కాపలా పెట్టేశారు. "ఉద్యోగులు తప్ప ఇంకెవ్వరూ బయటకు పోకూడదు; లోపలకు రాకూడదు. డాక్టర్లు, నర్సులు, రెడ్‌క్రాస్ సంఘ సేవకులు కలరా వచ్చిన చోటికి వెళ్ళసాగారు. ఎవరు కూడా టీకాలు వేయించుకోకుండా బయటకు వెళ్ళ కూడదు," అని రేడియో అందరికీ చెప్పింది.

కాసిం చెప్పింది నిజమే! కలరా అగ్నిజ్వాలవలెనే వ్యాపించింది. గత శతాబ్దంలో అది ఐరోపాలో అయిదు మార్లు వచ్చింది. మూడుమార్లు అట్లాంటిక్ సముద్రాన్ని దాటుకొని ఉత్తర అమెరికాకు వ్యాపించింది. ఆ ప్రభుత్వం

ప్రజలకు కలరా వ్యాపించిందని చెప్పడానికి ముందే ఆ విషయం జినీవాలోని ఐక్యరాజ్య సంఘంయొక్క ప్రపంచ ఆరోగ్య సంఘానికిచెందిన అంటువ్యాధి నివారణ సంఘానికి తెలుపబడింది. వాషింగ్టన్‌లోని పాన్ అమెరికన్ సంఘం మూలాన అమెరికా అంతా ఆ విషయం వ్యాపించింది. ప్రపంచానికంతా జాగ్రత్తగా వుండవలసినదని హెచ్చరిక చేయబడింది.

ప్రపంచంలోని ప్రజలు కార్యాచరణకు దిగారు. ఈజిప్టు ప్రజలందరికీ సూదిమందు పంపించాలి. వారు మొత్తం 480 లక్షలమంది. అన్ని దేశాలలో ఉన్న మందునుచేర్చినా అంతమందికి సరిపోయేమందు ఉంటుందా ? ఉండవచ్చును. అమెరికా సంయుక్త రాష్ట్రాలలోని అన్ని పరిశోధనశాలలూ వేరే పనులు మాని ఈ సూదిమందు తయారుచేయడానికి పూను కొన్నాయి. అంటువ్యాధిని నివారించే ప్రముఖులు, రెడ్ క్రాస్ సంఘంవారు అందరూ 48 గంటల లోపల విమానాలలో వీలైనంత మందును తీసుకుపోయారు. చాలా దేశాలనుండి స్వయం సేవకులు బయలుదేరారు. 32 టన్నుల సూదిమందు, ఇతర ముఖ్య పదార్థాలు ఓడలద్వారా పంపబడ్డాయి.

ఈజిప్టులో నాలుగు వారాలపాటు కలరా వ్యాపించింది. ఆపైన వైద్యులు దాని వ్యాప్తిని

అరికట్టారు. కలరాను అంత కొద్దికాలంలో ఆపడం చరిత్రలో అదే మొదటిసారి. మరణించే వారి సంఖ్య చాలావరకు తగ్గించబడింది.

ప్రపంచంలోని ప్రజలు సమైక్యంగా పనిచేశారు. అలాగ పనిచేయడం సాధ్యంకూడా. ఎందుకంటే ప్రపంచ ఆరోగ్యసంఘం తయారుగా ఉంది. 1946 వ సంవత్సరంలో ప్రపంచ ఆరోగ్యసంస్థ స్థాపించబడినప్పుడు దాని ముఖ్య కార్యక్రమాలలో అంటువ్యాధులను నివారించడం ఒకటి. అది రేడియోలను, తంతులను ఎక్కువగా ఉపయోగించాలనీ, అవసరమైన సమాచారాలను సేకరించే కేంద్రాలను ఎక్కువ చేయాలనీ నిర్ణయించారు. అనుభవశాలురతో కూడిన ఒక శాఖ త్వరితంగా వ్యాపించే వ్యాధులను నిర్మూలించేందుకు ముందుగా తీసికొనవలసిన జాగ్రత్తలను అన్ని దేశాలకూ తెలిపింది.

ఈనాడు జనీవాదగ్గర ఉన్న 10 వార్తా ప్రచార కేంద్రాలకు వివిధ దేశాలనుండి వచ్చే వార్తలు దినానికి రెండుమార్లు ప్రపంచానికంతా వినిపించబడుతాయి.

1950 సంవత్సరంలో 74 దేశాలవారు ప్రపంచ ఆరోగ్య సంస్థయొక్క ప్రకటనలో చేవ్రాలు చేశారు. వీలైనంత ఎక్కువ ఆరోగ్యకర పరిస్థితిని నెలకొల్పడం ప్రతి మానవునికిని గల ముఖ్యమైన హక్కులలో ఒకటి.

"శాంతి భద్రతల సాధనకుకూడా అది ముఖ్యం. ఆరోగ్యం అన్నది ఏ రోగమూ, లోపమూ లేకుండా ఉండడమే గాక, శారీరకంగా, మానసికంగా, సాంఘికంగా చక్కగా ఉండడమే"—అని ఆ ప్రకటనలో తెల్పబడింది.

ప్రపంచారోగ్య సంఘంయొక్క ఆదర్శం అందరూ మంచి ఆరోగ్యవంతులుగా ఉండేటట్లు చెయ్యాలని. ఆ సంఘంయొక్క సభ్యులు ప్రతి సంవత్సరమూ సమావేశమై జరిగిన అభివృద్ధిని పరిశీలించి కొత్త ప్రణాళికలను తయారుచేస్తారు. 18 దేశాల ప్రతినిధులతో కూడిన కార్యనిర్వాహక సంఘం ఆ ఆదర్శాన్ని ఎన్నటికీ మరువదు. ఇతర సంఘాలవలె ఆ సంఘసభ్యులుకూడా విరామంలేకుండా ఇతర దేశాల పిలుపులపై అచ్చటికి పోయి పనిచేస్తారు. పలు దేశాలలో యువజనులకై పాటుపడే ప్రపంచారోగ్య సంఘానికి, ప్రభుత్వాల జట్టులకు ప్రపంచ శిశుసంరక్షణ సంఘంనుండి ధనం వస్తుంది.

ఆహార వ్యవసాయసంఘం, ప్రపంచారోగ్య సంఘం ఈ రెండు కలిసి మెలిసి భాగస్వాములై పనిచేస్తాయి. ఇవి రెండు కలిసి పుష్టికరమగు ఆహార పదార్థాలను పండించగల ప్రణాళికలను తయారుచేస్తాయి.

జనీవాలో ఉండే ప్రపంచారోగ్య సంఘంయొక్క కార్యాలయం చాలా పని తొందరలో ఉంటుంది. అచ్చటి కార్యనిర్వాహక సంఘానికి ప్రతి సంవత్సరము సలహాలను అడుగుతూ వేలకొద్ది ఉత్తరాలు వస్తాయి. మంచి జవాబులతో మందుల విషయాల పుస్తకాలు కూడా పంపబడుతాయి. కేంద్రాలలో పనిచేసేందుకు సహాయం కూడా దానిని అడుగుతూంటారు. ఆ సంఘం బాగా ఆలోచించి పనివారిని పంపుతుంది.

ప్రపంచంలోని అనుభవజ్ఞులను పిలిచి ప్రజలకై వారి తెలివిని ఉపయోగించమని ప్రపంచారోగ్య సంఘం చెబుతుంది. వివిధ దేశాలనుండి అనుభవజ్ఞులు జట్టులుగా వస్తారు. వివిధ వ్యాధులను గురించి చర్చించి ఆ విషయాలను పత్రికలద్వారా ప్రపంచానికి తెలియజేస్తారు. దాన్ని చూచి ఎంతోమంది నేర్చుకుంటారు.

ప్రపంచారోగ్యసంఘం చర్చించే ప్రణాళికలలో మందుల ప్రమాణం సక్రమంగా ఉండేటట్లు చేయడం ఒకటి. ఎక్కడ మందు తీసుకొన్నా ఒకే విధంగా కల్తీ లేకుండా ఉండేటట్లు చేయాలి. ఇందువల్ల అందరికీ లాభమే!

జనీవా నగరంలోని ప్రపంచారోగ్య సంఘం ఆఫీసుకు వచ్చే పిలుపులు రకరకాలైనవి. వాటికన్నిటికీ

అనుభవజ్ఞులు జవాబులు వ్రాస్తారు. జట్టులను పంపాలనీ, దేశం మొత్తంమీద ఆరోగ్య ప్రణాళికలను తయారు చేయాలనీ అడుగుతారు. అప్పుడు జట్టులుపోయి పని చేస్తాయి.

ఇలా పరిశీలించి ప్రణాళికలను వేసే జట్టులలో ప్రారంభ సమయంలో ఇటలీకి పోయిన జట్టు చాలా పెద్దది. వారు వేసిన ప్రణాళిక చాలాకాలం వరకూ ఉండడమే కాక అన్ని విధాలైన ఆరోగ్య విధానాలు అందులో ఉన్నాయి. వాటిలో చాలామట్టుకు ఇటలీ ప్రభుత్వం అప్పుడే నెరవేర్చింది.

మెంబరు దేశాలుకూడా ప్రపంచారోగ్యసంఘం అభివృద్ధికై తగు కార్యక్రమాలను పరిశీలన చేస్తుండినాయి. రోమ్ నగరంలో జరిగిన ప్రపంచ ఆరోగ్య శాసన సభకు హాజరైన అమెరికా సంయుక్తరాష్ట్రాల వైద్య ప్రముఖుడు జె. సి. డావేస్ అనే ఆయన అనుభవాన్ని, తెలివిని చూచి ఆరోగ్య విషయాలను పరిశీలించేందుకై రమ్మని సంఘంవారు ఆహ్వానించారు.

డావేస్ రెండు నెలలు అమెరికాలో ఉండి, చాలా ప్రాంతాలలో తిరిగి చూచాడు. అమెరికాలో ఇంటి చెత్తను పారవేయడంలో ఉండిన పద్ధతి ఆరోగ్య శాఖవారికి చాలా సహాయంగా ఉండినది. అట్టి

పద్ధతులు అన్ని దేశాల వారికి అనుసరణీయ మని డావేస్ తెలియజేశాడు.

కొన్ని దేశాలనుండి తమ వైద్యశాఖవారిని తర్ఫీదు చేయడానికి అనుభవజ్ఞులు కావాలని పిలుపులు వచ్చేవి. వెంటనే జట్టులు వెళ్లేవి. వైద్య శాలలు, ఆరోగ్య శాఖ పనివారు కొరతగావున్న ఇతియోపియాలో వెంటనే ప్రారంభ పాఠశాలలు మొదలు పెట్టారు. ఆ జట్టులు అచ్చటనుండి వెడలిపోయేసరికి అచ్చట 132 మంది పట్టభద్రులు తయారయ్యారు.

విశ్రాంతి తీసుకోవలసిన డాక్టర్ లియో ఎలో ఎస్సర్ అనే హృద్రోగవైద్య ప్రముఖుడు చైనాకు వెడుతున్న పెద్ద జట్టుతో కూడా చేరాడు. ఉత్తర చైనా లోని ఒక రాష్ట్రంలో అతడు చికిత్సలోనూ, ప్రజల ఆరోగ్యంలోను పాఠాలు చెప్పాడు. అతనే చాలా పాఠాలు స్వయంగా బోధించాడు.

కొంతకాలం పనిచేశాక అతను ప్రపంచారోగ్య సంఘానికి ఇలా జాబు వ్రాసి పంపించాడు :

"చాలామంది బాలురు మంచి పాఠాలు నేర్చుకున్నారు. నీటి సరఫరాలో తప్పులు కనిపెట్టడం, వాటిని బాగుచేయడం మొదలైన చిన్న ఆరోగ్య విషయాలు నేర్చుకున్నారు. దోమలు, ఈగలు ఇలాంటివి ఉండే

చోట్లను నిర్మూలించడంకూడా నేర్చుకున్నారు. సర్వ సాధారణమైన అంటువ్యాధుల లక్షణాలు వారికి తెలుసును. వారే సూదిమందు వేసుకోగలరు. వారికి ప్రథమ చికిత్స తెలుసును. కాన్పులలో సహాయపడడం కూడా నేర్చుకున్నారు. వారికి ప్రజల సహకారాన్ని పొందడం బాగా తెలుసును."

అతని శిష్యులు ఇంటికి రాగానే ఆ పనులన్నీ చేశారా? చక్కగా చేశారు. కూవో అత్త అనే ఆమె ఉండింది. ఆమె చైనాలో కూవో టానియాంగ్ అనే చోటనుండి రావడంచేత ఆమెను అక్కడి వారంతా కూవో అత్త అని పిలచేవారు. ఆమెకు చదువను, వ్రాయను తెలియదు. కాని, ఆమె తన 57 సంవత్సరాల్లోనూ 12 సంవత్సరాలుగా మంత్రసాని పని చేసింది. ఆ పల్లెలోని వారంతా ఆమె మంత్రసాని' పనిలో సగం మంది పిల్లలు చనిపోయినాకూడా ఆమెనే విశ్వాసంగా చూస్తారు.

ప్రపంచారోగ్య సంఘం అధ్వర్యాన శిక్షణకు కూవో అత్తను ఎన్నుకున్నారు. అప్పుడు ఆమె తగినట్టుగా ఉండింది. ఆ పాఠాలు చాలా సులభంగా ఉండినవి. ఆమె వాటిని చాలా బాగా అర్థం చేసుకొంది. మంత్రసానిపని చేయడానికి ముందు గోళ్ళు శుభ్రంగా కత్తిరించుకోవాలని ఆమె నేర్చుకుంది. చేతులు వెచ్చని

సబ్బునీళ్ళతో కడుక్కోవాలి. తన పనిముట్లను ఆల్కాహాలుతో వేడిచేయాలి. లేకపోతే వేడి నీళ్ళతో కాచాలి. మునుపటి వలె బిడ్డను ఇసుకలో దొర్లించక నూనెతో స్నానం చేయించాలి.

ఉత్సాహంగా కూవో అత్త తన ఊరికి పోయింది. ముందుగా చదువను వ్రాయను తెలిసిన తన స్నేహితురాలిని పిలిచి తాను చెప్పిందంతా రాసి తాను మరచి పోయినప్పుడు దాన్ని చదివి వినిపించమని చెప్పింది.

ఆనందంగా ఆమె కాన్పులకు హాజరు కావడం మొదలు పెట్టింది. మొదట గర్భిణీస్త్రీని పండుకొని విశ్రాంతి తీసుకోమనేది. తాను నేర్చిన విధులను చెప్పేది. అవి చేయించేది.

కొంతకాలం తర్వాత ప్రపంచారోగ్యసంఘం ప్రచారకుడు కూవో అత్త ఎలా పని చేస్తున్నదో చూడడానికి రాగా ఆమె గుడ్డలు ఉడకబెట్టడం చూచాడు. "నేను వైద్యశిక్షణశాలకు పోయివచ్చిన తర్వాత ఒక్క బిడ్డకూడా మరణించలేదు. నేను ఆరు మందికి కాన్పులు పోశాను. అందరూ బ్రతికున్నారు," అంది ధీమాగా.

ఆవిధంగా ప్రపంచారోగ్యసంఘం అన్ని సమయాల్లోనూ పనిచేసింది. అది అన్ని వ్యాధులతో పోట్లాడింది. మలేరియా, క్షయదగ్గు ఈ రెండు వ్యాధులు



వ్యాపించి ఉండే చోట్లలో వాటిని నివారించాలని: అది తీర్మానించింది.

ఉత్తర గ్రీసుదేశంలోని ఒక పల్లె కొంపలోని 13 ఏండ్ల అలెకో అనే బాలునికి ఆ నిర్ణయం ఏమీ తెలియదు. కాని, చిన్నప్పటినుంచి అతను భయపడు తున్న మలేరియానుండి అతన్ని కాపాడింది ఆ నిర్ణయమే! వారి ఇంటిలోకి దోమలు వస్తున్నాయి. అతని తండ్రి మలేరియా జ్వరంతో ఉండడంచేత పొలానికి పోలేదు. అతని తల్లికి కూడా ఆ జబ్బే. ఆమె తన కుమారుని చూచుకొన్నప్పుడల్లా మలేరియా వస్తుందేమో అని భయపడుతుంది.

తరతరాలుగా మలేరియా ఉండడంచేత, ప్రపంచ ఆహార వ్యవసాయ సంఘంవారు సహాయం అడగడంచేత, ప్రపంచారోగ్య సంఘంవారు అంతర్జాతీయ మలేరియా సంఘాన్ని గ్రీస్‌లో ప్రారంభించారు.

వేలకొలది రైతులు మలేరియాచేత మంచంపట్టి పని చేయలేకున్నప్పుడు, మనం ఈ గ్రీసులో ఎక్కువ పంటను కండ్ల జూడలేమని ఒక ఆహార వ్యవసాయ సంఘ ప్రచారకుడు వ్రాశాడు.

మలేరియాతో పోరాటానికై ఆరోగ్యసంఘం, గ్రీస్ ప్రభుత్వం కలిసి చాలామంది వైద్యులను, మందులను చల్లే జట్లులను నియమించాయి.

వందల కొలది డి. డి. టి. పీపాలను నౌకల కెక్కించి పంపించారు. చిమ్మే గొట్టాలు వచ్చాయి. పాత విమానాల్లో పెద్ద తొట్లుకట్టి మందుపోసి దోమల ప్రాంతాల మీద చల్లడానికి ఉపయోగించారు. వైద్య ప్రముఖులు అమెరికానుండి వచ్చి ఇతరులను తయారుచేశారు.

అంతా ఎక్కడ చూచినా వేలకొలది ఎకరాలవరకూ ప్రతిచోట డి. డి. టి. అనే దోమల మందు చల్లేశారు. ఇంటా, బయటా, వీధుల్లో, సందులో, గొందుల్లో అంతా చల్లేశారు.

అందువల్ల ప్రయోజనం ఉందా ? రెండు సంవత్సరాల లోపల మలేరియా రోగుల మరణ సంఖ్య ఎంతో తగ్గిపోయింది. అలెకో బాలుని తల్లికి ఇప్పుడు భయంలేదు. అలెకోకుకూడా భయం పోయింది. అన్ని చోట్లా అందరికీ అంతే !

వెంటనే రమ్మనిన ఇండియా పిలుపును బట్టే అచ్చట ఎంత మలేరియా బాధ వున్నదీ ప్రపంచ ఆరోగ్య సంఘంవారు తెలిసికొన్నారు. 1000 లక్షల మంది ప్రజలన్నా మలేరియావల్ల బాధపడుతుంటారని వారికి

తెలుసును. ఇండియాలోని డాక్టర్లూ, ఆరోగ్య ప్రచారకులు కూడా వారితో కలసి పనిచేయడానికి తయారుగా ఉండినారు.

తెరెయ్ అనే ప్రాంతానికి వెళ్ళిన జట్టుకు పెద్దగా డాక్టర్ జార్జ్ బెలియాస్ అనే ఆయన ఉండినాడు. ఆయన జనీవాకు తిరిగివెళ్ళి ఒక అమెరికను పత్రికా సంపాదకునితో మాట్లాడుతూ ఇలా అన్నాడు :

"నేను ఎక్కడకూడా తెరెయ్ వంటి ప్రదేశాన్ని చూడలేదు. 350 మైళ్ళవరకూ తడిగా ఉండే దుర్గంధపు అడవిప్రాంతం మధ్య ఒక పాడుత్రోవ ఉన్నది. అది చాలాచోట్ల నడవడానికే పనికిరాదు. 15 వేల మంది జనులు మట్టిగోడల పూరిగుడిసెల్లో ఉన్నారు. ప్రతి సంవత్సరము జనాభా మలేరియా వ్యాధివల్ల తగ్గి పోతూంది. ప్రతి కొలది సంవత్సరాలకు 256 గ్రామాల ప్రజలు పూర్తిగా మరణిస్తున్నారంటే మలేరియా ఎంత తీవ్రంగా ఉన్నదో ఊహించండి.

"నేను నా జట్టుతో ఒక పాడుపడిన చక్కెర మిల్లులో ఉన్నాను. పెద్దపులులు, చిరుతపులులు ఎన్నో మా చెంత తిరిగేవి. మా జట్టులవారు భయపడి పరుగెత్తు కొని వచ్చేవారు.

"గ్రామాలలో మెలగడానికి నేర్పు, శాంతము కావలసి ఉంది. ఆ పల్లెల్లో స్త్రీల సంఖ్య ఎక్కువ. ఆ ఆడవారు పరాయివారువచ్చి తమ ఇండ్లలోపల, ఇండ్లపైన ఏదో మందు చల్లటానికి ఇష్టపడరు. వారి మతానుసారం గోడలపై పేడతో అలికేవారు. ప్రతిసారి మేముపోయి మళ్ళీ డి. డి. టి. చల్లవలసి వచ్చేది.

"కొన్ని గ్రామాలను చేరడమే కష్టం. మట్టిలో తంటాలుపడుతూ నడిచేసరికి 7 గంటలుకూడా పట్టేది. వారు దేవతలను పూజించుకొనేవరకు మేము కనిపెట్టు కొని ఉండాలి.

"ఆ తరతరాల అలవాట్లు మార్చడం కష్టంగా ఉండేది. కాని, కొన్ని పల్లెల్లో మేము పనిచేయగానే, మిగతా వాటిలో పనిచేయడం సులభమయేది. మేము మందు చల్లడంవల్ల నిద్ర బాగా పడుతూందని, ఆవులు దోమల బాధలేక పాలు చాలా ఇస్తున్నాయని తెలిసింది."

మూడు సంవత్సరాలలో ఇదే విధంగా వివిధ దేశాలలో మలేరియా వ్యాధిని నిర్మూలించడం జరిగింది. వివిధ సంఘాలు పనిచేశాయి.

క్షయ నివారణకై ప్రపంచారోగ్యసంఘం చేసిన పనికూడా ప్రపంచమంతా వ్యాపిస్తూంది. చాలా

దేశాలు దేశం మొత్తంమీద పరీక్షచేయడం, ఆ వ్యాధిని రాకుండాచేయడం, వ్యాధిని మాన్పడం గురించి ఎలాగ చర్యలు తీసుకోవాలో తెల్పవలసిందని అడిగాయి. మూడు సంవత్సరాలలోపల ప్రపంచ ఆరోగ్యసంఘం వారు బి. సి. జి. సంఘాలతో ఉత్తర ఆఫ్రికా, ఆసియా, ఐరోపా, దక్షిణ అమెరికాఖండం, మధ్య ప్రాచ్య దేశాలకు వెళ్ళి పనిచేశారు.

కొత్తరకం చికిత్సలతో క్షయ దగ్గును అరికట్టడానికి ఆరోగ్య సంఘంవారు అనుభవం కలవారిని సమావేశ పరుస్తుంది. 40 మంది పారిస్‌లో సమావేశమై స్ట్రెప్టోమైసిన్ అనే కొత్తమందును అంగీకరించారు. ఆ కొత్తమందును ఎలా వాడాలో వైద్యులు చెప్పారు.

"సంఘం ఆరోగ్యమే ప్రతి మానవునికీ కావలసిన ముఖ్య విషయమని గుర్తించబడింది. ప్రపంచంలోని ఇతర జాతుల ప్రజలతోను, ఇతర సాంప్రదాయాల తోను, ఇతర మతాలతోను, ఇతర సాంఘిక ఆచారాల తోను సమభావంతో మెలగడమే ప్రతి మానవుని ముఖ్య కర్తవ్యం," అని డాక్టర్ ఛిషోల్మ్ అనే ఆయన చెప్పాడు. ప్రపంచారోగ్యసంఘ కార్యక్రమం అదే.

# పరస్పర సద్భావం

16 సంవత్సరాల వయస్సుగల కిరియా అనే బాలిక తాను నివసించే గ్రామంలో పొదల చాటున పొంచుండి పాఠశాల దగ్గర ఆడుకునే పిల్లలవైపు చూస్తూంది. పాత ఇటుకరాళ్ళతో బొమ్మరిల్లును కట్టుకునేందుకు ప్రయత్నిస్తున్న ఆ పిల్లలు చిలిపి పిల్లలని కిరియా అనుకుంది.

నిజంగా వారు తెలివితేనివారే. అలాగే కిరియా యున్నూ, యుద్ధానికి ముందు ఆమెకు స్నేహితులుగా ఉండినవారున్నూ ఇంకా ఎక్కువ బుద్ధిలేనివారే! వారు ఈనాడు తలచుకొనేదంతా పాఠశాలను గురించే. సాయంకాలం వారు ఇంటిదగ్గర కూర్చొని అయ్యవారి దగ్గర ఉండే ఒక్క పుస్తకంలోనుండి రేపటికి కావలసిన పాఠాలను వ్రాసుకొనేవారు.

యుద్ధకాలంలో కిరియా అలా లేదు. మెల్లగా విరోధుల శిబిరాల్లోకి వెళ్ళి వారి తలలక్రింద ఉండే ఆహార పదార్థాలను దొంగిలించేది. ఆమె ఒక శిబిరం నుండి ఇంకో శిబిరంలోకి వెళ్ళని వారం లేదు. అప్పుడప్పుడూ పట్టుబడి చావు దెబ్బలుకూడా తినేది. అప్పుడు ఆమె నందరూ చాలా బాగా ఉంది అనేవారు.

యుద్ధం అయిపోగానే బాలబాలిక లందరిలోనూ ఆమే ఎక్కువగా పొగడబడింది.

కాని ఇప్పుడో! వారు ప్రతి ఒక్కరినీ మెచ్చు తున్నారు. కిరియాను మాత్రం కాదు. బల్లలు, బోర్డులు, పటాలు ఏవీ లేని ఆ పాఠశాలకు పోనందుకు ఆమెను వాళ్ళ అమ్మ తిట్టేది. కొట్టేది. ఏదైనా పెట్టె ఉంటే దానిపైన కూర్చోవచ్చును. లేకపోతే నేలమీద కూర్చోవాలి. కాని, పనికిరానిది అదికాదు. ఆమె స్కూలుకు పోయిన రెండుదినాల్లోనూ ఉపాధ్యాయులు ఆమెను చిన్న పిల్లలతోపాటు లెక్కల తరగతిలో వేశారు. ఆమె ఎప్పుడూ లెక్కల్లో మొద్దుగా ఉండేది. అది ఆమెతప్పా? కాదా? ఇప్పుడు ఆమె ముందుకన్నా వెనకబడింది. విరోధులు ఉండినప్పుడు సమాచారాలను తెలిసికొని వచ్చేందుకై పాఠాలు బోధించబడిన సమయంలో ఆమె ఎలా ఉండింది? అందరికన్నా పై చేయి. శత్రుసమాచారాలు చక్కగా కనిపెట్టేది.

కిరియా ఆ ఆడుకుంటున్న పిల్లలదగ్గరికి పోయింది. రెండుగదులు ఉండేటట్లు వారు ఒక్కొక్క ఇటుకరాయే పేర్చి గోడకట్టారు. దారికడ్డంగా ఉన్న ఇటుకల దిబ్బలో నుండి రాళ్ళు తెచ్చేందుకు వారు పోతున్నారు. వెంటనే

కిరియాచుట్టూ చూచింది. పరుగెత్తి అక్కడికిపోయి ఆ పిల్లలు చేసిందంతా కాలితోతన్ని ధ్వంసంచేసింది.

విజయ గర్వంతో తిరిగీ పొదలమాటుకు పోయింది. ఇటుకరాళ్లతో తిరిగివచ్చిన పిల్లలు ఆమె అనుకున్నట్లే చూచారు. చాలా కోపంతో కొందరు లోపలికి పరుగెత్తారు. మిగతావారు విచారంగా చూస్తూ నిల్చున్నారు. పంతులమ్మ, పెద్దపిల్లలు అందరూ రాగా ఆమెకు ఇంకా ఆనందమైంది. వారు ఏమీ తెలియక అటు ఇటు చూచారు. ఒక్కరూ చూడకుండా ఈ పని ఎవరు చేశారు? కిరియా నవ్వుకుంది. ఆమె దానికన్నా ఇంకా ఎక్కువ పనులు చేస్తుంది.

మరునటి రోజున తిరిగి కిరియా పొదలచాటున ఉంది. పిల్లలు వారి బొమ్మరిల్లును తిరిగి కట్టడం మొదలు పెట్టారు. కాని, వారి మనస్సులో అది లేదు. గోడ చక్కగా ఉండాలని కష్టపడకుండా ఊరికే తోచినట్లు ఇటుకలు పేరుస్తున్నారు. ఒక చిన్నబాలుడు ఏపనీ చేయడంలేదు. అందరికీ దూరంగా కూర్చొని పెడ ముఖంతో వారిని చూస్తున్నాడు. అతని పేరు కోస్టా. అతని తండ్రి యుద్ధంలో చనిపోవడంచేత, తల్లి కనబడక పోవడంచేత తన మామదగ్గర ఉంటున్నాడు. అతని తల్లిని కనిపెట్టడానికై కిరియా చాలా కష్టపడింది. ఆమె

అందరినీ విచారిస్తూ చాలాదూరం పోయినప్పటికీ ఎటువంటి జాడ తెలియలేదు.

క్రోస్టా గుండెపగిలేటట్టు వెక్కి-వెక్కి ఏడుస్తున్నాడు. అతను నిన్న ఆనందంగా బొమ్మరిల్లు చూసుకుంటూ ఇటుకలు తేవడం కిరియా కనులముందు మెరపులా మెరిసింది. మరుక్షణం క్రోస్టాచుట్టూ రెండు మెత్తని చేతులు వచ్చాయి. కిరియా అతడిని ఓదార్చడానికి పట్టుకుంది. శత్రువులు ఆ గ్రామంలో ఉండినప్పుడు పెద్ద బాల బాలికలందరికన్నా తమ గ్రామానికై ఎక్కువగా పనిచేసిన కిరియా! అదికాదు అతనికి జ్ఞాపకానికి వచ్చింది. కాని, పెద్దవారంతా ఆ కిరియా ధైర్యాన్ని గురించి చెప్పేకథలు జ్ఞాపకానికి వచ్చాయి.

"రా! క్రోస్టా! గోడలు పడిపోకుండా బొమ్మరిల్లు కట్టడం నేను చూపిస్తా రా!" అంది కిరియా.

మిగతా పిల్లలంతా పరుగెత్తి వచ్చారు. వారికి కిరియా చెప్పింది..."చూడండి. మనం పాఠశాల గోడ ప్రక్కను ఈ బొమ్మరిల్లు కడదాం. అది ఇంటిని బాగా నిలబెడుతుంది. కానీయండి; ఇప్పుడు ఇటుకలు తెండి."

ఆ పిల్లలంతా వెనక్కు ముందుకు తిరుగుతూ పని చేస్తూంటే, కిరియా "రెండు గదులెందుకు?" అని అడిగింది.

అందుకు ఆ పిల్లల నాయకుడైన స్టేలియో "మాకు చదువుకోడానికి ఒక గది కావాలి. అందుకై మాకొక గది ; ఇంకో గది డాక్టరుకు కావాలి. కిరియా!" అని చెప్పాడు. రెండు గ్రామాలకు అవతల నివసించే 76 సంవత్సరాల డాక్టరంటే వారికి చాలా ప్రీతి.

"పిల్లల పాఠశాలగది, డాక్టరుగది అని తెలిపే రెండు బోర్డులు మాకు కావాలి. వాటిని తయారు చేసేందుకు నీవు మాకు సహాయం చేస్తావా కిరియా!" అని అన్నాడు స్టేలియో.

బోర్డులు! వాటికి కాగితం, సిరా, లేక పెన్సిలు ఆమె ఎక్కడ తెస్తుంది?

"నేను మీకు సహాయం చేయగలను" అంటూ ప్రక్కగా పంతులమ్మ ప్రవేశించింది. పంతులమ్మను చూడగానే కిరియా పాదల దగ్గరికి పోయింది.

పంతులమ్మ "స్కూలు గోడను బొమ్మరింటి గోడగా ఉపయోగించడం చాలా మంచియోచన" అంది. "మీరంతా ఇక్కడే ఉండండి ; నేను మళ్లా వస్తాను" అంటూ స్కూల్లోకి పోయింది.

ఆమె నవ్వుతూ తిరిగివచ్చి "ఇదిగో మీకు కావలసినంత కాగితం ఉంది. నేను ఒక ప్రత్యేకమైన పనికై

దీన్ని అట్టే పెట్టి వుంచినాను. దానిని మీ బొమ్మరిల్లుకై తీసుకోండి. కిరియా! నీవు మధ్యాహ్నం కొంత బొగ్గు మసి సంపాదించగలవా? దాన్ని నీళ్ళల్లో కలిపితే సిరాగా తయారౌతుంది. పిల్లలూ! మీరంతా ఈకలు తెండి. వాటిని బ్రష్‌లుగా ఉపయోగించవచ్చును. అవి మనదగ్గర ఇప్పుడు అయిపోయాయి,'' అని చెప్పింది.

అది పూర్తికాగానే అంత చక్కని బొమ్మరిల్లుగా లేదు. దానికి పైకప్పు, తలుపులు లేవు. కాని, పిల్లలంతా అందులోని తమ గదిని, డాక్టరు తనకు తగినదని చెప్పిన గదినిచూచి చాలా సంతోషపడేవారు. మరి గుర్తులు! అవి స్ఫూలు గోడకు కట్టబడ్డాయి. వాటిని ప్రతివాడూ చదువవచ్చును.

బొమ్మరిల్లు పూర్తి అయిన మూడుదినాలవరకూ తీరిక సమయాల్లో కిరియా అక్కడ ఉండేది. నాల్గవదినం పిల్లలు పరుగెత్తుతూ బయటికిరాగానే వానపట్టుకొంది. ఆ బోర్డులను తీసివేయడానికి వారు పరుగెత్తుతూ తమకు సహాయంచేయమని కిరియాను అడిగారు. వారు. ఆమెను చుట్టుకొని లాగుతూ తోస్తూ తలుపు దగ్గరికి తీసుకొచ్చారు. అనుమానంతో కిరియా లోపలికి చూచింది. ఇతర బాలికలు ఆమెను చూచి నవ్వబోతారా? లేదు. మామూలుగా వారివారి పని చేసుకో

సాగారు. కిరియా పిల్లలతోకూడా ఉండి విరామకాలం అయిపోగానే వెళ్ళిపోయింది.

మరునాడు పిల్లలకు ఒక కొత్తయోచన తట్టింది. తమ బొమ్మరింటి గదిలో పగటిపూట కిరియా పంతులమ్మగా ఉండదా? వారు చదువుకునే కార్డులు బయటకు తీసుకుపోవచ్చునని పంతులమ్మ చెప్పింది. కిరియా యోచించి సరే అని చెప్పింది.

ఇంకో విషయం ఏమిటంటే పంతులమ్మ "కిరియా! నీవు పాఠాలు చాలా బాగాచెప్పావు. లెక్కలు చెప్పడానికి ఎందుకు ప్రయత్నించకూడదు. నేను అంతమందికి చెప్పవలసి ఉండడంచేత పిల్లలకు చెప్పలేకుండా ఉన్నాను," అని చెప్పింది.

కిరియా భయంగా "లెక్కలే!" అంది.

"నీవు ప్రతిదినం పాఠశాలకు కొంచెం ముందుగా రా. మర్నా చెప్పవలసిన పాఠాన్ని నీకు చెబుతాను," అంది పంతులమ్మ.

తక్షణమే కిరియా గట్టిగా నవ్వింది. "మరొక పంతులమ్మ!" ఆ చిన్న పిల్లలంతా అనుకుంటారు. సరే ఆమె లెక్కలు చేయగలదు. రేపటినుంచి మొదలు పెడుతుంది.

కొన్ని నెలల తర్వాత అందరూ ఇంటికి వెళ్ళి పోయిన పిమ్మట కిరియా పంతులమ్మ బల్ల ప్రక్కన నిలిచింది. "పాఠశాలలో ఇప్పుడు అన్నీ చాలా బాగా ఉన్నాయి. వారికి ఒక నల్లబల్ల, తుడిచే గుడ్డ, సుద్ద ముక్కలు ఉన్నాయి. వారికి పెన్సిళ్ళు, కాగితాలు, దేశపటము ఉన్నాయి. 10 పుస్తకాలుకూడా వచ్చాయి. శీఘ్రంగానే బల్లలు వస్తాయి," అని పంతులమ్మ చెప్పింది.

"నా హృదయ పూర్తిగా మీకు అభివందనాలు తెల్పుతున్నాను," అని అంది కిరియా.

కొద్దిక్షణాల క్రిందనే ప్రకటించిన పేర్ల పట్టికవైపు పంతులమ్మ అలా చూచింది. కిరియా పేరు అందరికన్నా పైన వుంది. ఆమె పేరు పిల్లల పేర్లలోకాక ఆమె ఈడువారి పేర్లలోనే పైగా ఉంది.

"నాకు అభివందనాలు చెప్పనలసిన పనిలేదు కిరియా! అదంతా నీప్రజ్ఞ," అంది పంతులమ్మ.

"పిల్లలు కట్టుకున్న మొదటి బొమ్మరిల్లును ధ్వంసం చేసింది నేనే" అంది కిరియా తన తప్పును ఒప్పుకుంటూ.

"నేనూ అలానే అనుకున్నా."

"నేను అప్పుడు ప్రతి ఒక్కరినీ ద్వేషించాను. మా అమ్మను, మిమ్మల్ని, ఇతర బాలికలను, ఇంకా..." అని చెప్పింది కిరియా.

"నిజానికి నువ్వు అందరినీ ద్వేషించలేదు. నీవు ఎన్నడూ పిల్లలను ప్రేమించడం మానలేదు."

ఆ పంతులమ్మ ఒక చిన్న ఇంగ్లీషు పుస్తకం తీసి పేజీలను తిరగవేసింది. "దీన్ని విను కిరియా! నీవు ఒక్కదానివే కాదు," అని చెప్పింది.

ఆమె చదువుతూ గ్రీకు భాషలోకి తర్జుమా చేసి చెప్పింది.

"యుద్ధంలో చాలామంది యువతీ యువకులు ఘన కార్యాలు చేశారనడంలో సందేహం లేదు. తప్పి పోయిన తలిదండ్రులను కనిపెట్టడంలోను, బ్రతికేందుకు ఆహారం సంపాదించడంలోను వారు సహనము, ధైర్యము, బుద్ధికుశలత, ఆలోచన మొదలైనవి చూపించారు. కాని, నేటి ప్రపంచం వారికి అధైర్యంగా కనబడుతూంది."

కిరియా ఆశ్చర్యంతో వింటూంది.

"దురాక్రమణ జరిపిన శత్రువులకు ఎదురు తిరగ మని చాలామంది యువజనులకు బోధించబడింది. విప్లవా లను జరపాలని వారు ప్రోత్సహించబడ్డారు. వారు సాహసులుగా, పట్టుదలగలవారుగా తయారు చెయ్య బడ్డారు. ఆ గుణాలనే వారు ఇప్పుడుకూడా ఉపయో గిస్తున్నారు."

కిరియా కండ్లలో నీరు కారుస్తూ "నేనుకూడా అలాగే ఉండినాను. నేనుకూడా అబద్ధాలు చెప్పాను, దొంగిలించాను, ఇంకా నేను....."

"అవును," అన్నది పంతులమ్మ. "యుద్ధం మీకు నేర్పిందంతా అదే కిరియా! కాని, నీవు పిల్లలను ప్రేమించిన విషయాన్ని ఎన్నటికీ మరువవద్దు."

"మీ మాదిరిగా ఒక పంతులమ్మ నవుతానని మీరు నాకు సహాయపడుతున్నారు. లేదు, నేను మీ మాదిరిగా పంతులమ్మను కాలేను. అంత మంచితనంగా ఉండలేను. కాని, పేరుకు మాత్రం ఒక పంతులమ్మను."

"నామాదిరిగా కాదు. ఇంకా ఉత్తమంగా ఉంటావు," అని అంది పంతులమ్మ మృదువుగా. భుజాలపైన చేతులు వేసుకొని వారు బడినుండి వెళ్ళిపోయారు.

వారివెనుక బల్లమీద ఆ పుస్తకం ఉండిపోయింది. దాని అట్టమీదవున్న బాలబాలికల చిత్రంక్రింద "ఐక్యరాజ్య విద్యా, సాంఘిక, సంస్కృతీ సమితి (యు. ఎన్. ఇ. ఎస్. సి. ఓ) ప్రచురణ" అని వుంది.

1946 వ సంవత్సరంలో ఐక్యరాజ్య సమితికి సంబంధించిన ప్రత్యేక శాఖగా ఏర్పరచబడిన ఐక్యరాజ్య విద్యాసాంఘిక సంస్కృతీ సమితి (దీనిని ప్రపంచ విజ్ఞాన సమితి అనికూడా అంటారు) నిర్ణయాలలో

యుద్ధం మూలంగా నాశనమైన దేశాలలో కిరియాలాంటి యువతీ యువకులకు, పిల్లలకు, ఉపాధ్యాయులకు సహాయం చేయడం ముఖ్యమైంది. ఆ చిన్నపుస్తకమే ప్రపంచ విజ్ఞానసమితి చేసిన మొదటి సహాయం. దానిలోని అక్షరాలు చాలా చిన్నవి. ఎందుకంటే కాగితం చాలా కొరతగా వుంది. ఇకముందు జరుగబోవు ఆ సమితి కార్యక్రమానికంతా అది ఒక చిహ్నంగా నిలుస్తుంది.

రాబోవు కాలంలో ఆ సంఘం ప్రపంచం అంతటి నుండి వివిధ ఉపాధ్యాయులను, శాస్త్రజ్ఞులను, రచయితలను, సంగీత విద్వాంసులను, మరి ఇతరులను పిలిపించి, వారి భావాలను ప్రపంచానికి తెల్పుతుంది. పారిస్ నగరంలో ఉన్న ప్రపంచ విజ్ఞాన సమితి ఆఫీసునుంచి జట్లులు వివిధ దేశాలకుపోయి, ప్రభుత్వాలతో కలిసి విద్యా వ్యాప్తికి, విజ్ఞాన వికాసానికి పనిచేస్తాయి.

ప్రపంచ విజ్ఞాన సమితి కార్యక్రమం పలువిధాలైనది. ఇకమీద ప్రపంచంలో న్యాయాన్ని, ధర్మాన్ని, ప్రజల ముఖ్యమైన హక్కులను, స్వేచ్ఛలను మన్నించడానికి, శాంతి భద్రతలను కాపాడడానికి, విద్య, విజ్ఞానం సంస్కృతిద్వారా వివిధ దేశాలమధ్య సామరస్య సహకార భావాలు పెంపొందించడానికి అది కృషిచేస్తుంది. ఐక్య రాజ్యాలలో చిరస్థాయిగా నిలచే ఆదర్శమును

"జాతి, వర్ణ, భాష, మత విభేదాలు లేవు" అని అది ఉద్ఘాటించింది.

చాలా విధాలైన పని. కాని, అవన్నీ ఏక లక్ష్య సాధనకే ఉద్దేశించ బడ్డవని, 18 మంది గల కార్య నిర్వాహక సంఘానికి, సభ్యులకు, సర్వకార్య నిర్వాహకు నికి వీరికందరికీ తెలుసు. ప్రపంచ విజ్ఞాన సమితి చేసే కార్యక్రమమంతా వివిధ దేశాల ప్రజలమధ్య సాన్ని హిత్య సాధనకని చెప్పవచ్చు.

ప్రపంచ విజ్ఞాన సమితిలో సభ్యులుగా ఉన్న దేశాల పౌరులు జాతీయ సంఘాల సమావేశాలద్వారా ఒకరి నొకరు కలుసుకుంటారు. అందువల్ల ఆత్మీయత పెంపొం దించుకుంటారు.

అమెరికా ప్రభుత్వం ఏర్పరచిన ఈ జాతీయ సంఘంలో 100 మంది సభ్యులున్నారు. ఆ దేశపు ఉన్నత పాఠశాల విద్యార్థుల తరఫునకూడా ఒక ప్రతి నిధి అందులో ఉన్నాడు. ఉపాధ్యాయులు, శాస్త్రజ్ఞులు, మరి ఇతర ప్రముఖులు దానిలో ఉన్నారు.

మొట్టమొదట ఈ సంఘ సర్వకార్య నిర్వాహకు డైన జూలియన్ హక్స్‌లీ అధ్యక్షతక్రింద కార్య నిర్వాహక సంఘం సమావేశమై తన ప్రణాళికలను మొదలు పెట్టింది. ఆహార సంఘం, ఆరోగ్య సంఘంవలె

దీనికికూడా ఒక అవసరమైన పని ఉన్నది. అది యుద్ధం మూలాన నాశనమైన దేశాలకు సహాయ పడడమే. యుద్ధంలో ధ్వంసమైన పాఠశాలలకు, కళాశాలలకు, పరిశోధనాలయాలకు, గ్రంథాలయాలకు, వస్తుప్రదర్శన శాలలకు సహాయపడడం ఆ సంఘం యొక్క ప్రథమ కర్తవ్యం.

అట్టి దేశాలలోని ప్రభుత్వాలుకూడా తాము చేయగలిగినంత పనిని అప్పుడే చేస్తున్నాయి. ఆ ప్రభుత్వాలతోపాటు ప్రజలు, ఇతర సంఘాలవారు పని చేస్తున్నారు. ఇతర దేశాలనుండి, సంఘాలనుండి సహాయంకూడా వస్తున్నది. కాని, ఆ సహాయం తగినంత పెద్ద సహాయం అనలేము. ఎక్కడకు వెళ్ళినా "మీకు ఇంకేం కావాలి? మాకు చెప్పండి," అని విజ్ఞాన సమితి ప్రచారకులు అడిగేవారు.

ప్రపంచంలోని ప్రజలకు సహాయానికి విజ్ఞాన సమితి చర్యలు తీసుకున్నది. వెంటనే వారు ఆస్ట్రియా, బెల్జియం, చైనా, బర్మా, చెకోస్లావేకియా—ఇంకా ఎన్నో దేశాలకు జట్టులను పంపుతారు. అచ్చట వారు విద్యా మంత్రులతోను, పాఠశాలల, కళాశాలల నిర్వాహకులతోను మాట్లాడి వారి అవసరాలను తెలిసికొంటారు. వారు తిరిగి వచ్చి తాము తెలిసికొన్న

సమాచారాలను ప్రపంచానికి వినిపిస్తారు. వారితో పాటు ఇతర జట్లు హంగరీ, ఇండియా, మాల్టా, సింగపూర్, ఉత్తర బోర్నియో, సారవాన్ వంటి ప్రదేశాలకు పోతాయి.

కాని, యుద్ధంలో దెబ్బతిన్న దూరదేశాలకు పోవడానికి ఆ జట్లులకు కొంతకాలం పట్టుతుంది. నేను కిరియాయొక్క పాఠశాలవలె ఎన్నో వేల పాఠశాలలు తగిన పరికరాలు లేక బాధపడుతున్నాయి. బోర్డులు, బల్లలు, కాగితాలు, సుద్దముక్కలు, పెన్సిళ్ళు మొదలైనవి పంపబడేవరకు వారికి ప్రోత్సాహం కలగదు. పాఠాలు చదువుకో వలసి వున్న తరగతులలో పుస్తకాలు లేనందువల్ల చుట్టుప్రక్కలనున్న ముసలివారిని పిలిచి తమ దేశ పారంపర్యాన్ని నిరూపించే కథలు చెప్పమనేవారు. అది చాలా మంచి ఉపాయమే కాని, చాలామంది ఉపాధ్యాయులకు అది తెలియదు. కిరియావంటి కొందరిని సహాయపడ వలసిందిగా నియమించారు. కాని, కొంతమందికి అలా తోచనే లేదు. బొగ్గుమసినుండి సిరా తయారుచేయడంవంటి పద్ధతులను వ్యాపింపజేయ వచ్చును.

ఉపాధ్యాయులంతా ఒకచోట చేరాలన్నారు. కాని, ప్రయాణం కష్టసాధ్యమైనప్పుడు వారెలా చేరగలరు?

కాబట్టి, ప్రపంచ విజ్ఞాన సమితి వారినంతా ఒక పుస్తకం ద్వారా చేర్చాలని అనుకుంది. దానిలోని పేజీలే వారు చేరేస్థలం. ఆ పుస్తకానికి కావలసిన విషయ సేకరణకై ఆ సంఘం ఒక ప్రతినిధిని పంపుతుంది. అతడు శీఘ్రంగా అన్ని చోట్లా తిరిగి ఉపాధ్యాయులను, బాలురను కలుసుకొని వస్తాడు.

కాలం తక్కువగా ఉండడంచేత, గ్రీసు దేశం యుద్ధంలో బాగా దెబ్బతినడంచేత గ్రీకు దేశాన్ని పరిశీలించాలని తీర్మానించారు. గ్రీసు దేశం ఆ పుస్తకాన్ని ముద్రించేందుకు సరిపోయే ధనాన్ని విరాళంగా ఇచ్చింది. ఆ సంఘ కార్య నిర్వాహక సభ్యుడైన లియోనార్డ్ ఎస్. కెన్‌వర్థీ అనే అమెరికను ఉపాధ్యాయుడు గ్రీసుకు పంపబడ్డాడు.

అంతర్జాతీయ విద్యా పునర్నిర్మాణంపైన అమెరికా సంయుక్త రాష్ట్రాలసంఘ నిర్వాహకుడుగా ఉన్న హెరాల్డ్ ఇ. స్నైడర్ అనే ఆయనతో కెన్‌వర్థీ ఏథెన్సుకు పోయాడు. అక్కడ గ్రీకు భాషను తర్జుమా చేసే ఒక దుబాసి ఆయనతో కలిశాడు. మూడు వారాలపాటు వారు గ్రీకు దేశపు పల్లెలను, పట్టణాలను, ఉపాధ్యాయులను, పిల్లలను పరిశీలించారు.

వారు వెళ్ళిన చోటంతా బాల బాలికలు పాఠశాల లకు వెళ్ళడంలో ఆతురత చూపడం చూచారు. ప్రతి యువతి క్రింద, యువకుని క్రింద వందలకొలది పిల్లలు చదువుకుంటున్నారు. వారంతా ధ్వంసం చేయబడిన వాటిని తిరిగి కట్టుతున్నారు. ఉపాధ్యాయులుకూడా చాలా శ్రద్ధగా పనిచేస్తున్నారు. వారు తమ పనినంతా వ్రాసిన పుస్తకాలను చూపించారు. ఆ ఉపాధ్యాయులు అడిగిన ప్రశ్నల నన్నిటినీ కెన్‌వర్దీ వ్రాసుకున్నాడు.

కెన్‌వర్దీ తిరిగివచ్చి పుస్తకం వ్రాయడానికి పూను కొన్నాడు. చాలా సంవత్సరాలు పాఠశాలల్లో పనిచేసిన వారు ఆయనకు సహాయపడ్డారు. ప్రతి విషయమూ పెద్దదే. బోర్డులు చేయడం, సుద్దముక్కలు చేయడం, సిరా తయారు చేయడం అన్నీ వారు విశదపరచారు.

తర్వాత ఉపాధ్యాయులు విద్యార్థులను గురించి అడిగిన ప్రశ్నలున్నాయి. పిల్లలను ఎలా మంచిస్థితికి తేవాలి? అన్న ప్రశ్నకు తగిన సమాధానాలు ఇచ్చారు. నగరాలను కొంతమట్టుకు పిల్లల్నే కట్టమన్నారు. వారంతా బాగా కలిసి పనిచేయగల రన్నారు.

పనివారికి కావలసిన అన్నివిధాలైన సహాయాలు చేసేందుకు ప్రతి పల్లెలోను, పట్టణంలోను కూడా యువజన సంఘాలను స్థాపించ మన్నారు. అందులో

చాలా మట్టుకు బాలబాలికలే మెంబర్లుగా ఉండాలి. వారిని అర్థంచేసుకోగల కొందరు పెద్దవారుకూడా సహాయంగా ఉండవచ్చును.

చాలా దేశాలవారు చదువగలరని ఆ పుస్తకాన్ని ఇంగ్లీషులో ప్రకటించారు. ఆ పుస్తకాలను అన్ని ప్రభుత్వాలకూ పంపించారు. అవి అన్ని విధాలైన పాఠశాలల్లోనూ పంచి పెట్టబడ్డాయి. దాన్ని అన్నిభాషల్లోకి తర్జుమా చేశారు.

దాన్ని చదివిన ప్రతి ఉపాధ్యాయుడూ ఇతరులు కూడా తన వలెనే ఉన్నారనీ, అందరికీ ప్రపంచవిజ్ఞాన సమితి సహాయం చేయడానికి నిలచిందనీ తెలిసికొన్నాడు. ఆ సలహాలు ఎంత చక్కగా ఉన్నాయి! వాటి ఉపయోగాన్ని గురించి చాలా సమాచారాలు ఆ సంఘం ఆఫీసుకు రాసాగాయి. ఆ పుస్తకం ఒకదేశం ప్రజలు మరొకదేశం ప్రజలను సద్భావంతో అర్థంచేసుకో గలరనే ఆదర్శాన్ని నిరూపించింది.

కిరియూయొక్క పంతులమ్మకు ఈ పుస్తకం చేరే సమయానికి ప్రపంచ విజ్ఞానసమితి జట్టులు ఆఫీసుకు తిరిగి రాసాగాయి. వారు యుద్ధంవల్ల పాఠశాలలకు కలిగిన దారుణ నష్టాన్ని చెప్పారు. దానితోపాటు వారుచూచిన

ప్రతి దేశంలోని ప్రజల చైతన్యాన్ని చూపించే సమాచారాలను కూడా తెచ్చారు.

బర్మా దేశపు విద్యా మంత్రివర్గం ఈ విజ్ఞాన సమితికి ఇలా వ్రాసింది :

"మీరు మాకు చేయగల మంచి సహాయం ఏమిటంటే మాకు మేమే సహాయం చేసుకొనేటట్లు చేయడం. మాకు ఒక సూక్ష్మదర్శిని యంత్రాన్ని బహుమతి చేశారు. అది రాకపూర్వం మాండలేలో మాకు ఒక్కటికూడా లేదు. కొన్ని సూక్ష్మదర్శినుల తోను, వైద్యంపనిముట్లతోను మేము వెనుక మూసివేసిన కొన్ని సహాయ కేంద్రాలను తెరువగలము. ఒకొక్క సూక్ష్మదర్శిని దగ్గర 40 మంది విద్యార్థులుదాకా గుంపుగా ఉంటారు. కాని, ఏమీ లేనిదానికన్నా అది ఎంతోనయం. బర్మా దేశంలోని అన్ని వంతెనలు కూలి పోయాయి. మా రోడ్లన్నీ గోతులతో నిండి ఉన్నాయి. దేశమంతా అంటువ్యాధులు ప్రాకిపోతున్నాయి. ఇట్టి పరిస్థితులలో మాకు ప్రతి సంవత్సరం ఎంతోమంది డాక్టర్లు, ఇంజనీర్లు తయారుకావాలి. బయటినుండి సహాయం కలిగితేకాని మేం పైకిరాలేము."

పడుచు వారు చేస్తున్న పని చాలా మేలైంది. యుగోస్లావియాలో యువజనసంఘ సభ్యులు రోడ్లు

నిర్మించడం, కాలువలు త్రవ్వడం ఇలాంటి పనులకు సహాయ పడుతున్నారు. మంచి నేర్పుగలవారి క్రింద పనిచేస్తూ వారు నేర్చుకో సాగారు. ఒకచోట రెండు బొగ్గుగనులను కలుపుతూ రైలుమార్గం వేయడానికి రెండు నెలలపాటు 62 వేల యుగోస్లావియా యువ జనులు స్వయం సేవకులుగా పనిచేశారు. వారే స్వయంగా వేసుకొన్న గుడిసెలలో నివసిస్తూ, స్వయంగా అన్నం తయారు చేసుకొని తింటూ పనిచేసి 22 వంతెనలు, 2100 టెలిఫోన్, టెలిగ్రాఫ్ స్తంభాలు నిర్మించి, ఆరునెలల్లో ఆ రైలు మార్గాన్ని పూర్తి చేశారు.

హంగరీ దేశంలో ఆ దేశపు యువజనులు జట్లులుగా పోయి పాఠశాలలకై పనిచేస్తూండేవారు. సాయం కాలాల్లోను, శని, ఆదివారాల్లోను పోయి అనుభవజ్ఞులైన తాపీ పనివారిక్రింద పనిచేస్తూ, వారు పాఠశాలలు నిర్మించేవారు. బుడాపెస్టులో 24 జట్లులు, హంగరీ పల్లె ప్రాంతాలలో 400 లకు పైగా జట్లులు ఉన్నాయి. ఆ సంఘాలలోని యువతులు స్త్రీలు వస్తువులు తయారు చేస్తూ 1000 సంచులు 4000 సిరాబుడ్లు తయారు చేశారు.

వివిధ సంఘాల నివేదికల ప్రకారం ప్రపంచ విజ్ఞాన సమితి రెండు పనులు చేయాలనుకుంది. అది వాటిని ప్రకటించ దలచింది. అందువల్ల అది ఏమి చేయాలను



కున్నదీ అందరూ తెలుసుకొంటారు. అంతేకాదు. ఎవరికి కావలసిన సమాచారాల నైనాసరే తెల్పడానికి ఒక సమాచార శాఖనుకూడా నెలకొల్పడానికి నిశ్చయించారు.

ప్రపంచ విజ్ఞానసమితి ప్రకటించిన రెండు పుస్తకాల్లోనూ జట్టులు పోయి చూచిన ప్రతి దేశానికి ఒక అధ్యాయం ప్రత్యేకించారు. వాటిలో ఆ యా దేశాలలోని పాఠశాలల, గ్రంథాలయాల, మరి ఇతర సంస్థల పరిస్థితులు ఎలా ఉన్నాయో విశదపరచారు. ప్రతిదానికి కావలసిన వస్తువుల జాబితానుకూడా చేర్చారు. వివిధ ప్రభుత్వాలద్వారా పంచిపెట్టబడిన ఆ రెండు పుస్తకాలు "మేముకూడా సహాయం చేసేందుకు ఏమి చేయాలి?" అనే ప్రజల ప్రశ్నకు జవాబు చెప్పాయి.

సమాచార శాఖను నిర్మించడం చాలా బాగా పనిచేసింది. 29 ప్రపంచ సంఘాలు దానితో కలిశాయి. మూడు సంవత్సరాలలోపల 60 దేశాలలోని 700 స్వచ్ఛంసేవక సంఘాలు సమితి కృషితో కలిసి ఇంకా సహాయం కావలసిన దేశాలలో విద్యాభివృద్ధికై పని చేశాయి. అవి 1,00,00,000 డాలర్లు ఇచ్చాయి.

ఈ ధనం ఎలా ఖర్చు చేయబడింది? యుద్ధంలో నాశనమైన పాఠశాలలు, కళాశాలలు, విశ్వ విద్యా

లయాలు, వైద్య పాఠశాలలు, పరిశోధనాలయాలు, గ్రంథాలయాలు మొదలైన వాటిని తిరిగి కట్టడానికి, వాటన్నిటికీ కావలసిన సామగ్రిని, పుస్తకాలను కొనడానికి ఆ ధనాన్ని వినియోగించారు.

కిరియాయొక్క పాఠశాలవంటివి యువజనుల పునరుద్ధరణకు ధన సహాయం చేయాలని వేడుకొన్నాయి. వారికి కావలసిన దానిలో కొంతైనా వారు సంపాదించుకో గలరు. 15,00,00,000 పెన్సిళ్లు, 7,46,70,000 నోటు పుస్తకాలు, కోట్లకొలది పుస్తకాలు కావలసి ఉన్నాయి. ఇవి ముఖ్యమైన అవసరాలు.

ప్రపంచంలోని పడుచు వారంతా పనిలో మునిగి పోయారు. చిన్నపిల్లలుకూడా చేరారు. తరగతి గదులలో విరాళాలకై డబ్బు పెట్టెలు మ్రోగాయి. స్కూళ్ళ సహాయార్థం ప్రదర్శనలు జరిగాయి. ఇవన్నీ ఎంత చురుకుగా జరిగినవో తెల్పుతూ వార్తా పత్రికలలోని వార్తలను కత్తిరించి ప్రపంచ విజ్ఞాన సమితి ఆఫీసుకు పంపేవారు.

అమెరికా సంయుక్త రాష్ట్రాలలో ఈ పనికై జాతీయ సంఘంగా అంతర్జాతీయ విద్యా పునరుద్ధరణ సంఘం స్థాపించారు. అది వాషింగ్టన్ నగరంలో ఉంది. దాని పెద్ద కెన్‌వర్దీతోకూడా గ్రీసు దేశానికి పోయిన హెరాల్డ్

ఇ. స్నైడర్ అనే ఆయన. ఈ జాతీయ సంఘం యుద్ధం వల్ల దెబ్బతిన్న దేశాలలో విద్యావ్యాప్తికై 21,40,00,000 డాలర్లను విరాళంగా ఇచ్చేందుకు 300 కు పైగా అమెరికన్ స్వయంసేవక సంఘాలను ప్రోత్సాహించింది.

అమెరికాలో ప్రపంచ విజ్ఞానసమితియొక్క జాతీయ సంఘం ప్రారంభించ బడగానే అది అంతర్జాతీయ విద్యా పునరుద్ధరణ సంఘంతో కలిసి భాగస్వాము లయ్యాయి. చాలామంది అమెరికను యువజనులు గ్రీకు దేశ బాలురకు అనేక బహుమతులను పంపించారు.

వారు చాలా పుస్తకాలు సేకరించారు. ఎందుకంటే ప్రపంచ విజ్ఞానసమితి గ్రంథాలయాలకు సహాయం కావాలి. వాటన్నిటిలో 40,00,000 పుస్తకాలను ఓడలపై ఇతర దేశాలకు పంపించారు. యువకులేమి, పిల్లలేమి దూర దేశాలలోని తమవంటివారి సహాయార్థం ఇవన్నీ చేశారు.

బాల రెడ్ క్రాస్ సంఘంవారు శీఘ్రంగా బహుమతి పెట్టెలను, పెన్సిళ్ళను, సుద్దముక్కలను, నోటుపుస్తకాలను, తదితర వస్తువులను, ప్రథమ చికిత్స పెట్టెలను పంపించారు. బహుమతి పెట్టెలతోపాటు ఉత్తరాలు నడిచాయి. వారి జాబులు, పాఠశాలల్లో జరిగిన ఆటలు,

నాటకాల విషయాలు అన్నీ చేర్చిన ఆల్‌బమ్‌లు పంపించారు. ఆ పంపే వారి జీవితం ఎలా ఉందో బొమ్మలద్వారా చిత్రించి పంపారు.

కొద్దికాలంలో తిరిగి వీరికి అదేవిధమైన ఆల్‌బమ్‌లు, ఉత్తరాలు వచ్చాయి.

పైన తెల్పిన రెండుసంఘాల భాగస్వామ్యంవల్ల అమెరికన్ విద్యార్థులు దూరదేశాలలోని విద్యార్థులకు సహాయం చేశారు. అమెరికా దేశంలోని ఇంటిపని నేర్చుకొనే తరగతిలోని వారు ఇతరదేశాలలోని అట్టి తరగతి వారికి వంటసామగ్రి, కుట్టుసామగ్రి పంపించారు. వ్యవసాయ తరగతుల వారు పారలు, కత్తులు, విత్తనాలు పంపించారు. ఇదే విధంగా ప్రతి తరగతివారు వారికి కావలసిన సామగ్రిని ఇతర దేశీయులకు పంపించారు. ఉత్తరాల మూలంగా స్నేహితులైన దూరదేశాలవారు దగ్గరివారైనారు.

పాఠశాలలు పాఠశాలలను నెలకొల్పాయి. కాలిఫోర్నియాలోని లాస్ ఏంజెల్స్ నగరంలో ఉన్న లూయిూ పాశ్చర్ జూనియర్ హైస్కూలు విద్యార్థులు దూరదేశంలో ఒక పాఠశాలను నెలకొల్పాలని నిర్ణయించుకొనగా, వారికి ప్రపంచ విజ్ఞానసమితి అధ్యక్షుడు తగిన ఏర్పాట్లు చేశాడు. ఐక్యరాజ్య సమితిలో ప్రతినిధి,

ఆస్ట్రియా మహిళా సంఘసభ్యురాలు అయిన మిస్ ఫ్లింట్ ద్వారా లూయీ పాశ్చర్ స్కూలు విద్యార్థులు వియన్నాలోని బుండెస్రియల్ వ్యాయామ పాఠశాలను గురించి విన్నారు. అచ్చట విద్యార్థులుకూడా వీరివలె పడుచువారే. వారు వీరి సలహాను గైకొందురా? ఆ రెండు పాఠశాలల పెద్దలు ఉత్తరాలు వ్రాసుకొని అంగీకరించారు. వెంటనే వస్తువులు పోసాగాయి. ఒక్కొక్క విద్యార్థికి ఒక్కొక్క విద్యార్థినుండి జాబులు వచ్చాయి. వారు స్నేహితులు. వారు తమకువచ్చిన ఉత్తరాలు తరగతులలో చదువుకొన్నారు.

ఆ రెండు పాఠశాలల్లోను సమాచార సంఘాలు ఉన్నాయి. విలేఖరులనుండి అప్పటికప్పుడే సమాచారాలు తెలుస్తాయి. ఆస్ట్రియాలోనున్న వియన్నాలోని గ్రంథాలయాలకు పుస్తకాలు కావాలని పాశ్చర్ పాఠశాలలో తెలిసింది. పాశ్చర్ పాఠశాల విద్యార్థులు ఆస్ట్రియా దేశపు పాటలు పాడి, నాట్యములను ప్రదర్శించారు. వంటపని నేర్చుకునే తరగతివారు ఆస్ట్రియా సామగ్రిని తయారు చేశారు. వెంటనే వాటన్నిటిని వియన్నాకు బహుమతిగా పంపించారు.

బుండెస్రియల్ వ్యాయామ పాఠశాల క్రొత్తగా ఒక సంఘాన్ని స్థాపించి దానికి "లూయీ పాశ్చర్ క్లబ్"

అని పేరు పెట్టారని విని పాశ్చర్ పాఠశాలవారు ఆనందించారు.

వియన్నా విద్యార్థులు ఒకనాటి మధ్యాహ్నంపూట చేరి లాస్ ఏంజెల్స్ స్నేహితులకు "ఇచ్చట విరామ కాలంలో ఆడుకునేవారు ఆడుకోవచ్చును. రంగులు వేసేవారు వేయవచ్చును. బహుమతులు తయారు చేసేవారు చేయవచ్చును. ఇంకొక గదిలో ఒక బాలిక ఐక్యరాజ్య సమితిని గురించి మాట్లాడుతూ తనకు వచ్చిన బొమ్మలను చూపుతుంది. మా సంఘ గ్రంథాలయం ఇంకా ప్రారంభ దశలోనే ఉన్నది. మీరు పంపే గ్రంథాలకు, పత్రికలకు మేము చాలా ఆతురతతో, ఆనందంతో కనిపెట్టుకొని ఉంటాము," అని వ్రాశారు. దానిలో ఇంకా ఇలావుంది :

"మా సంఘం అంతర్జాతీయ స్నేహసంఘంలాగ ఉంటుంది. ఇది ఆస్ట్రియాలో మొదటిది. మా నాయకులు ప్రపంచంలోని యువజనులనంతా కలుపవలెనని అనుకుంటారు. మీరు క్రొత్త స్నేహితులైనందుకు మీకు మా అభివందనాలు. మీ దేశంనుండి మా దేశానికి అతిథులు వచ్చారంటే ఈ స్నేహం ఇంకా ఎక్కువ కాగలదు."

వారి ఆహ్వానాన్ని పాశ్చర్ విద్యార్థులు అంగీకరించారు. వారు కోరిన పత్రికలను పంపించారు. పత్రికలకు

విరాళాలకై పాశ్చర్ పాఠశాల జరిపిన వియన్నా వార ప్రదర్శనలో తల్లిదండ్రులు, ఉపాధ్యాయులసంఘం సభ్యులు కూడా పాల్గొన్నారు. ఆస్ట్రియాలో ఉండే సకల వస్తు ప్రదర్శన జరిగింది. ఒకనాడు పెన్నీళ్లు సేకరించారు. 3,000 పెన్నీళ్ళకు పైగా వచ్చాయి. భోజనశాలల్లో విరాళాలకోసం డబ్బుపెట్టెలు నిండిపోవడంచేత వాటిని అప్పుడప్పుడు ఖాళీ చేయవలసివచ్చింది. 28 పెద్ద పెట్టెల నిండా గుడ్డలను, దుస్తులను, వస్తువులను పంపించారు.

ఇంజ్ బేయ్ డి అనే విద్యార్థిని వియన్నా వ్యాయామ కళాశాలవారు అభినందన సందేశాన్ని తెలుపుతూ ఉత్తరం వ్రాయమన్నారు. అత డిలా వ్రాశాడు :

"మీరు ఆస్ట్రియను స్నేహితుల పట్ల చూపించే సద్భావానికి మీకు నా అభినందనాలు. ఆస్ట్రియాను గురించిన చిత్రాలన్నీ మీవద్దనుంచి మాకు వచ్చినవి. మాయెడల మీకుగల నిజమైన స్నేహభావాన్ని అవి వ్యక్తపరుస్తున్నాయి. మాకు చాలా సంతోషం కలిగింది. మాకు మీరు పంపిన కానుకలలో నిజమైన సద్భావం, మైత్రి కనిపించాయి.

"మా అధ్యక్షునికి బదులుగా నేను ఆ పెట్టెలను తెరిపించాను. మాకు ఎంత ఆనందం కలిగిందో చెప్ప

లేము. మీరు ప్రేమతో వాటిని అంత జాగ్రత్తగా కట్టి పంపించారు. వాటిలోని ప్రతి వస్తువునూ చూచి మేము చాల సంతోషించాము."

పాశ్చర్ విద్యార్థులకు వియన్నానుండి క్రిస్‌మస్ బహుమతులు వచ్చాయి. వారు తమ పాటలు, బొమ్మలు, విగ్రహాలు మొదలైనవి పంపించారు. ఆస్ట్రియా దేశపు నాట్యం చూపించే 50 అడుగుల ఫిల్మునుకూడా పంపించారు.

లాస్ ఏంజెల్స్‌లోని రేడియో కేంద్రం వారు విద్యార్థులను గురించి ఒక నాటకాన్ని బ్రాడ్ కాస్ట్ చెయ్యాలనుకున్నప్పుడు ఈ రెండు స్కూళ్ళ విద్యార్థుల సంబంధాన్ని నాటకానికి ఇతివృత్తంగా తీసున్నారు. దాన్ని పాశ్చర్ విద్యార్థులు వ్రాసి, ఆస్ట్రియాకు పంపించారు.

ఆలీ, ఫతీమా అనేవారికి చదువుకొనే అవకాశం లేదు. ఎందుకంటే వారు తలిదండ్రులతోకూడా పారిపోయిన ఆ పాలస్తీనా ఎడారిలో పాఠశాలలు లేవు. వారు పాఠశాలకు వెళ్ళడానికి ఇష్టపడ్డారు. అందుచేత, వాళ్ళ అమ్మ ఒక పాఠశాలవుంటే బాగుండునని ప్రార్థించింది. వారికి పాలు పంపుతున్న ఐక్యరాజ్యాలలోని మిత్రులు వారికి పాఠశాలనుకూడా పంపుతారేమోనని వాళ్ళ అమ్మ ఆశపడింది.

ప్రపంచ విజ్ఞాన సమితిలోని స్నేహితులు ఆలీకి, ఫతీమాకు పాఠశాలనుకూడా తెచ్చారు. ఆ సమితి బీరూట్‌లో సమావేశమై పాఠశాలలు నెలకొల్పడానికి తీర్మానించింది. కొద్ది దినాలకే ఆలీ, ఫతీమాలకు పాఠశాల వచ్చింది. వారు ప్రతిదినం తెల్లవారగానే పాఠశాలకు పరుగెత్తేవారు.

కొంతకాలం వరకు ఆ పాఠశాలలో పిల్లలు, ఒక ఉపాధ్యాయుడు తప్ప ఇంకేమీ లేదు. కాని, ప్రతి పాఠము వారికో ఘనకార్యంలా ఉండేది. ఇసుకలో పుల్లతో లెక్కలు చేయడం వారికి ఒక ఆట. అందరూ కలసి పద్యాలు చెప్పడం, వారి ఉపాధ్యాయుడు కొరాను కథలు చెప్పడం చాలా చక్కగా ఉండేవి.

పలురాజ్యాల భాగస్వామ్యంతో ప్రపంచ విజ్ఞాన సమితి కృషిమూలంగా పాలస్తీనాలో ప్రారంభించబడిన పాఠశాలల్లో మార్జొలియస్‌లోని ఆలీ, ఫతీమాల పాఠశాల మొదటిది. వెంటనే వివిధ ప్రాంతాలలోని 11,000 మందికి 31 పాఠశాలలు స్థాపించారు. ఉపాధ్యాయులకై కష్టపడ నక్కరలేక పోయింది. శరణార్థులలోని వృద్ధులు అందుకు పూనుకొన్నారు. పిల్లలు గుంపులు గుంపులుగా వచ్చారు. న్యూశరాత్ కేంద్రంలో బి. సి. జి. సూదిమందు వేయగానే పంతులమ్మ బాలికలను ఇంటికి పొమ్మనగా, "లేదు. మాకు చాలా శెలవు

దినాలు ఇదివరకే ఇచ్చారు. ఇప్పుడు మేము పోము" అన్నారు.

పలు ప్రాంతాలలో పాఠశాలలు నెలకొల్పబడ్డాయి. వీలైన సమయాలలో విద్యార్థులకు చేతిపనులు, వ్యవసాయం నేర్పబడ్డాయి. కావలసిన సామగ్రి వచ్చిన వెంటనే అవి ఉపయోగించబడేవి.

తమకు జరిగిన సహాయం, తమ బాలుర అభివృద్ధి వీటినిగురించి పాలస్తీనాలోని ఉపాధ్యాయులు, ప్రజలు ప్రపంచ విజ్ఞాన సమితివారికి ఉత్తరాలు వ్రాశారు. సమితి ప్రచారకు డొకడు ఒక పాఠశాల పెద్దను ఏమేమి కావాలో అడుగగా అతను తనక్రింది 32 మంది ఉపాధ్యాయులు తయారుచేసిన జాబితా ఇస్తూ బడిగంట కూడా కావాలి అన్నాడు.

అందుకే, ప్రపంచ విజ్ఞాన సమితి పాలస్తీనాలోని పాఠశాలల సహాయార్థం విరాళాలు పంపాలంటూ ఒక విజ్ఞాపనచేస్తూ చిన్న పుస్తకాన్ని ప్రకటించినప్పుడు దానికి "ఎడారిలో బడిగంట" అని పేరు పెట్టింది.

# అన్యోన్యజీవన, విద్యాభ్యాసాలు

**1945** వ సంవత్సరం ఒక క్రిస్మస్ దినమున డాన్ గ్విడో విసెన్‌డాన్ అనే ఒక క్రైస్తవ మత గురువు ఇటలీ దేశంలోని లాన్సియానో అనే చిన్న గ్రామానికి వచ్చాడు. యుద్ధంవల్ల నిలవనీడ లేక అల్లర చిల్లరగా తిరుగుతున్న కొందరు బాలురు దోపిడీలు చేస్తున్నారనే కారణంతో ఉద్యోగులు వారిని బంధించారు. ఆ మతగురువు వారికి సహాయం చేయడానికి వచ్చినట్లు చెప్పిన తర్వాత ఉద్యోగులు ఒక సైనిక భవనంలో సగంకూలిన గుర్రపుశాల బీగం ఇచ్చారు.

అతడు తలుపు తెరువగానే చింకి చొక్కాలతో రాతినేలపై పండుకొని, చలికి వణుకుతుండిన బాలురంతా అతడిని పరిహాసం చేశారు. ప్రశాంతంగా ఆ మతగురువు వారితో నివసించడానికి తీర్మానించాడు. మొదట అతను వారికి అన్నము, దుస్తులు తెచ్చినా కూడా వారు ఎగతాళి చేసేవారు. అతడు గుర్రపుశాలను కడుగుతుంటే వారు కదిలేవారు కాదు. కాని, అతడు చెడిపోయిన గోడలను బాగుచేస్తుంటే కొంత మంది సహాయపడ్డారు. మంచి రంగును తెచ్చిన రోజున అందరూ ఆశ్చర్యపడ్డారు. వారే గోడపై తమాషాగా

పువ్వులు చిత్రించారు. వారి గుర్రపుశాలను చూచి వారే ఇప్పుడు గర్వించారు.

ఆపల్లె ప్రాంతంలోని ఇల్లులేని పిల్లలకంతా ఇక్కడ జరిగేది తెలిసింది. 80 మంది పిల్లలు వచ్చారు. అందు చేత, మొత్తం భవనాన్ని ఆ మతగురువు తీసుకున్నాడు. ఆ కొత్తవారివల్ల ఒక ఉపద్రవం కలిగింది. కొంతమంది రాత్రిలో చుట్టుప్రక్కల ఇండ్లలో దొంగతనాలకు పోయే వారు. నిజంగా వారు అందరికీ ఆహారం సంపాదించాలని అనుకున్నారు. కాని, అది దొంగతనం కావడంచేత ఆ ఊరి ప్రజలు ఫిర్యాదు చేశారు.

బాలురనంతా పిలిచి ఆ మతగురువు "మీకు కావలసిన ఆహారం, దుస్తులు తీలుకురావడానికి నేను ఎక్కడికో వెళ్ళాలి. అందుచేత, ఇక్కడ మీ పనులను మీరే చక్కబెట్టుకోవాలి," అన్నాడు. ఆ బాలురు ఒక నియమావళిని తయారుచేసి, తమ న్యాయస్థానాన్ని స్థాపించి, ఒక అధిపతిని ఎన్నుకున్నారు. ఆ తరువాత దొంగతనాలే లేవు!

100 మందికిపైగా బాలురను చూచుకోవలసి వుండడంచేత వసతులు సరిపోలేదు. వారికి సరిపోవు ఆహారం సంపాదించడానికి ఆ మతగురువు చాలా అగచాట్లు పడేవాడు. వెంటనే అతడు పాఠశాల ఉపాధ్యాయులకు ప్రయత్నించాడు. ఇటలీ దేశపు స్నేహితులు,

డాన్ స్విస్సీవంటి వివిధ సంఘాలవారు సహాయ పడ్డారు. కాని, వారికి చాలా ఎక్కువ సహాయం కావలసివుంది. ఆ మతగురువు, 15 సంవత్సరాల బాల నాయకుడు పోయి స్విడ్జరెండులో తమ పరిస్థితులను చెప్పుకొని, విరాళాలను ప్రోగుచేసుకొంటే మంచిదని డాన్ స్విస్సీసంఘంవారు చెప్పారు.

ఆ విషయాన్ని గ్విడో బాలుర కందరికీ చెప్పగా వారు వెంటనే తమ నాయకుని బదులు ఒక ప్రచారకుణ్ణి ఎన్నుకున్నారు. కాని, ఆ బాలుడు "నేను చాలా పొరపాట్లు చేస్తాను. వద్దు" అన్నాడు. కాని వారు "నీవు పొరపాట్లుచేసినా ఫరవాలేదు. నువ్వే వెళ్ళాలి" అన్నారు. వెంటనే వారిద్దరూ స్విడ్జరెండుకు పోయారు.

వారు అచ్చటచేసిన కృషిఫలితంగా స్విడ్జరెండు పాఠశాలలు ఈ భవనాన్ని తమ అధీనంక్రిందకు తీసు కొన్నాయి. అచ్చటి యువతీ యువకులు నిధిని, ఆహారాన్ని, వస్త్రాలను సేకరించారు. ఆ సహాయంతోను, ఇటలీ ప్రభుత్వంయొక్క సహాయంతోను, స్వయం సేవక సంఘాల సహాయంతోను ఆ మతగురువుకు, అతని బాలురకు తీరిక కలిగింది. నెబ్రస్కాలోని ఒక పెద్ద మనిషి 1000 డాలర్ల చెక్కుపంపగా గ్విడో దానితో తగిన పరికరాలను కొని, కొయ్యపని, కుట్టుపని, చెప్పుల పని నేర్పించే వీలు కలిగించేందుకు ఉపయోగించాడు.

వారు కుట్టుపని నేర్చుకొని, అమెరికా సైన్యపు గుడారాల గుడ్డల తునకలతో దుస్తుల తయారుచేశారు.

1948 వ సంవత్సరం మార్చి నెలలో ఆ బాలురు ఒక చెడ్డవార్త విన్నారు. ఆ భవనం మరొకపనికి కావాలని, దాన్ని వారు వెంటనే ఖాళీచేయాలని వార్తవచ్చింది. వారి కష్టాన్ని గుర్తించి ఇటలీప్రభుత్వం సిల్విేవెరినా అనే కొండలకు దగ్గరగా ఉన్న కొంత నేలను ఇచ్చింది. అక్కడ ఒకకొత్త ఇల్లు కట్టాలని, దానికి "బాల పట్టణము" అని పేరుపెట్టాలని నిర్ణయించారు.

ఆ కొత్త బాలపట్టణాన్ని కట్టడానికి చాలా మంది స్నేహితులు పాల్గొన్నారు. డాన్స్విస్సీ సంఘం 5 చిన్న ఇళ్ళకు తగిన సామగ్రి పంపింది. ప్రపంచ శిశు సంక్షేమనిధివారు, ఇటలీ ప్రభుత్వంయొక్క భాగ స్వామ్యంతో ఇళ్ళు కట్టడానికి సామగ్రినంతా పంపించారు. బాలురు చాలా కష్టపడి పనిచేశారు. వారి పట్టణం రూపానికి వస్తూంది. ఆ కట్టడాలు పూర్తి కావడానికి ముందు ఒకపెద్ద కూరగాయల తోటను పెంచారు. మొదట ఆ పట్టణంలో దీపాలు లేకపోయినా, నీరు చాలా దూరంనుండి తెచ్చుకోవలసి ఉండినా, వారంతా ఒక్కటిగా దానిలోనే వున్నారు. ఆనందంగా ఏక కుటుంబంలాగ వున్నారు.

ఐరోపాలో, బర్మాలో, ఇండియాలో, మలయాలో చాలామంది దయామయులైన స్త్రీ పురుషులు యుద్ధం మూలంగా ఇండ్లులేకుండా పోయిన బాల బాలికలను కనిపెట్ట సాగారు. వారందరికీ తగిన వసతులు, ఆహారం, మందులు మున్నగునవి ఇవ్వబడ్డాయి.

అట్టి యువజనవాడలు మనకు క్రొత్తకాదు. 50 సంవత్సరాల పూర్వం న్యూయార్కు నగరంలో ఫ్రీవిల్లీ అనేచోట, విలియమ్ ఆర్. జార్జ్ అనే అమెరికను ప్రముఖుడు జార్జి జూనియర్ రిపబ్లికను స్థాపించాడు. అదేవిధంగా చాలామంది పనిచేశారు. అట్టి చోట్లలో పెరిగి పెద్దయైన వారంతా ఆ సంఘాలకు కృతజ్ఞత చూపుతూంటారు.

ఇప్పుడుకూడా క్రొత్త నాయకులు అట్టి ఘన కార్యాలనే చెయ్యాలని శ్రమపడుతున్నారు. పేటర్ జెట్లేహ్లో అనే ఆయన బుడాపెస్టులో తల్లిదండ్రులు కన్పించని బాలబాలికలకు ఒక ఇల్లు కట్టాలని పాటు బడ్డాడు. ఇంకా ఇలాంటివారు ఎందరో దిక్కులేని వారికై కృషిచేశారు.

ఉపాధ్యాయులవలె ప్రపంచ విజ్ఞానసమితి అందరూ ఒకటిగా చేరేందుకు, తమ తమ అనుభవాలను, పరిస్థితులను పంచుకునేందుకు సహాయ పడింది. 1948 వ సంవత్సర ప్రారంభంలో బాల నాయకుల సమావేశాన్ని

స్విట్జర్లెండ్ దేశంలోని పెస్టలొజ్జి అనే గ్రామంలో జరిపేందుకు ఆహ్వానాలు చేరాయి.

కొత్త యువకసంఘాలలో ఒకరైన పెస్టలొజ్జి గ్రామసంఘం ఐరోపాకు ఆదర్శప్రాయమైనది. యూరప్ లోని అన్ని దేశాలవారు అక్కడున్నారు. ఒక్కొక్క దేశంవారు ఒక్కొక్క ఇంట్లో నివసిస్తారు. అటువంటి అంతర్జాతీయ గ్రామాన్ని స్థాపించాలనే సూచనను ఒక జ్యూరిక్ పత్రికా సంపాదకుడు సూచించాడు. దాన్ని స్విస్ యువజనసంఘం గ్రహించి, 1946 నాటికి కావలసిన ధనం సేకరించి, అందమైన ట్రోజన్ ప్రాంతంలో దాన్ని నిర్మించ దలచారు.

ట్రోజన్ గ్రామస్థులు నూతన గ్రామాన్ని నిర్మించాలనే వార్త వినగానే 10 ఎకరాల ఉమ్మడి భూమిని, దానిలోని ఇంటిని ఇచ్చేశారు. చుట్టు ప్రక్కల రైతులు ఒక రోడ్డునుకట్టి నీటివసతి, మురికినీటి కాలువలు నిర్మించారు. వందలాది స్వయం సేవకులు, యువకులు ఇండ్లు కట్టేందుకు పనిచేశారు. 60 మంది పడుచువారు ఒక పెద్ద చెట్టును నరికి 7 మైళ్ళ దూరంలో ఉన్న ట్రోజన్ కోతమిల్లు దగ్గరికి తీసుకుపోయారు. స్విట్జర్లెండులోని బాల బాలికలందరూ పనిచేశారు.

1946వ సంవత్సరం వేసవిలోకి 12 మంది వివిధ దేశాల అనాథ బాల బాలికలు వారి వారి ఇంటిలో ప్రవేశిం

చారు. ధనంతోపాటు పాలస్తీనానుండి నారింజపండ్లు, ఆస్ట్రేలియానుండి తేనె, పోలెండునుండి 20 టన్నుల బొగ్గు వచ్చాయి. తల్లి దండ్రులు బిడ్డలకై పనిచేశారు. పిల్లలు విత్తనాలను సమకూర్చారు. వాటిని పెస్టలొజ్జి బాలురు తమ కూరగాయల తోటలో నాటినారు.

ఆ అనాథ బాల బాలికలు తమ తమ ఇండ్లలో మాతృభాషను మాట్లాడు కొనేవారు. కాని, అవి వారి అన్యోన్యతను అరికట్టలేదు. వారి గుర్తులు, మాటలు చూచి పోషకులు చాలామార్లు నవ్వుకునేవారు. వారు రకరకాల పాటలు, ఆటలు నేర్చుకున్నారు.

బాధ్యత వహించిన ఆ బాల బాలికలు ఎక్కడి బాలుడో బాలికో వచ్చినా సరే వారికి వేరే భావం కలుగకుండా ఉండాలనుకున్నారు. చిన్నవారికి కూడా అదేభావం! ఒకనాడు 12 ఏండ్ల జర్మను బాలుడు బ్రెమెన్ నుండి నడచిరాగా జర్మనులచేత హింసింపబడిన పోలిష్ బాలురే అతనిని తమ ఆటలోకి చేర్చుకొన్నారు.

అందరు వచ్చే ఆ గ్రామ పాఠశాలలో పనిచేయుడానికి అనుభవజ్ఞులైన ఉపాధ్యాయులు వచ్చారు. చిన్న పిల్లలకు వారి సొంత భాషలోనే బోధించారు. 12 ఏండ్లు పైబడ్డ వారికి జర్మను భాషను ఉపయోగించారు. విజ్ఞానంతోపాటు చేతిపనులనుకూడా బోధించారు.

ట్రోజన్‌లో జరిగే సమావేశానికి రమ్మని ప్రపంచ విజ్ఞాన సమితి పంపిన ఆహ్వానాలను 6 దేశాల్లోని 14 మంది యువక నాయకులు అంగీకరించారు. వారితో పాటు 11 మంది అనుభవజ్ఞులైన ఉపాధ్యాయులుకూడా చేరారు. వారితో అమెరికా ప్రతినిధి—కొత్త విద్యా విధానానికి అంతర్జాతీయ అధ్యక్షుడైన—డాక్టర్ కార్లెటన్ వాష్‌బర్న్ అనే ఆయన, ప్రపంచ విజ్ఞాన సమితిలో సభ్యత్వంగల 11 దేశాల వారు ఈ సమావేశం కార్యక్రమంలో పాల్గొన్నాయి.

మొదటి సమావేశంనుంచి కూడా వారి యోచనలు యుద్ధంవల్ల ఇల్లులేకుండా పోయినవారిని గురించే గాక యువజన సంఘ కార్యక్రమం అమలు జరుపబడగల అన్ని దేశాలను గురించీ జరిగాయి. వారు ఈనాటి పడుచువారిని గురించే గాక భావి యువకులను గురించి కూడా మాట్లాడారు.

"ఇల్లులేని పిల్లలు" అనే ప్రపంచ విజ్ఞాన సమితివారి పుస్తకం ఈ సమావేశ సారాంశం తెలుపుతుంది. కష్టపడే నాయకులకు అది పంపబడడంచేత వారికి తగు సలహాలు, సహాయం లభించాయి. దానివల్లకూడా కొత్త యువజన సంఘాలు స్థాపించబడ్డాయి.

**పిల్లల సంఘాలు :** "క్రమబద్ధమైన జీవితము లేక యుద్ధానికి ఆహుతి అయిన నిర్భాగ్యులు" అనే మరొక

పుస్తకం పెస్టలొజ్జి గ్రామంలోని, ప్రజాయొక్క బాలుర పట్టణంలోని యువజన సంఘాలు, మరి ఇతరమైనవి కలిసి 69 సంఘాలకు ఈ పుస్తకం సలహాలు ఇస్తూ, వారికి కావలసిన సమాచారాలను తెలిపింది. దీనిని చదివిన ఉదార స్వభావులగు ప్రజలు ఆ యా సంఘాలకు సహాయ పడ్డారు. ప్రజాసేవకై వాటికి ధనం లభించింది.

అన్నిటికన్నా ముఖ్యమైనది ఏమంటే, ఆ సమావేశంలో పిల్లలు సంఘాలయొక్క అంతర్జాతీయ ఐక్య సంఘం స్థాపించబడింది. దీనివల్ల ఈనాడు ప్రపంచంలోని యువ నాయకులకంతా సహాయం లభిస్తూంది. ప్రతి సంవత్సరమూ యువజన సంఘాలు స్థాపించాలని ఉత్తరాలు వస్తాయి. వాటికి నిర్మాణాత్మకమైన సలహాలతో జవాబులిస్తారు. ట్రోజన్‌లో పిల్లల రక్షణ విధానంలో 6 నెలల శిక్షణ ఇస్తారు. ఆ శిక్షణ పొందగోరిన చాలా మంది స్త్రీ పురుషులకు ప్రపంచ విజ్ఞాన సమితి సహాయం చేస్తుంది.

హెన్రీ జూలియన్ అనే ఆయన ప్రపంచ విజ్ఞాన సమితి సమావేశానికి పోతున్నప్పుడు పిల్లలంతా వచ్చి "మాకు కూడా ఎందుకు అంతర్జాతీయ సమావేశాలు ఉండకూడదు? మేము ఇక్కడ ఒక గుడారం నిర్మించి ఆ సమావేశాన్ని ఏర్పాటు చేస్తాం," అన్నారు.

ఆయన ఆ విషయం సమావేశంలో చెప్పగా అందరూ దానికి ఆనందించి, వేసవిలో దాన్ని అచ్చట ఏర్పాటు చేస్తా మన్నారు. ఆ బాలబాలికలు మిక్కిలి శ్రమపడి ఆహ్వానాలను చాలా ఆకర్షణీయంగా తయారుచేశారు. వారు దాన్ని తమ ముద్రణాయంత్రంలోనే ముద్రించి, అందరూ ఒకచోట కూడినప్పుడు కలిగే తమాషాను చూపుతూ చిత్రాలను చిత్రించారు. వివిధ దేశాలలోని 50 మంది పడుచువారు ఆహ్వానాలను అంగీకరించారు. వారి ప్రయాణ సౌకర్యాలను ప్రపంచ విజ్ఞాన సమితి చేసింది.

ఆ బాలురు అనుకున్నట్లు అది అంతా తమాషాగానే వుంది. పగలంతా ఆటలు, పాటలు, నాటకాలు, కుస్తీలు, సాయంకాలం మంటల చుట్టూ మాట్లాడుతూ ఆనందించడం. వారు వివిధ భాషలు మాట్లాడినా కష్ట మని తోచలేదు. వారంతా సర్దుకున్నారు.

ఒక రాత్రి మంట దగ్గర ఒకడు "మనం అంతర్జాతీయ సంఘాన్ని పెట్టుకుందాం. మన మంతా ఒకరి కొకరు జాబులు వ్రాసుకొంటూ ఉండవచ్చును" అని అన్నాడు.

అందరూ ఉత్సాహంగా సరే అన్నారు. పెస్టలాజ్జి గ్రామంవారు అమెరికా సంయుక్త రాష్ట్రాలలో న్యూయార్కు దగ్గర డాబెస్ ఫెర్రీ అనే గ్రామంలోని పిల్లల నగరాధిపతి తమ పట్టణానికి వచ్చినట్లు చెప్పారు.

డాబెస్ ఫెర్రీ గ్రామం వారు "క్రిస్‌మస్ ట్రీ" అలంకరణ వస్తువుల పంపినప్పటినుండి ఉభయుల స్నేహం ప్రారంభమైంది. అప్పటినుండి ఉత్తరాలు వస్తూ పోతూ ఉన్నాయి. ప్రపంచ విజ్ఞాన సమితి ప్రణాళిక ప్రకారం మేయర్ షిన్నర్ఢ్ అమెరికాను వదలి ఇటలీ, ఫ్రాన్సు, జర్మనీలను, మరి ఇతర దేశాలను, పెస్టలొజ్జి గ్రామాన్ని చూడడానికి బయల్దేరాడు.

మేయర్ ఫిన్నర్ఢ్ తమతో ఉండడం చాలా ఆనందంగా ఉండిందని పెస్టలొజ్జి వారు చెప్పారు. అంతర్జాతీయ సంఘానికి అందరూ కలిసి కృషిచేస్తామని తీర్మానించారు. వారు ఆ విషయాన్ని విజ్ఞాన సమితిలోని స్నేహితులకు చెప్పగా వారు సహాయం చేస్తామని హామీ ఇచ్చారు.

అన్ని దేశాలవారు అట్టి పనులు చేశారు. అంతా ఒకటిగా చేరి ఆటలు, పాటలు, నాటకాలతో కాలం గడిపారు.

వారు తమ తమ గుడారాల్లోకి పోయి వారు చేసిందంతా ఇంటికి ఉత్తరాల ద్వారా తెలియజేశారు.

ఈ సమావేశాలు ఎలా ఏర్పడ్డాయి ? ఇదంతా స్విస్ ఇంజనీయరైన ప్రయరీ సెరెసోల్ అనే ఆయన కృషి. ఆయన 1919 లో వివిధ దేశాలలోని యువజనులు వేసవి కాలంలో ఇలా సమావేశాలు జరిపి

ఒకటిగా ఉండవచ్చునని చెప్పాడు. అతను విరోధులైన వివిధ దేశాల పడుచువారు కలిసి మెలిసి భేదబుద్ధి లేకుండా పనిచేస్తే శాంతి స్థాపనకు దారి తీస్తుందన్నాడు. ఇతరుల కొరకు పనిచేస్తూ జీవించువారి యొక్క ఆనందం, స్వేచ్ఛ, సహకారం అద్భుతమైనదనీ, ఒక చోట కూడడంవల్ల అందరినీ అలా చేస్తుందనీ ఆయన చెప్పాడు. అతను తన కార్యక్రమానికి "అంతర్జాతీయ ప్రజాసేవ" అని పేరు పెట్టాడు. చాల మంది యువకులు వెంటనే చేరారు. అతను 1920 వ సంవత్సరంలో జరిపిన మొదటి అంతర్జాతీయ కార్యక్రమ సమావేశంలో ఫ్రెంచి, జర్మను దేశాల యువకులను వెర్డన్ దగ్గర రైతుల ఇండ్లు కట్టడానికి సహాయం చేయమని ఉత్సాహ పరచాడు. 1928 వ సంవత్సరంలో రైను నది వరదలు లిజ్‌టెన్‌స్టియన్‌పై పొర్లినప్పుడు 22 దేశాలనుండి 700 మందికి పైగా పడుచువారు సహాయం చెయ్యడానికి వచ్చారు. "వారానికి 48 గంటలు పని చేయాలి. పని చాలా కష్టమైంది. స్వయం సేవకులు గుడారాల్లోను, ఖాళీ ఇండ్లలోను ఉండాలి. వానలో పనిచేయాలి," అన్న హెచ్చరికకు కూడా వారు జంకలేదు.

కొన్ని సంవత్సరాల లోపల చాలా దేశాలనుండి సంఘాలన్నీ అంతర్జాతీయ స్వయంసేవక కార్యక్రమంలో పాల్గొనడానికి పోయాయి. ఒక్కొక్క సంవత్సరానికీ

సంఖ్య ఎక్కువ కాసాగింది. చాలా విధాలైన సంఘాలన్నీ చేరాయి. కొన్ని దేశాలలో రెండవ ప్రపంచ యుద్ధం మూలంగా అట్టి సంఘాలకు ఆటంకం కలిగినా కొన్ని దేశాలలో అలానే పనిచేశాయి. 1949 వ సంవత్సరానికంతా లాప్‌లెండునుంచి క్రీట్‌వరకూ, జమైకా నుండి జపాన్ వరకు 950 అంతర్జాతీయ సంఘాలు నెలకొల్ప బడ్డాయి. అన్ని ఖండాలలోను, దేశాలలోను ప్రపంచ విజ్ఞాన సమితి ప్రతినిధులే చాలా సంఘాలను ఏర్పరచినారు.

అవి చేసే ప్రతి పనీ ఆయా దేశాల ప్రభుత్వాల యొక్క, లేక జాతీయ సంఘాలయొక్క సలహా మీదే చేయబడుతుంది. ఆ కష్టమైన పనంతా చేసేందుకై ఉన్నవారంతా 20 ఏండ్లలోపల వారే. ఒక్క వేసవిలోనే 50 వేల మంది యువకులకు పైగా రోడ్డులు నిర్మిస్తూ, రిపేరు చేస్తూ, వరదలను ఆపడానికి ప్రయత్నిస్తూ, అడవుల నిర్మిస్తూ, విద్యాసేవ, సంఘసేవ, ఆరోగ్యసేవ చేస్తూ, పాఠశాలలు, కళాశాలలు, వైద్యశాలలు, ప్రార్థన మందిరాలు, ఆటస్థలాలు యువజన కేంద్రాలు, యువజన నివాసస్థానాలు నిర్మిస్తూ పని చేశారు.

ఈనాడు హాలెండ్ దేశంలో ఒక ముఖ్యమైన గోడ గట్టిగా ఉంది. ఎందుకంటే ఇంగ్లాడ్, ఫ్రాన్స్, ఫిన్లాండ్

దేశాల సంఘాలవారు దాన్ని రిపేరు చేసినారు. ఆస్ట్రి యాలో 8 దేశాలనుండి వచ్చిన 25 మంది నిర్మించిన కేంద్రంలో ఉపాధ్యాయులు ప్రత్యేక శిక్షణను పొందు తారు. యూగోస్లావియాలో 5000 మంది సంఘ సభ్యులు ఆ దేశ యువజన సంఘంవారితో కలిసి రైలు రోడ్డును నిర్మించడం వల్ల ఈనాడు జనులు హాయిగా సామెక్ నుండి సరాజివోకు ప్రయాణం చేస్తున్నారు. ప్రతి దినమూ పని అయిన తర్వాత 20 వేలమంది సంఘ సభ్యులకు ఒక గంటకాలం చదువను, వ్రాయను నేర్పేవారు.

కష్టమైన దినములలో పనిచేసే సంఘాలలో ఉండడం వల్ల లాభం కలుగుతుంది.

లేటా క్రామ్‌వెల్ అనే ఆమె ఇలా వ్రాసింది :

"కేంప్ సమయాలలో అన్ని రాత్రులూ ఒకటే విధంగా ఉంటాయని నేను అంటాను. ఆ రాత్రులన్నీ కీటకాలతో చేసే యుద్ధాలే. చల్ది అన్నం చురుకును కలిగించదు. టీ నిస్సారంగా ఉంటుంది. లఘుభోజనానికి కూరగాయల పులుసు, ఉర్లగడ్డ మాత్రమే. భోజనానికి వివిధ ఫలహారాలు. నిజంగా మేం పల్లెవారు తినే తిండి తిన్నాం.

"మేము సహాయం చేసిన కుటుంబాలలో ఉదా హరణకు ఒకదానిలో ఒక పురుషుడు, అతని భార్య,

12 ఏండ్ల లోపలి వయసులో 5 మంది పిల్లలు ఉండి నారు. అతను తన కుటుంబంతో పాటు రెండుమార్లు ఇంటినుండి వెళ్ళగొట్టబడ్డాడు. క్రొత్తగా కట్టిన స్నానం గదిలో అతని కుటుంబం ఇప్పుడు నివసిస్తోంది. ఒక మొరిగే కుక్క, ఒక చిక్కిన పంది అతనికుండే ఆస్తి. అయినా అందరివలె అతను కూడా నిరాశతో వెనకకు చూడక ఆశతో ముందుకు చూస్తున్నాడు. అతను మాకు కాఫీ అందిస్తూ క్రొత్త సదుపాయాలు పూర్తి కాగానే నేను పోస్టుమాస్టరుని కాగలను అని నవ్వుతూ అన్నాడు. ఎడారిలో, అడవులలో ఒక చిన్న మనిషి పెద్ద బూట్సులను వేసుకొని తన యింటికి పునాదులను వేస్తున్నాడు.

"ఆ సంకట పరిస్థితికి, గంటలకొద్ది పనికి కలిగిన బహుమతులలో ఆ పల్లెప్రజల స్నేహభావం ఒకటి. స్వయం సేవక కార్యం వారికి చైతన్యం కలిగిస్తుంది. నేను పోయిన ప్రతి కార్యనిర్వాహక సంఘంలోనూ అదే చూచాను. తిరిగి తిరిగి పనిచేసే ఒక ఇంజనీయరు తన రెండువారాల సెలవును ఒక ఆటస్థలాన్ని సరిచేయడంలో గడుపుతాడు. యువకుడగు ఒక ఉపాధ్యాయుడు గులక నంతా తీసివేసి ఒక ఆస్పత్రిని తిరిగీ నడుపడానికి పని చేస్తాడు. విశ్వవిద్యాలయ విద్యార్థులు తమ శలవులను ఒక పాఠశాలను కట్టుటకై ఉపయోగిస్తారు. సంఘం

పనివారు జీతం తీసుకోకుండా పనిచేస్తారు. స్వయంసేవక సంఘాలవారు తమ ఖర్చును తామే భరించుకుంటారు.

"అంతా అదే వింగానే! ఒక ప్రాంతీయ కొయ్య పనివాడు 'నేను అమెరికాకువచ్చి మీకు సహాయం చేస్తాను' అంటాడు.

"ఒక కార్య నిర్వాహక సంఘంయొక్క గడ్డపార రిపేరుచేసిన కంసాలి కూలి తీసుకోడానికి నిరాకరిస్తాడు. 'మీరు జీతం లేకుండా పనిచేస్తారు. మీకు సహాయం చేయడానికి నేను ఏమీ తీసుకోను' అని అతను అంటాడు.

"నాకు కలిగిన మరువరాని గౌరవం ఏమిటంటే, నేనొక చిన్న ఫిన్నిష్ బాలునికి నామకరణంచేసే తల్లిగా చేయబడటమే. నేను నామకరణం చేసినందుకు చాలా మంచి బహుమానం తీసుకొన్నాను. అది ఒక ఎర్ర రిబ్బను చుట్టిన సబ్బుబిళ్ళ. నేను పరమానందంతో తీసుకోవడం చూస్తే అది ఒక బంగారు సబ్బనే అనిపించింది. అవును. మాకు చాలా సాంఘిక కార్యాలుండినాయి. ఒక కాఫీ పార్టీతోనో, పాటతోనో లేక వాలీబాల్ ఆటతోనో మేము వారిని ఆనందపెట్టాము. వారూ మమ్మును ఆనంద పెట్టారు.

"ప్రతి కేంప్‌లోని మెంబర్లమధ్య గట్టి స్నేహబంధం ఏర్పడుతుంది. మొదట సిగ్గు, సందేహం, విరోధం

ఉంటాయి. కాని, 8 వారాలు కలిసి పనిచేసిన తర్వాత 'మీరంతా ఆనందంగా ఉండినారు. మీరు పోవడం చాలా విచారకరంగా ఉంది' అని అనుకునేవారు.

"నేను ఒకసంఘం నుండి ఇంకొక సంఘానికి పోతూ, నా దేశంవారినిచూచి చాలా గర్వపడ్డాను. వాస్తవానికి ప్రచారకులు ఏ దేశంలో పనిచేస్తారో ఆ దేశభాష నేర్చుకోవాలి. ఫిన్నిష్ భాష చాలా కష్టమైంది. కాని, నేను చాలా తొందరగా ఫిన్నిష్‌భాష మాట్లాడే ఒక అమెరికను బాలికను చూచాను."

ఆ ప్రచారకులు ఫిన్లాండ్‌ను విడిచిపోగా ఒక రైతు వారికి ఇలా వ్రాశాడు : "నేను మీకు ఇప్పుడు కొన్ని మాటలు వ్రాస్తున్నాను. మీరు మాకు చాలావిధాలైన ముఖ్య పనులలో సహాయం చేసినందుకు ముందు నేను మీకు నా అభివందనాలు తెల్పవలయును. మీరు స్వయం సేవకులుగా మాకు సహాయం చేయాలని వివిధ దేశాలనుండి వచ్చారు. మా అవసరాలను అర్థం చేసుకొన్నారు. మేము ఎలాగ అన్నింటినీ కొత్తగా కట్టుకోవాలో, భూములు బాగుచేసుకోవాలో తెలుసుకున్నాను. ఈ సంఘాల ఏర్పాటుచేసిన వారికికూడా నా అభివందనాలు తెలుపవలెను.

"మాకు మిమ్ము గురించి చాలా మంచి జ్ఞాపకాలుంటాయి. మీరు పనిచేసిన స్థలాలకు మేం పోయి

నప్పుడు మిమ్మ్మ తలచుకొంటాము. మీరు తిరుగుతుండే పక్షుల మాదిరిగా ఉండినారు. మీరు వసంతకాలంలో వచ్చారు. వేసవిలో మాతోపాటు పనిచేశారు. ఆకు రాలు కాలంలో వెళ్ళిపోతున్నారు. మీరు మీ స్వదేశాలకు పోతారు. మీరు పోవడానికి మేము చాలా చింతిస్తున్నాము. కాని, మీ ప్రయాణంలోను, మీ ఇండ్లలోను మిమ్మ్మ భగవంతుడు కాపాడుగాక."

1947 వ సంవత్సరం వేసవికాలమందు ప్రపంచ విజ్ఞాన సమితి ప్రచారకులు మొదటిసారిగా అంతర్జాతీయ పనివారి సంఘాలను చూడడానికి పోయారు. బెల్జియం, జెకోస్లావేకియా, ఫ్రాన్సు, పోలెండ్ దేశాలకు పోయి ప్రతిచోట వివిధ దేశాల యువతీయువకులు ఒకటిగా కలిసి మెలసి పనిచేస్తూ ఒకరి నొకరు అర్థం చేసు కుంటున్నారు. పని తర్వాత వారం ఆఖరున చెట్టుక్రింద చేరి వివిధ విషయాలు చర్చించుకొనేవారు. ఆ చర్చలు చాలా విలువగలవని వారు గుర్తించారు. వారు చేసే పనంతా చాలా మెచ్చుకో తగింది.

కాని, వారు చాలా కష్టాలను గురించికూడా తెలిసి కొన్నారు. చక్కని ప్రణాళికలను వేసేందుకు, ప్రయాణ సౌకర్యాలు కలిగించేందుకు కావలసిన సామగ్రి సమ కూర్చుకోడానికి వారు చాలా కష్టపడుతుండినారు.

ఎల్లప్పుడు ధనం సేకరించడానికి స్వయంసేవక సంఘాలు కూడా చాలా కష్టపడుతుండినాయి.

"మా పరిస్థితులను చర్చించేందుకు మనమంతా ఒకటిగా చేరలేమా?" అని వారిని ప్రతిచోట పనివారు అడిగారు. ప్రపంచ విజ్ఞాన సమితి ఆలా చేసేందుకు అందరూ ప్యారిస్‌లో కలుసుకోవాలని ఆహ్వానాలు పంపించింది. ఆ సమావేశం 1948 లో జరిగింది. 9 దేశాలనుండి 19 సంఘాల ప్రతినిధులు వచ్చారు. అప్పుడే శాశ్వత కార్యనిర్వాహక వర్గానికి సహాయ సంఘాన్ని ఏర్పరచారు. ప్రపంచంనుండి వివిధ సంఘాలు ఫలానా పనులు చేయాలంటూ ఈ సంఘం ఆఫీసుకు ఉత్తరాలు వ్రాస్తారు. వాటికి తగిన జవాబులు పంపబడుతాయి. ప్రపంచ విజ్ఞాన సమితివారు "అంతర్జాతీయ స్వయంసేవక సంఘాల నిర్మాణం" అనే పుస్తకాన్ని ప్రకటించింది.

ఆ సంఘాలతోపాటు తన విధిని నిర్వర్తించడానికి ప్రపంచ విజ్ఞాన సమితి గ్రంథాలయాలను స్థాపిస్తుంది. ప్రతి గ్రంథాలయంలోను ప్రపంచ సమస్యలను గురించిన 250 పుస్తకాలు ఉంటాయి. ప్రపంచ విజ్ఞాన సమితి ప్రచురణలు కూడా వాటిలో ఉంటాయి. చలికాలంలో ఆ పుస్తకాలు యువక కేంద్రాలలోను, పాఠశాలల్లోను పెట్టబడుతాయి.

1949 సంవత్సరం సమావేశం తర్వాత ప్రపంచ విజ్ఞాన సమితి ప్రచారకుల సమావేశం జరుపబడునని ఆహ్వానం పంపింది. 14 దేశాలనుంచి 48 మంది ప్రతినిధులు మూడు రోజులపాటు సమావేశ మయ్యారు.

అది చాలా గొప్ప సమావేశము. ఒక ప్రతినిధి ఇలా చెప్పాడు: "నాకు ఇక్కడ బాగా గోచరించిన ఒక్క విషయం ఏమిటంటే, మన కార్యక్రమం అంతు లేనిదనే విషయం. మనము పలురకాల సంఘాలవారమే అయినప్పటికీ ఒకచోట చేరితే ఒకరినుండి మరొకరు నేర్చుకోవలసింది ఎంతో ఉన్నది."

వారి కడపటి సమావేశ కాలంలో ఆ ప్రతినిధులు ప్రపంచ విజ్ఞానసమితి సర్వసభ్య సభకు ఈ వార్త పంపారు: "మేము మీవలెనే పలుదేశాలకు చెందిన వారము. ఈ వారపు మా చర్యలు అంతర్జాతీయ స్నేహసంబంధాన్ని కలిగించడమేకాక, సత్యాన్ని అర్థం చేసుకొనేందుకు స్త్రీ పురుషులకు ఉత్సాహాన్ని కలిగిస్తాయనికూడా ఆశిస్తున్నాము."

ఒక కుటుంబంలోవారిలాగ పనిచేస్తూ, జీవిస్తూ, విద్యనేర్చుకొంటూ, శాంతిని స్థాపించాలనేది ఈ స్వయం సేవకుల సమాన ఆశయం. అందుచేత, వారు పరస్పరం అన్యోన్యంగా ముచ్చటించుకుంటారు.

# వివిధ దేశప్రజలమధ్య సాన్నిహిత్యం

"మనము ప్రపంచ విజ్ఞాన సమితి సహాయంపైన ఆధార పడతాం. కాని, తమకు తామే సహాయం చేసుకో గలవారికి అది ప్రాముఖ్యత ఇస్తుందని మనకు తెలిసిందే. కాబట్టి, మనం చేయగలిగింది చేస్తామని తీర్మానించు కొన్నాం. అంతర్జాతీయ యువజన వినిమయానికికూడ మనం అంగీకరించాలి. మరుసటి వేసవిలో ఫిన్నిష్, డేనిష్, డచ్, ఫ్రెంచ్, స్విస్ విజ్ఞాన సంఘాల బాల బాలికలు ఒకరినొకరు కలుసుకోడానికి పోయి, ప్రపంచ విజ్ఞాన సమితి మూలంగా ఉత్తరాలు వ్రాసుకొంటున్న తమ దూరదేశపు స్నేహితులను కలుసుకొంటారు."

నెదర్లాండ్స్ దేశపు కీస్ మొయిజర్స్ అనే యువకుడు (22 ఏండ్లవాడు) చెప్పిన మాటలివి. 9 ఇతర దేశాల విజ్ఞాన సంఘ నాయకులతో కలసి ఒకచోట విజ్ఞాన సమితి భవనంలో ఉండేవాడు. వారి దగ్గరనుంచి సెలవు పుచ్చుకొని వెళ్ళిపోతూ ఆ విధంగా చెప్పాడు. ఆ ఆశ్చర్యాన్ని కలిగించే మూడు రోజులకాలంలో కొరియా నుండి కోపెన్‌హేగన్‌వరకు, ప్రాగ్‌నుండి పెరాగ్వేవరకు గల యువక విజ్ఞాన వేత్తలు ఏమేమి చేస్తుండినారో తెలుసుకొన్నారు. వారు యువక పరిశోధకులనుగురించి, బ్రెజీల్ దేశపు యువక జ్యోతిష శాస్త్రజ్ఞులనుగురించి, అమెరికా సంయుక్తరాష్ట్రముల యువక వ్యవసాయ

దారులనుగురించి, తదితర జట్టులనుగురించి విన్నారు. వాటిలో తమ కాలాన్నంతా తమకై ఏర్పాటుచేసిన ప్రదర్శనను చూడడానికి వినియోగించారు. 5 సంవత్స రాల లోపల ఇండియాలోని హైస్కూళ్ళ విద్యార్థుల విజ్ఞాన శాస్త్రసంఘాలు ఒకటినుండి 400 పైగా పెరిగా యని విని వారు చాల ఆనందించారు.

ఆ ప్రతినిధులందరికి ముఖ్యంగా నచ్చినది ప్రపంచ విజ్ఞాన సమితి సర్వకార్య నిర్వాహకుడైన జైమీ టారెస్ బోడెట్ చెప్పిన విషయం.

ఆ విజ్ఞానసంఘ నాయకుల సమావేశంలో మాట్లా డుతూ ఆయన ఇలా అన్నాడు: "ఉన్నదాన్ని కనిపెట్టడం అంత గొప్పపని కాకపోయినా 30 సంవత్సరాలలోపల్నే జోసఫ్ బ్లాక్ బొగ్గు పులుసు వాయువును పరిశోధించ డాన్ని, ఐన్‌స్టెయిన్ తన తారతమ్య సూత్రాన్ని కని పెట్టడాన్ని మనం ప్రత్యేకభావంతో మెచ్చుకోవాలి. పోయిన సంవత్సరం 15 సంవత్సరాల అమెరికా బాలుడు కొన్ని జీవసంబంధ పదార్థాల కలయికనుగురించి క్రొత్త విషయాన్ని కనిపెట్టాడు.

"ఈ ఉదాహరణలన్నియు యువజనులను ప్రోత్సాహ పరచగలవు. అట్టి యువకులను మీ సంఘంలో చేర్చ వచ్చును. విజ్ఞాన శాస్త్రాన్ని వ్యాపింపజేస్తూ, మానవునికి ఉపయోగకారిగా చేస్తూ, పురోగమింప జేయటానికి ఇది

మీకు గొప్ప అవకాశం. మీరు స్త్రీ పురుషులను విజ్ఞాన శాస్త్ర వేత్తలుగనే కాక ఈ నాటి ప్రపంచానికి కలిగే అపాయములను అర్థంచేసికో గలిగేటట్లు తయారు చేయుటకు ఇదంతా సహాయ పడుతుంది. మన సంఘ సభ్యులు తమ కృషివల్ల పేరు సంపాదించు కొన్నప్పటికి, లేక అవసరమైన చిన్న కార్యాలు చేసినప్పటికి వారందరిదీ ఒకే ఆశయం. ప్రజలనుంచి అజ్ఞాన, విద్వేషాలను పారద్రోలడానికి వారు పోరాడుతారు. వారి పనిని విశ్వాసంతో నెరవేరుస్తారు. ఆ పని పెద్దది కాని, చిన్నదికాని వారికి ప్రపంచంయెడల వుండే విశాల భావాలతో పనిచేస్తారు. మానవ జాతిని ఒకే గమ్యస్థానానికి చేర్చగల మార్గాలను వారు అర్థం చేసు కొంటారు.''

ఆ యువక విజ్ఞానశాస్త్ర సంఘనాయకుల సమావేశ సమాచారం ప్రపంచ విజ్ఞానసమితి యొక్క రేడియో ద్వారా ప్రకటింప బడింది. అది వార్తాపత్రికలలోనూ, విజ్ఞానసమితి వారు మూడుభాషలలో ప్రచురించే మాస పత్రికలోనూ ప్రకటింప బడింది. ఎందుకంటే, ప్రపంచ విజ్ఞానసమితివారు విజ్ఞానశాస్త్ర విషయంలో తమ పాత్రను నిర్వహిస్తూ, యువజనులలో క్రొత్త విజ్ఞాన శాస్త్ర సంఘాలను స్థాపించడాన్ని ప్రోత్సహిస్తూ, వివిధ దేశాలలో అప్పుడే స్థాపించబడ్డ వాటికి సహాయం

చేస్తూ పనిచేస్తారు. అప్పుడే ఎక్కడెక్కడ ఈ సంఘాలు స్థాపించ బడ్డాయో, యేమేమి చేస్తున్నాయో పరిలిశీంచి క్రొత్తగా సలహాలడిగే వారికి సమాధానాల్ని చెప్పడానికి తగిన సమాచారాన్ని సంపాదించారు. ఫ్రాన్సులోను, బెల్జియంలోను ఇలాంటి సంఘాలను ఇంకా ఎక్కువగా స్థాపించడానికి ప్రపంచ విజ్ఞానసమితియొక్క జాతీయ సంఘాలున్నాయి. లాటిన్ అమెరికాలో ప్రదర్శించడానికై చాలా విజ్ఞానశాస్త్ర ప్రదర్శనాలను ఈ సమతి వారు ఏర్పాటుచేశారు. ఆ ప్రదర్శనాలిచ్చిన ఒక వర్గం వారు ప్రపంచంలోని పలుచోట్లకు పంపబడ్డారు.

ప్రపంచంలోని విజ్ఞాన శాస్త్రజ్ఞులతోను, అంతర్జాతీయ, జాతీయ సంఘాలతోను పనిచేస్తూ ప్రపంచ విజ్ఞానసమితిచేసే పనులను యువజన సంఘాలుకూడ అనుసరిస్తాయి. వారు అది జరిపే సమావేశాల విషయాన్నంతా చదివి తెలుసుకొంటారు. ప్రకృతి సంపదలను రక్షించడం, అనేక విషయాలలో పరిశోధనలు జరపడం మొదలైన వాటినిగూర్చి చదివి తెలుసుకొంటారు. ఒక దేశంలోని శాస్త్రజ్ఞుడు విదేశంలో పరిశోధనలకై ప్రపంచ విజ్ఞానసమితి ధనసహాయం చేసిందనే విషయాన్ని ఆ దేశంలోని ప్రతి యువకుడు విని, తానుకూడా ఆ విధంగా పెద్దచదువు చదివి, అదేవిధంగా సహాయం పొందాలని ఆశిస్తాడు.

అన్నివిధములైన సమాచారాలకు ప్రపంచ విజ్ఞాన సమితిని అడుగవచ్చునని శాస్త్రజ్ఞులకు తెలుసును. ఉపాధ్యాయులు, పరిశోధకులు ప్రపంచ విజ్ఞానసమితి భవనంలో మంచి పరిశోధనాలయం వుందని తెలిసికొని, దానివంటిదానినే తాము నిర్మించాలని అనుకొంటారు.

ప్రపంచ విజ్ఞానసమితియొక్క ప్రముఖులు ముఖ్యమైన పరిశోధనా ఫలితాలను త్వరగా ప్రపంచానికి తెల్పడానికి పనిచేస్తారు. అందువల్ల, మానవ జీవితాలు కాపాడ బడ వచ్చును.

అందుచేత, తనకు తోచిన సత్కార్యాలను చేయడం ప్రపంచ విజ్ఞానసమితియొక్క ఆశయం. దీనికై అది విజ్ఞానశాస్త్ర విషయాల ప్రచురణలను ప్రోత్సహించింది. చాలా సంవత్సరాలనుండి ఈ విషయాలను 1000 సంఘాలకుపైగా ప్రచురిస్తుండినవి. ఇవన్నీ చందా దారులకు పంపబడేవి. ఈ విషయంలో చాలా మెచ్చుకో దగ్గపని రసాయన శాస్త్రంలో జరిగింది. 31 భాషల్లో 5000 సమాచారాలు ప్రకటింప బడ్డాయి. కాని, ఈ విశాల విజ్ఞానశాస్త్ర విషయంలో ఏలాటి సంగ్రహ ప్రణాళిక వేయబడలేదు.

ఇప్పుడు అట్టి ప్రణాళిక ఉన్నది. సంగ్రహణ విషయమై యోచించేందుకు 28 దేశాలనుండి 147 మంది విజ్ఞాన శాస్త్రజ్ఞులు, గ్రంథాలయోద్యోగులు పాల్గొను

సమావేశం ఏర్పాటు చెయ్యబడింది. వారిచర్చలలో ఆ ప్రతినిధులు మధ్యప్రాచ్యంలో పాశ్చాత్య శాస్త్రజ్ఞులకు తెలియనట్టి ఎన్నో విజ్ఞానశాస్త్ర పత్రికలు ప్రకటించ బడుతున్నాయనే విషయాలను తెలుసుకొన్నారు. కొన్ని ముఖ్యశాస్త్రాలలో ఎట్టి విషయ సంగ్రహణ చేయబడ లేదు.

వివిధ ప్రాంతాలలో నివసించే జనులకు శీఘ్రంగా అట్టి సమాచారాలు తెలియజేయడానికై ఏర్పరుపబడిన విజ్ఞానశాస్త్ర సంఘాలకు, పెద్ద ఆఫీసులకు క్రొత్త విధానాలన్నీ తెలియజేయబడుతాయి. యువకులగు శాస్త్రజ్ఞులు, పెద్దవారు, ప్రభుత్వాలు, సంఘాలు, ఉపాధ్యాయులు అన్నివిధాలైన సహాయాలకై యీ ప్రాంతీయ సంఘాలను నమ్ముకొంటారు. దక్షిణ అమెరికా దేశాలకు మాంటివిడోలోను, తూర్పు ఆసియాకు మనిలాలోను, దక్షిణ ఆసియాకు ఢిల్లీలోను, మధ్య ప్రాచ్యానికి కైరోలోను స్థాపించబడే సంఘాలు మొదట స్థాపించ వలసినవానిలో ముఖ్యమైనవి. తరువాతవి వీటిని అనుసరిస్తాయి. అర్జంటుగా వచ్చే ప్రశ్నలకు జవాబు చెప్పడం, ఆ ప్రాంతంలోని శాస్త్రజ్ఞులను ఒకచోట చేర్చడం, సంచార విజ్ఞాన శాస్త్రవేత్తల సంఘాలను నియమించడం ఈ పనులన్నీ ఆ సంఘం నాయకులకు రాత్రింబవళ్ళు పని కల్పిస్తాయి. వారి ఆఫీసు కాగితాలన్నీ సకల

విజ్ఞానమైన సమాచారాలతో నిండివుంటాయి. ఏదైన ఒక ప్రశ్నకు వారివద్ద సమాధానం లేకపోతే మరొకరిని అడిగి తెలుసుకుంటారు. వారిని ఏమి ప్రశ్నిస్తారో వారికే తెలియదు. ఉరుగ్వేనుండి హైస్కూళ్ళలో విజ్ఞాన శాస్త్రం ఎలా బోధించాలనే ప్రశ్న రావచ్చును. అర్జెంటైనానుండి లెక్కలను గురించిన ఫోటోలు, మైక్రో ఫిల్ముల విషయం తెలుపవలెననే ప్రశ్న రావచ్చును. కొలంబియానుండి జాగ్రఫీ సంఘాల ప్రశ్న రావచ్చును. ఇలానే వివిధ దేశాలనుండి వివిధ ప్రశ్నలు రావచ్చును.

ఈ విజ్ఞానశాస్త్ర సంఘాలు ఎలా పనిచేసేది ఉదాహరణకు, ఒక్కనాటి కార్యక్రమాన్ని ఒక చిన్న పుస్తకం విశదంగా తెల్పుతుంది. ప్రతిసంఘం ప్రపంచ ఆహార సంఘంతో కలసి పనిచేస్తుంది. భాగస్వామ్యం ఎల్లప్పుడు కలుపుగోలు తనాన్ని కలిగిస్తుంది. తొందరగా పెరిగే ఒకవిధమైన పాచి ఇండోనీషియా నీటిపారుదల మార్గాలను అరికట్టుతుంటే, ఆ ప్రభుత్వం విచారంతో నీటి పారుదలను, చేపల జీవితాలను పాడుచేస్తున్న ఆ పాచి మొక్కలను ఎలా పోగొట్టాలని అడిగింది. వారికి ఆ పాచిమొక్కలను చంపే విధానం తెలుపగా తిరిగి ఒక కొత్త కష్టం ఏర్పడింది. ఆ చచ్చిన నీటిమొక్కలను తొలిగించడం ఎలా ? ఈ సమయంలో పశ్చిమ బెంగాలు తన నిస్సారపు భూములను సారవంతం చేయడానికి

ఎరువులను అడిగింది. వెంటనే బెంగాలు రైతులకు ఎరువులు చేరాయి-అవి ఆ చచ్చిన పాచి మొక్కలే! ఇండోనీషియాకుకూడా ఇంకా చాలా మొక్కలున్నాయి. అదే మంచి ఎరువు.

విద్యార్థులు పరిశోధనాలయాలలో ప్రయోగాలు చేస్తున్నట్లే ప్రపంచ విజ్ఞాన సమితి ధనసహాయంవల్ల నిర్మించబడిన పరిశోధనాలయాల్లో పరిశోధనలు జరుగుతుంటాయి. ఒక సంవత్సరంలోనే 14 వివిధ అంతర్జాతీయ విజ్ఞానశాస్త్రజ్ఞుల సంఘాలు ప్రారంభించిన 143 పరిశోధనలకు ఈ సమితి సహాయ పడింది.

ప్రపంచ విజ్ఞాన సమితియొక్క ఒక శాస్త్రజ్ఞుడు ఎడారులలో సమితి చర్యలను గూర్చి చాల విశదంగా వ్రాయడంచేత 15,000 బ్రిటిష్ పాఠశాలల్లోని విద్యార్థులు తామంతా అతనితో స్వయంగా వుండి ఆ విషయాలను చూస్తున్నట్టు భావించారు. అతడు రిచీకాల్డర్ అనే అతడు. లండన్ "న్యూస్ క్రానికల్" అనే పత్రికకు విజ్ఞాన శాస్త్ర సంపాదకుడు. అతడు ఎడారిలో 15 వేల మైళ్ళు ప్రయాణం చేసి, వివిధ ప్రాంతాలు పరిశీలించాడు.

రిచీకాల్డెర్ అక్కడకు వెళ్ళడానికిముందు ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయానికి సంబంధించిన బెలియల్ కాలేజి విద్యార్థులు మొదలుకొని పాఠశాలల విద్యార్థులవరకు

కొన్ని వేలమంది ప్రయాణానికి సిద్ధపడ్డారు. ఎడారి ప్రాంతాలను ప్రపంచ విజ్ఞాన సమితి ఎందుకు పరిశీలించ దలచిందో వారు ముందుగా తెలిసికొన్నారు. వారికి కాల్డర్ ఇలా చెప్పాడు: "ప్రపంచంలోని భూమిలో మూడింట రెండు భాగాలలో పండే ఆహారంతో ప్రజలు జీవించలేరు. మనం భూమిని పూర్తిగా ఉపయోగించాలి. అంటే, ఎడారులనుకూడా వాడాలి. వాటిని ఉపయోగించ డానికి ఏమి జరుగుతూందో చూడడానికి నేను పోతున్నాను."

ప్రతి తరగతివారు అతని ప్రయాణం వివరాలుగల పుస్తకము, అతను పోయిచూచే దేశాలను గూర్చి చక్కగా వుండే పుస్తకాలను తీసికొన్నారు. ప్రతి ఒక్కొక్క జాతీయ సంఘము, న్యూస్ క్రానికల్ పత్రిక ఇచ్చిన రంగుల గోడపటాన్ని, అందుపై అంటించడానికి గుర్తులను తీసికొన్నాడు.

కాల్డర్ ఫోటోలు తీసేవానితోకూడ లండన్ నగరం వదలిపోయాడు. అతను ప్రతిరోజు తన క్రొత్త సాహసా లనుగురించి ఒక వ్యాసం వ్రాశాడు. ఎడారి శాస్త్రజ్ఞులు ఈనాడు భూమివిషయంలోను, సారవంతమైన యెరువు లలోను, వ్యవసాయ విధానాలలోను జరిపే కృషిని గురించి అతడు వ్రాసిన వ్యాసాలను 32 దేశాలలో 43 వార్తాపత్రికలు ప్రకటించాయి. అందుచేత, ఆ విషయా

లన్నీ వేలకొలది ప్రజలకు తెలిశాయి. కాల్డర్ తన రచనలను "ఎడారి మానవుల పోరాటం" అనే శీర్షిక క్రింద ప్రకటించాడు. ఆ తర్వాత అవి అదే పేరుతో తయారయ్యాయి. ప్రజలు పూనుకుంటే ఇసుకతోను, గాలితోను పోట్లాడి జయించవచ్చునని అతను తెలిసికొన్నాడు.

ఒక వెన్నెలరాత్రిలో అతను కాస్సెరినీగేప్ అనే స్థలంలో ఉన్న ఎడారిలో టునీషియన్ ఇన్‌స్పెక్టర్ జనరల్ అయిన చార్లెస్ సౌమగ్నేతో మాట్లాడాడు.

"ఎడారిని ఫలవంతం చేయవచ్చుననీ, మనుజుల మూర్ఖతను పోగొట్టవచ్చుననీ నమ్మేవారు ప్రపంచంలో పదిమంది అయినా వుంటే నాకు చెప్పు ; నేను ఆనందంగా చనిపోతాను" అని ఆ జనరల్ అన్నాడు.

కాల్డర్ తన ప్రయాణాన్ని పూర్తి చేసికొనే సరికి అతడు ఇలా వ్రాయగలిగాడు: "నేను యిప్పుడు జనరల్‌కు పదిమంది కాదు వందలకొలది జనులున్నారని చెప్పగలను. నాకు తెలసిన స్త్రీ పురుషులు ఎడారిలో త్యాగంచేసి కష్టపడుతున్నారు. ఎడారులను పంట భూములుగా చెయ్యవచ్చునని వారి విశ్వాసం. విశ్వాసమే కాదు, ఆ విశ్వాసంతో పనిచేసి చూపుతున్నారు. ఉత్తర ఆఫ్రికా, మధ్య ప్రాచ్యాలలోని ఎడారులను పంటభూములుగా చేసుకున్నవారిని నేను

చూచాను. నేను లెక్కలేనన్ని పాఠాలను నేర్చు
కొన్నాను.”

కార్లక్ వ్యాసాలను చాల శ్రద్ధతో చదివిన చాలా
మంది ప్రజలలో గ్రేట్ బ్రిటన్‌లో నేమి, ఇతర
దేశాలలో నేమి ఉండినారు. “ఆహారము—ప్రజలు”
అనే క్లిష్టవిషయాన్ని గురించి చర్చించే పెద్దలు, యువకులు
అనేకమంది ఉండినారు.

ప్రపంచ ఆహార సంఘంవారు “ఆహారము—ప్రజలు”
అనే శీర్షికతో కొన్ని చిన్న పుస్తకాలను ప్రకటించి,
ఆహార సమస్య అతి క్లిష్టమైనదని వివరించారు. వీటిలో
మొదటి పుస్తకం తొలిపలుకు క్రిందివిధంగా ప్రారం
భించ బడింది:

“ప్రపంచ ప్రజలు అతి శ్రద్ధగా పూనుకొంటే
తప్ప, ప్రతివానికి కడుపునిండా భోజనం లభించడం మహా
దుర్లభం.”

అందుచేత, ప్రతిదేశంలోని వారు సమృద్ధిగా ఆహార
ధాన్యాలను పండించడానికేమి, పంటల అభివృద్ధికి వారు
చర్యలు తీసుకోడానికేమి ప్రపంచ విజ్ఞాన సమితి శత
విధాల కృషిచేసింది. తత్ఫలితంగా ఆహార సమస్యా
పరిష్కార మార్గాలను సూచిస్తూ అనేక పుస్తకాలు
వెలువడడం, పంటల నభివృద్ధి పరచడానికి దోహద

మిచ్చే అనేక సంఘాలు యేర్పడడం మొదలైనవి జరిగాయి.

హాలెండులో యువకుల భోజనశాలల సంస్థ, గ్రేట్ బ్రిటన్‌లోని జాతీయ విద్యార్థుల సంఘం, అమెరికా సంయుక్త రాష్ట్రాలలో హైస్కూళ్ళ విద్యార్థులు, అమెరికన్ పెద్దల సంఘాలవారు, ఇంకా అనేక సంఘాల వారు కృషిచేశారు.

కెనడాలోని లాయల్‌టీ స్కూల్ ప్రిన్సిపాలయిన జి. సి. ఫెలోస్ ఐరోపా సంక్షేమ కార్యక్రమమునుండి తిరిగివచ్చి, ఒక కొత్త ప్రణాళికను తయారుచేశాడు. అతను యూరప్‌లో యువసంఘాలు భద్రతా సంఘం లాగ వున్నాయని చెప్పాడు. తన కాలేజి విద్యార్థులు ఆ విధంగా చేయాలన్నాడు. ఆ విద్యార్థులు యు. ఎన్. శాఖకు వ్రాసి, సలహాలను తెప్పించుకొన్నారు. వారు తమకృషి కెనడా అంతటా వ్యాపిస్తుందనీ, తాము దాన్ని రేడియోద్వారా వినిపిస్తామనీ, తాము ఐక్యరాజ్య సమితిని చూడడానికి లేక్ సక్సెస్సుకు వెడతామనీ, వైట్‌హౌస్‌ను, అధ్యక్షుడు ట్రూమన్‌ను చూస్తామనీ అనుకోలేదు. కాని, అదంతా జరిగింది. వారు బాగా కష్టపడి పనిచేశారు. దానిని చూచిన వారంతా చాలా మెచ్చుకొన్నారు. ఇతరసంఘాలవారు తమ ప్రాంతాలకు రమ్మని వారిని ఆహ్వానించారు. వార్తా పత్రికలలో ఆ

విషయం ప్రకటించినపుడు వారికి చాలా ఉత్తరాలు వచ్చాయి. వాటిని రికార్డుచేసి వివిధ కేంద్రాలద్వారా వినిపించారు. వారి కార్యక్రమం ప్రపంచ విజ్ఞానసమి యొక్క, ప్రపంచ పాఠశాలలయొక్క భాగస్వామ్యానికి మచ్చుతునక. వివిధ దేశాలనుండి తాము పిల్లల్ని ఏలా ఉత్సాహ పరచాలో వచ్చిన ఉత్తరాలకు వీరి కథను జవాబుగా వ్రాశారు. తమ దేశాలలో ఉపాధ్యాయులు వ్రాసేది ఆ కథే. జాతీయ సంఘాలనుండి ప్రపంచ విజ్ఞానసమితికి పంపబడే రిపోర్టులలో మాటిమాటికి ఇదే కనబడుతుంది: "ఐక్యరాజ్య సంఘాన్నిగూర్చి చదవడం యిప్పటి మా పాఠశాల కార్యక్రమములో తప్పనిసరి అయింది." ఈనాడు ప్రతిఖండంలో యువకులు వివిధ భాషల్లో రచించబడిన ఐక్యరాజ్యసంఘ ప్రణాళిక పత్రాన్ని చదువుతున్నారు. మానవజాతి చరిత్రలో మొట్టమొదటిసారిగా అన్ని పాఠశాలలలోని, కళాశాలల లోని విద్యార్థులు ఒకేవిధమైన పుస్తకములను చదువుతున్నారు.

అమెరికాలో ఐక్యరాజ్యసమితిని గూర్చి ప్రతి పాఠశాలలోని ప్రతి తరగతివారు తెలుసుకుంటారు. కొన్ని నగరాలలో ఉపాధ్యాయులు ఆ యా తరగతుల కనుగుణ్యాంగా ఆ పాఠాలు తయారుచేశారు. సెయింట్ పాఠశాలలో పాఠ్యవిషయానికి "మీరు—ఇతరులు

అని పేరు. న్యూయార్కు పాఠశాలలో "ఒక మంచి ప్రపంచం"అనే పేరుతో ఈ పాఠాలు చెప్పబడుతాయి. అందులో చిన్నపిల్లలుకూడ పాల్గొంటారు. "ప్రపంచ సామరస్యం పిల్లలతో ప్రారంభ మౌతుంది" అనే పుస్తకము ప్రకటించారు. దేశమంతా పాఠశాలల సంఘాలు ఐక్యరాజ్య సమితిగురించిన ఫిల్ములను చూపిస్తాయి. డెట్రాయిట్‌లో 19 హైస్కూళ్ళ విద్యార్థులు ఐక్యరాజ్య సమితినిగూర్చి చదివిన తరువాత వారంతా కలసి ఒక జనరల్ అసెంబ్లీ ఏర్పరిచారు. దానిలో పాల్గొనే ప్రతినిధిగా ఎన్నుకోబడటం విద్యార్థులకు ఒక గొప్ప గౌరవము. వందలకొద్ది పాఠశాలల్లో ప్రతిసంవత్సరము మానవజాతి హక్కుల ప్రకటనగురించి ప్రదర్శనలు జరుపుతారు. ప్యారిస్‌లో జనరల్ అసెంబ్లీ జరిగినచోటికి చాలామంది యువకులు వెళ్ళిచూచారు. అచట వారు వివిధ ప్రభుత్వాలు మానవజాతి హక్కులకై పోరాడి సంపాదించిన పత్రాలను చూచారు. అమెరికా సంయుక్తరాష్ట్రాలనుండి స్వాతంత్ర్య ప్రకటన, లింకన్ ఉపన్యాసము, మానవ హక్కుల పట్టిక ప్రతులు పంపబడ్డాయి.

అధ్యక్షుడు ఫ్రాంక్లిన్ రూజ్‌వెల్టు చెప్పిన నాలుగు స్వాతంత్ర్యాలపై ఆధారపడిన ఐక్యరాజ్య సమితియొక్క శాంతి కార్యక్రమాన్ని చూపించే చిత్రాలను చూచి

చాలామంది సంతోషపడ్డారు. అందరూ వాటిని కోరడం చేత ప్రపంచ విజ్ఞాన సమితి వాటిని బొమ్మల పుస్తకాలుగాచేసి పాఠశాలలకు, సంఘాలకు ఇచ్చింది. ప్రపంచ విజ్ఞాన సమితి పాఠశాలలకుచేసిన ఇంకొక ముఖ్య ఉపకార మేమంటే, విద్యార్థులు చదివే పుస్త కాలు పంపడం. నానాజాతి సమితి కాలములోనే వివిధ దేశాల విద్యాబోధకులు అంతర్జాతీయ సామరస్యం సిద్ధింపజేసే పుస్తకాలను ఏలా వ్రాయడమో చర్చించారు.

ఒక నార్వీజియిన్—అమెరికన్ పౌరుడు ఇలా చెప్పాడు: "నేను నార్వేలో బాలుడుగా ఉన్నపుడు మా దేశములోని, స్వీడన్ దేశములోని విద్యాబోధకులు మాకు బోధించేదంతా చాలా కీడు కలిగిస్తుందని గుర్తిం చారు. మా పాఠ్య గ్రంథాలన్నీ మాలోని విభేదాలను, మాకు జరిగిన యుద్ధాలను మాత్రమే బోధించాయి. నిజంగా మేము విరోధంగా ఉండినాము. మేము ఆ యుద్ధాలు చేశాం. కాని, మేము సమైక్యంగా చేసింది వాటికన్న ముఖ్యమైంది.

"నార్వేయొక్క, స్వీడన్ యొక్క విద్యాబోధకులు దీన్ని గుర్తించారు. నేను బాలునిగా ఉన్నపుడు మా పుస్తకాలు మారి పోయాయి. ఒకనాడు మా తాత నా చరిత్ర పుస్తకము చదవడం నేను చూచాను.

'నేను నీవయస్సులో ఉండినపుడు నాకే ఈ పుస్తకము ఉండి ఉంటే ఎంత బాగుండును' అని ఆయన నాతో చెప్పాడు. 'ఎందుకు?' అని నే నడిగాను. 'ఎందుకంటే నేను ఇలా స్వీడన్ దేశస్థులపై విరోధభావం కలిగి ఉండే వాడినికాదు. అది నాకు ఇష్టంలేదు' అని ఆయన అన్నాడు."

అట్టి భావాలనే జైమ్ టారెస్ బాడెట్ అనే ఆయన "మనసులోని అవరోధాలు" అని అన్నాడు. ఆ అవరోధాలను తొలగించడానికే ప్రపంచ విజ్ఞాన సమితి పనిచేస్తూంది. చాలా దేశాలనుండి విద్యాబోధకులు వచ్చి, ఒకటిగా చేరి ఏమి చేయాలో యోచిస్తూంటారు.

అమెరికన్ ఉపాధ్యాయులు కూడా వారి జాతీయ విద్యాసంఘాలలోను, ఇతర సంఘాలలోను తమ పాఠ్య పుస్తకాలను గురించి యోచిస్తున్నారు.

ప్రపంచ విజ్ఞాన సమితికి చెందిన కాన్‌సాస్ నగరంలో ఉన్న స్థానిక సంఘాలవారు అడిగిన ప్రశ్నలలో రెండు ఇవి: "మన పుస్తకాలు అంతర్జాతీయ సామరస్యానికి సహాయపడతాయా? లేదా? వివిధ ప్రజల మధ్య అవి విద్వేషాలను రేకెత్తిస్తాయా?" ఆ పుస్తకాలు అందుకు పనికిరాకపోతే వారు వాటిని మార్చుకోగలరు.

విద్యాబోధకులను, విజ్ఞాన శాస్త్రజ్ఞులను ఒకటిగా చేరుస్తూ ప్రపంచ విజ్ఞాన సమితి ఈ విధంగా పనిచేస్తుంది. అమెరికా జాతీయ సంఘం ప్రకటించిన ప్రపంచ విజ్ఞాన సమితి యొక్క చరిత్రలోని అధ్యాయాలు అటువంటివే. అదంతా కూడా వివిధ దేశాల ప్రజలు పరస్పరసద్భావాన్ని పెంపొందించుకోవాలనే గొప్ప విషయాన్ని తెల్పుతుంది. "యుద్ధాలు మానవుల మనస్సులలో బయలుదేరుతాయి. కాబట్టి, శాంతిరక్షణ విధానాలను ఆ మనస్సులలోనే నెలకొల్పవలెను," అని ప్రపంచ విజ్ఞాన సమితి చట్టం తొలిపలుకులో ఉద్బోధించబడింది.

# సరిహద్దులే లేవు!

ఆనాడు ప్రపంచ విజ్ఞాన సమితి (యు.ఎన్.ఇ.ఎస్.సి. ఓ.—ఐక్యరాజ్య ఆర్థిక, సాంఘిక, సాంస్కృతిక సంఘము) యొక్క వస్తుప్రదర్శన దినము. అందరూ ఆనందించ డానికి ఈజిప్టు దేశీయుల యువకబృందము తమ చాతుర్యాన్ని చూపెట్టారు. అచ్చటివారు చేసిన బొమ్మలు, చెక్కిన విగ్రహములు, అల్లిన జాలరులు ఉన్నాయి. ఆ ప్రదర్శనం చూడడానికి వచ్చినవారంతా 20 సంవత్సరాలలోపల ఉన్నవారి ఆ చిత్ర విచిత్ర పను లను చూచి చాలా ఆశ్చర్యపోతారు. వారు ఎవరు? అట్టి సాటిలేని మేటిపనులు చేసేందుకు వారిని తయారు చేసింది ఎవరు? సామేదా మిస్సాన్ అనే ఆమె దీనికి కారకురాలు. ఎందుకంటే, ఆమె చెక్కిన విగ్రహము కూడా అక్కడ వుంది.

కొన్ని సంవత్సరాలక్రిందట కెయిరో పాఠశాలలో సామేదా దాన్ని ప్రారంభించింది. ఉదయాన వచ్చిన ఆ కొత్త వ్యక్తిని ఆమె చూడలేదు. ఆమె ఆలోచనలన్నీ తన చేతిలో వున్న బంకమట్టిముద్దమీదే! "భగవంతుడా! నేను దీన్ని భీకరాకారంగా చేయనీ," అని మెల్లగా అనుకుంటూంది. ఎందుకంటే, ఆమె సింహం గుహలో డేనియల్ ఉండేటట్లు చేయాలనుకుంది. ఆమె సింహాన్ని

ఎప్పుడూ చూడనందువల్ల అది భీకరంగా వుంటుందని అనుకుంది. హాబిబ్ గార్జ్ అనే ఆ కొత్త మనిషి సామేదా చేసింది సింహంగా లేదు గాని, ఒక క్రూర మృగంగా ఉందని చెప్పాడు. ఆ పనిలో అతనికి ఒక మంచి పనితనం గోచరించింది.

ఈజిప్టు దేశపు విద్యాశాఖలో కళలపై అధికారిగా ఉండిన హాబిబ్ జార్జి చాలాకాలం తన దేశ యువతీ యువకులకు స్నేహితుడుగా ఉండినాడు. అతను స్వయం గానే చాలామందికి కళలు నేర్పించాడు. చాలా మందికి సలహాలిచ్చాడు. మంచి పనితనం కలవారిని అతను తన ఇంట్లోనే పెట్టుకొని నేర్పించాడు. "మేము నేలపై కూర్చుంటాము. మేము ఒకటిగా పని చేశాము. పాడ తాము. ఆనందంగా ఉంటాము," అని అతను అంటాడు. సామేదా ఆ క్రూరమృగాన్ని చేసిన తర్వాత జార్జి దంపతులతో నివసిస్తూ తన ఇష్టం వచ్చిన బొమ్మలు చేయ సాగింది. ఇతరులు బొమ్మలు చేయడం, చిత్రిం చడం, నేయడం, చెక్కడం ఆమె చేస్తూండేది. ప్రపంచ విజ్ఞాన సమితి భవనంలోనివారు ఈ యువతీయువకుల చర్యలను గురించి వినగానే పారిస్ నగరంలో అతని శిష్యుల పనితనాన్ని ప్రదర్శింపమని జార్జిని ఆహ్వా నించారు.

ఈజిప్టు యువకులు చేసిన బొమ్మల ప్రదర్శన జరిగిన కొద్దికాలానికే 6 దేశాలయొక్క 12 మంది యువక చిత్రకారులు తమ బొమ్మల ప్రదర్శనను ప్రపంచ విజ్ఞాన సమితి భవనంలో జరిపారు. ప్రతి గోడపై ఉన్న ప్రకటన కాగితంమీాద ఉండే బొమ్మ "మేము ఒకటిగా చేరి మంచి ప్రపంచాన్ని నిర్మిస్తాము," అనే భావాన్ని తెల్పుతూంది. అవి అన్నీ విజ్ఞాన సమితియొక్క ప్రకటన కాగితాలు. వ్యాసరచన పోటీలకుగాను ఆ యా పాఠశాలలలోని పడుచువారిచే చిత్రింపబడ్డాయి. ప్రారంభ దినమున వ్యాసరచనలో గెలిచినవారి పేర్లు ప్రకటించబడ్డాయి. ఆ వ్యాసాలనుకూడా చదివారు. అది ఒక నిజమైన అంతర్జాతీయపు పోటీ. అందు న్యాయమూర్తులు బ్రెజిల్, చైనా, ఇండియా, స్విడ్జర్లెండ్, అమెరికా సంయుక్త రాష్ట్రాలనుండి వచ్చారు. ఆ బహుమతి ప్రకటన కాగితాలు, వ్యాసాలు ఆస్ట్రేలియా, బెల్జియం, డెన్మార్క్. ఇండియా, మెక్సికో, ఉత్తర ఐర్లాండ్, స్కాట్లెండ్, దక్షిణ ఆఫ్రికా, స్విడ్జర్లెండ్ దేశాల యువజనులవి. ఆ ప్రకటన కాగితాలు, వ్యాసాలు ప్రపంచ విజ్ఞాన సమితియొక్క మాసపత్రికలో ప్రకటింపబడగా అందరూ చాలా మెచ్చుకున్నారు.

ప్రపంచ యువక చిత్రకారులు, యువక గాయకులు, గానప్రియులు, నటకులు వీరందరికీ ప్రపంచ విజ్ఞాన సమితి

భవనంలో స్థానం ఉంది. ఎందుకంటే, చాలా దేశాల కళాకారులు సృష్టించిన అందాన్ని చాలా మంది ప్రజలు అనుభవింప వచ్చునని విజ్ఞాన సమితి చాలా విధాలుగా పాటుపడుతుంది.

అందమైన చిత్రాలను చూచే అదృష్టం లేనివారికై ఆ సంఘంయొక్క కళాశాఖ 1360 వ సం॥ నుండి ఇప్పటి వరకూ వెలువడిన మంచి రంగుచిత్రాల జాబితాను ప్రకటించింది. "రంగుల చిత్రాలు" అనే ఆ జాబితా పుస్తకంలో ప్రపంచంలోని ఏ భాగంలోనైనా సరే అందులోని ప్రతి చిత్రం ఎక్కడ దొరికేదీ తెలుప బడింది. ఆ పుస్తకం ప్రకటించడం పూర్తికాగానే విజ్ఞాన సమితి భవనంలో ఒక ప్రదర్శన జరిగింది. వెంటనే అలాంటి సంచార ప్రదర్శనాలు ఆస్ట్రేలియా, బ్రెజిల్ మున్నగు చాలా దేశాలకు పోయాయి. అక్కడ చాలా దూరప్రాంతంలో నివసించే యువతీ యువకులు కూడా వచ్చి వాటిని చూచారు.

అది ప్రపంచ విజ్ఞాన సమితి భవనంలో యువక గీత రచయితల రాత్రి. 5 మంది యువక గాయకులు వారు వ్రాసిన పాటల్నే పాడతారు. ప్రపంచ విజ్ఞాన సమితి తమకు కలిగించిన అవకాశానికి అందరూ చాలా మెచ్చు కున్నారు. ఎందుకంటే, రచయితలకు పెద్ద కష్టం ఏమి

టంటే తమ పనిని ప్రజల ముందు పెట్టుకోడానికి అవకాశం దొరకదు.

వారి స్థితిని గురించి విజ్ఞాన సమితి ఎలా తెలిసికొంది? అది తాను స్థాపించిన అంతర్జాతీయ గాయకసంఘం ద్వారానే! ఆ సంఘం ప్రపంచంలోని గాయకసంఘాలను అన్నింటినీ ఒకటిగా చేర్చింది.

కళా సంఘంవలెనే అంతర్జాతీయ గాయకసంఘానికి కూడా చాలా కార్యక్రమాలున్నాయి. వాటిని నెరవేర్చేందుకు సంఘం సహాయపడుతుంది. ఆ సంఘం ఆఫ్రికా, అమెరికాల జాతీయసంఘాల ద్వారా ఏర్పరచిన గాయకుల వినిమయాన్ని బట్టి దక్షిణాఫ్రికానుండి ఒక ఆఫ్రికను సంగీత విద్వాంసుల జట్టు అమెరికాకు వచ్చింది. అమెరికావారు ఆఫ్రికాకు పోయారు.

వివిధ దేశాలలోని పడుచువారు చిన్న గాయకసంఘాలను ఏర్పచారు. 10 సంవత్సరములకు ముందు ఎమ్. మార్సెల్ కవెలియర్ అనే ఆయన యువకులకై ఒక గాయకసంఘాన్ని స్థాపించాడు. వారు యుద్ధకాలంలో ఎలా తమ తర్ఫీజును సాగించారో మనం ఊహించలేము. ఈ నాడు బ్రసెల్స్‌లో మాత్రమే 10 వేలకు పైగా పడుచువారు యువ గాయకసంఘంలో ఉన్నారు. వారు తమ సొంతవాయిద్యాలను, బృంద గాయకులను కలిగిఉన్నారు. వారు తమ సొంత పత్రికలో

నాటకశాల విషయం, సినిమాల విషయం, గాయక విషయాలు ప్రకటిస్తారు.

ప్రతి సంవత్సరమూ చిన్న గాయకసంఘం ఒక అంతర్జాతీయ సమావేశాన్ని ఏర్పరుస్తుంది. ఎందుకంటే, ఇప్పుడు దాని సభ్యులు ఆస్ట్రేలియా, బెల్జియం, డెన్మార్క్, ఇండియా, మెక్సికో, ఉత్తర ఐర్లాండ్...మరి ఇతర చోట్లలోనూ ఉన్నారు. ఆ సమావేశంలో ఒక ముఖ్య కార్యం ఏమంటే వివిధదేశాల యువక గాయకులు చేరి సమూహగానం చేయడం.

నాటకాలలో ప్రత్యేక అభిరుచి ఉండేవారికై ప్రపంచ విజ్ఞాన సమితి భవనంలో అంతర్జాతీయ నాటకశాల సంఘం ఉంది. ప్రపంచంలోని చాలా చోట్లలోని సంఘాలలో దాని సభ్యులు, ఆ సంఘాలు చాలామంది ప్రజలకు నాటకాలు చూచి ఆనందించే అవకాశాలు కల్పించేందుకై కృషి చేస్తాయి. దాని ద్వారా కొన్ని దేశాలలో కొత్త నాటకశాలలు స్థాపించబడ్డాయి. ఇంకా చాలా స్థాపించేందుకు ప్రయత్నాలు జరుగుతున్నాయి.

ఆ సంఘ ప్రణాళికచేతనే ప్రతి సంవత్సరము మార్చి నెలలో ప్రపంచ మంతటా అంతర్జాతీయ నాటకశాల మాసము జరుపబడుతూంది. అప్పుడు నాటకాలు, ఉత్సవాలు, ప్రదర్శనలు జరుపబడతాయి. అప్పుడు

అమెరికా సంయుక్త రాష్ట్రాలలో 400 కు పైగా నాటక సంఘాలు పాల్గొంటాయి. వాటిలో చాలా హైస్కూళ్ళ లోనివే. కొందరు ఇతర దేశాల, ఇతర రచయితల నాటకాలు ప్రదర్శిస్తారు. పెన్సిల్వేనియా పాఠశాలలోని 1200 మందికి పైగా విద్యార్థులు ఆ సమయానికి తగ్గ "కంఠస్వరాలు—ఒక పాట—ఒక నృత్యం—ఒక ప్రపంచం" అనే ప్రదర్శనలను చేశాయి. ఎట్టి ప్రదర్శనలు జరిగి నప్పటికి అవి అన్నీ అంతర్జాతీయ సామరస్యతకు సహాక రిస్తాయి.

అది హేగ్ నగరంలోనున్న గ్రంథాలయంలోని బాలశాఖలో ఇంటికి పోయే దినం. ప్రతి ఒక్కడూ ఆశ్చర్యపడతాడు. ఎందుకంటే, ఏ క్షణంలోనైనా సరే తలుపు తెరవబడి కుమారి వుల్ఫ్ కనబడవచ్చును. ఆమె వారి గ్రంథాలయ నిర్వాహకురాలు. ఆమె 6 నెలల పాటు అమెరికాకు పోయివచ్చింది. ఆమె ఎలాంటి ప్రయాణంచేసింది! క్లీవ్‌లెండ్, ఓహియో పట్టణాలనుండి వాషింగ్టనుకు పోయింది. చికాగోకు, ఇల్లినాయిస్‌కు, డెట్రాయిట్...ఇంకా ఎన్నోచోట్లకు ఆమె పోయింది. ఆమె పోయిన ప్రతిచోటనుండి ఎన్నో బొమ్మల కార్డులను వారికి పంపింది. ఆమె ఇప్పుడు తిరిగీ ఇక్కడికి వచ్చింది.

కడకు తలుపు తెరువబడి ఆమె వచ్చింది. ఆమె ఆనందంగా నవ్వుతూంది. ఆమె రెండు చేతుల్లో

చాలా పుస్తకాలున్నాయి. వాటిని ఆమె పట్టుకోలేకనే ఉంది. గ్రంథాలయ బాలురంతా ఆహ్వానిస్తూ ఆమెను చుట్టుకొన్నారు. ఆమె పుస్తకాలు మేజామీద పెట్టే దానికి ముందే వారు ప్రశ్నలు ప్రారంభించారు. ఆమె ఎవరైనా అమెరికను బాల బాలికలను కలుసుకొందా? వారెలా ఉన్నారు ?

ఆమె తన యువక డచ్ స్నేహితులకు ఇలా చెప్పింది: "అవును. నేను వారిని కలుసుకొన్నాను. వారెలా ఉన్నారు? మంచిది. నేను మీకు చెప్తాను. వారు మొదటచేసినపని నా చెప్పులవైపు చూడటమే. నేను కొయ్యచెప్పులు వేసుకోలేదని వారు కనబరచిన భావాన్ని మీరు ఊహించుకోండి. నావికూడా వారి వలెనే ఉన్నాయని వారు విఫలు లయ్యారు!"

దాన్ని విన్నవారంతా నవ్వినారు. ఏమి యోచన! నెదర్లాండ్స్‌లో ఉండేవారంతా కొయ్యచెప్పులు వేస్తారని అనుకొంటున్నారా ?

కాని, ఒకక్షణం ఆగండి అంది ఆమె వెంటనే. "ఒక బాలుడు నాదగ్గరికి ఒక ఎర్రని ఈకను తెచ్చి ఇది మీ బాలురకు" అని ఇచ్చాడు. ఇది ఒక నాయకుని కిరీటంలోని ఈక. దీన్ని మా చిన్నాయన నాకు ఇచ్చాడు. ఇది హిందూదేశం ఈక. కాని, అమెరికాలో వుండేవారంతా హిందూదేశస్థులు కారని మీ గ్రంథాలయంలోని బాలు

రకు చెప్పడం మరచిపోవద్దు. అన్నాడుఆమె కొంచెంసేపు ఆగి "తిరిగీ మీకు తెలుసా? నేను అమెరికా సంయుక్త రాష్ట్రాలంతా తిరిగిన కాలంలో ఒక్క హిందూదేశస్థుని కూడా చూడలేదు!"

ఆమె మాటలు వినేవారి ముఖంలో కాంతి పూర్తిగా పోయింది. ఒకరి వెంబడి ఒకరు నవ్వడం మొదలు పెట్టారు. కాని, అదే ఒక విధమైన నవ్వు. ఇదిగో! అని ఆమె అరచింది.

తిరిగీ తన కథలోకి దిగింది. ప్రతివాడు స్నేహ భావంతో మెలగడంవల్ల ఆమె అక్కడ ఉండినన్ని నాళ్ళూ తన స్వదేశంలో వున్నట్టే తోచింది. "ఒక మారు నేను ఒక అమెరికను పాఠశాలలో ఒక తరగతికి పోయి చూచినప్పుడు ఒక చిన్న బాలుడు నాదగ్గరికి వచ్చి నేను మీకు ఆతిథ్య మిస్తాను అన్నాడు. ఆ తర్వాత అతడు అంతా చూపిస్తూ నన్ను చుట్టు త్రిప్పాడు. నాకు ఆ పిల్లల గ్రంథాలయాలలోను, పాఠ శాల గ్రంథాలయాలలోను అందరూ చూపిన గౌరవా నికి అది ఉదాహరణము. ఆ పుస్తకాలు!

"అవును: ఆ పుస్తకాలు. అమెరికను పడుచువారు ఏమి చదువుతారు? మీరు చదివే విధంగానే. వారి పుస్తకాలలో కొన్ని మనదగ్గర ఉన్నవే–కాంచనద్వీపం చిన్న స్త్రీలు, అరేబియన్ నైట్సు. మీవలె వారికి

చాలా కథలు—సాహసమైన కథలు, గుఱ్ఱాల కథలు—లేవు. మీకు తెలుసా!"

కొంతసేపు ఆగి ఆమె తెచ్చిన పుస్తకాలలో వెదికింది. సంయుక్త రాష్ట్రాలలో పడుచువారికై ప్రకటింపబడిన కొన్ని కొత్త కథలున్నాయి. "మీరు పాఠశాలలో ఇంగ్లీషు నేర్చుకుంటున్నారు. మంచిదే! వీటిని—మరి ఇతర మయినవాటిని చదువగలరు.

"మరి ఇతరమైనవి? అవును. చాలా వస్తున్నాయి. యుద్ధం తర్వాత కొత్త పుస్తకాల పెట్టెను మనకు పంపిన అమెరికను స్నేహితులు మీకు బహుమతిగా పంపుతున్నారు."

ఆ తర్వాత చిన్న బాలురవంతు వచ్చింది. ఆమె అమెరికాలోని పుస్తకాలను చూపింది. ఆ మేజాపైన బొమ్మల పుస్తకాలు! కుక్కపిల్లలు, పిల్లులు, చిన్న బాలబాలికల బొమ్మలతో అవి చాలా తమాషాగా ఉన్నాయి.

ఆ పుస్తకాలు ఎంత ముచ్చటగా ఉండినాయో ఆమె, యువజనుల అమెరికను గ్రంథాలయాలు చూచిన విషయాల కథకూడా అంత ముచ్చటగా ఉండింది. ఆమె కథల క్లాసులకు, పుస్తక ప్రదర్శనశాలలకు పోయింది. ఆమె పుస్తక ప్రదర్శన వారాలలో పాల్గొనింది.

"కాని, అక్కడ! నేను ఒకేతూరి అచ్చటి విషయా లన్నీ చెప్పలేను. మనం ఇప్పుడు ఆ పుస్తకాలు చూస్తాం. ఇంకోమారు మీరు వచ్చినప్పుడు సంయుక్త రాష్ట్రాల కథలోని మరికొన్ని ప్రకరణాలను చెప్తాను," అని చెప్పింది.

నెదర్లాండ్స్‌లో ఆమెకు పని తొందరదినాలు వచ్చాయి. ఆమె తిరిగి డచ్ పిల్లల, ప్రజల గ్రంథా లయాల పెద్దలకు, వారి పనిని, సారస్వతాన్ని బోధించే తరగతులకు పోయింది. ఆమె తన ప్రయాణాన్ని గురించి చెప్పేందుకై ప్రజల, ఉపాధ్యాయుల గుంపుల్లోకి పోయింది. ఆమె కొత్త పాఠశాల గ్రంథాలయాలు ప్రారంభించుటకై నగరాల, పట్టణాల ఉద్యోగులను కలుసుకొంది.

ఆమె సంయుక్తరాష్ట్రాల ప్రయాణం యునెస్కో (ప్రపంచ విజ్ఞాన సమితి) యొక్క ఉపకార విరాళంచేత జరిగింది. అన్ని దరఖాస్తులతోపాటు ఆమె దరఖాస్తును యునెస్కో కార్యాలయంలో బాగా పరిశీలించారు. ఆమె రెండో ప్రపంచయుద్ధానికి ముందు 10 సంవత్స రాలనుండి హేగ్‌లోని గ్రంథాలయానికి నిర్వాహకు రాలుగా ఉందని, చాలా బాగా పనిచేసిందని గుర్తిం చారు. కాని, ఆమె తన గ్రంథాలయం పనితోనే నిలువ లేదు. దేశంలో చాలా చోట్లకు పోయి ఉపాధ్యాయు

లను, తలిదండ్రులను గ్రంథాలయాలు ప్రారంభించమని ఉత్సాహ పరచింది. ఆమె అమెరికను గ్రంథాలయాలు తన యువజనుల గదులను అంత ఆకర్షణీయంగా, ఉపయోగకరంగా ఎలా పెట్టగలిగాయో తెలుసుకునేందుకై తాను అమెరికాకు పోవాలంది. కాబట్టి, ఆమెను ఎన్నుకున్నారు. ఆమె అమెరికా దేశపు ఒక మంచి గ్రంథాలయ పాఠశాలలో గ్రంథాలయ విధానాలు చదవాలని కోరింది. ఆమె గ్రంథాలయాధికారులతోను, బాల బాలికలతోను ఒకే విధంగా పరిచయం చేసుకోవాలని కోరింది.

యునెస్కోవారు ఆమెను ఎన్నుకోగానే చికాగో నగరంలోని అమెరికను గ్రంథాలయ సంఘం ఆమె 6 నెలలు ఉండడానికి ప్రణాళిక వేసింది. ఆమెను ఆహ్వానించేవారిని నిర్ణయించింది. వసతులు కల్పించింది. ఆమె వివిధ నగరాలు చూస్తూ చాలామందితో పరిచయం చేసుకుంటుంది. ఆమె సంయుక్తరాష్ట్రాల ప్రభుత్వం గ్రంథాలయాలకై ఏమేమి చేస్తున్నదో తెలుసుకొనేందుకై వాషింగ్టనులోని విద్యా విషయ కార్యాలయాన్ని చూస్తుంది.

అన్ని ఏర్పాట్లూ చాలా చక్కగా తయారు చేయబడ్డాయి. ఆమెకు ఒక కల నిజమైనట్లు తోచింది.

ఎక్కువ గ్రంథాలయాలు—ప్రపంచంలోని చాలా ప్రదేశాలలో చాలా మంది వాటికై ఆతురతతో ఉన్నారు. యునెస్కో వాటిని ప్రారంభించేందుకు సహాయ పడుతూంది. చాలాకాలంగా గ్రంథాలయాలున్న దేశాల్లోని గ్రంథాలయ సంఘాల అంతర్జాతీయ సంఘంవారు చేరి అన్ని రకాల గ్రంథాలయములను ఏర్పరచేందుకు, నడిపేందుకు కావలసిన సలహాలను ఇచ్చే పుస్తకాలను, ప్రకటన పత్రికలను ముద్రించేందుకు యునెస్కోకు సహాయ పడతారు. యునెస్కో సభ్యత్వ దేశాలలోని, పట్టణాల్లోని, నగరాల్లోని, జాతీయ ప్రభుత్వాల శాఖల్లోని పాఠశాల ఉద్యోగులు వారికి కావలసిన గ్రంథాలయ సహాయాన్ని యునెస్కో భవనమునుండి పొందవచ్చును.

యునెస్కో (ప్రపంచ విజ్ఞాన సమితి)కూడా ప్రపంచంలోని వివిధ ప్రదేశాలలో ప్రత్యేక గ్రంథాలయాలు స్థాపిస్తుంది. అక్కడ ప్రపంచ మంతటనుండి యువక పాఠకులకై పుస్తకాలను సేకరిస్తారు.

అంతర్జాతీయ యువజన గ్రంథాలయము స్థాపించబడినప్పుడు వచ్చిన అతిథులలో చాలమంది గొప్పవారు ఉండినారు. కుమారి స్కాజన్ అనే ఆమె ఒక పత్రికకు ఇలా వ్రాసింది :

"నాకు పెద్దవారి సంఘాలకన్నా ముఖ్యమైంది ఏమంటే మ్యూనిచ్ మాధ్యమిక పాఠశాల తరఫున చేరిన 30 మంది యువకుల సంఘంవారు గ్రంథాలపై చర్చలు, పుస్తక విమర్శలు, ప్రదర్శన విషయాలు, విధానాల చర్చలు మున్నగు విషయాలు చాలా బాగా చర్చించారు.

"వారు గ్రంథాలయం ప్రారంభించిన సమయంలో 22 దేశాల పిల్లలు వ్రాసిన రంగుచిత్రాలు, 23 దేశాల పిల్లల పుస్తకాలు ప్రదర్శింపబడ్డాయి.

"బాలురు వివిధ భాషలలోను తమ ఇష్టమైన పిల్లల పుస్తకాలనుండి కొన్ని భాగాలను చదివింతంతా నేను చాలా కష్టంమీద మీకు చక్కగా చెప్పగలను. ఆఖరున అందరూ తిరుగుతూ ఇంగ్లీషులోను, ఫ్రెంచిలోను, జర్మన్‌లోను, స్వీడిష్‌లోను 'నీవు నిద్ర పోతున్నావా?' అనే పాట పాడారు.

"ఆ మధ్యాహ్నము యువజనుల సంఘంలోని 17 ఏండ్ల సభ్యుడు పిల్లల సంఘానికి పెద్దగా ఎన్నుకోబడ్డాడు. అతను తన ఉపన్యాసంలో ఇలా చదివాడు :

"అంతర్జాతీయ యువజన గ్రంథాలయం ప్రపంచంలో మనకొక కొత్త వెలుగును ప్రసాదిస్తుంది. అది మనకు సకల ప్రపంచ విషయాలను అర్థం చేసుకునేందుకు

అవకాశాన్ని కలిగిస్తుంది. అది మనలను వివిధ ప్రదేశాల లోని యువజనులతో చేతులు కలుపజేసి చాలామంది శాంతిప్రియులు ఉన్నారని, అట్టివారిలో సామరస్యము ఏర్పడుతుందని తెలుపుతుంది.

"మనము సొంతంగానే అంతర్జాతీయ గ్రంథాలయానికై స్నేహితులను సంపాదింప కృషి చేస్తాము. జర్మను దేశీయులమైన మనం ఇతర ప్రజలతో శాంతి యుతంగా మెలగగలమని ప్రపంచానికి చూపించాలి. మంతా ఒక్కటిగా అందుకై కృషిచేయాలి," అని చదివాడు.

కాని, పుస్తకాలులేని గ్రంథాలయా లేమిటి? చాలా మంది ప్రజలకు చాలా పుస్తకాలు—ఇదీకూడా యునెస్కో కార్యక్రమమే. యునెస్కో స్థాపించబడ గానే ప్రపంచమందలి పెక్కు పుస్తకాలకై ప్రణాళికలు వేసింది. వెంటనే అది పుస్తకాల వినిమయానికి అడ్డు నిలచే వాటిపై దాడి చేసింది.

ఇట్టి అడ్డంకులలో పుస్తకాలు ఒక దేశంనుండి ఇంకొక దేశంలోనికి పంపే సమయాన వేయబడే కస్టమ్ ఛార్జ్ ఒకటి. కొన్ని చోట్లలో ఈ పన్ను చాలా ఎక్కువగా ఉండడంచేత అది చేర్చబడగా, పుస్తకం వెల మూడురెట్లు పెరిగేది. ఇది పుస్తకాల వెలను ఇలా పెంచడంచేత చాలా చోట్లలో ప్రజలు వాటిని కొననే

లేరు. ప్రజలు పుస్తకాలుకొనే ఇతర దేశాలలోకూడ వారి డబ్బుకు తీసుకోగలిగే పుస్తకాలు వారు కొనదలచుకొన్న వాటితో పోలిస్తే చాలా ఎక్కువ!

యునెస్కో ఆ పన్నులను తగ్గించాలని పని చేస్తున్నది. అలా చేయడానికి చాలా ప్రభుత్వాలు అంగీకరించాలి. అప్పుడే కొన్ని అంగీకరించాయి. ఇతర ప్రభుత్వాలు యోచిస్తున్నాయి. దాదాపు అవి ఈవైపే ఉన్నాయి. జాతీయ సరిహద్దులగుండా పుస్తకాలను ఊరికే పంపించడంకూడా చేయవచ్చును.

యునెస్కో ఎదుర్కొన్న ఇంకొక అడ్డంకి ఏమంటే, ప్రపంచంలోని రెండు విధాలైన డబ్బు మారకాలు—సాఫ్ట్ కరెన్సీ, హార్డ్ కరెన్సీ. యునెస్కో దీనికి తిరుగుదలను ఏర్పరచేదానికి మునుపు ఒక విధమగు డబ్బున్న దేశాలవారు పుస్తకాలకు ఆ పైకాన్ని పంపితే ఇంకొక దేశంవారు తీసుకోనరు. ఎందుకంటే, అవి వేరేచోట్లో మారవు.

యునెస్కో దీన్ని ఆపుటకు చేసిన విధానాన్ని ప్రజాసమూహ గ్రంథాలయ నిర్వాహకుడైన ఎవాన్స్ అనే అతను ప్రజలమధ్య సమాచారాలు స్వేచ్ఛగా వ్యాపించుటను అరికట్టే కష్టమైన ఈ అడ్డంకిని దాటుటకు యునెస్కోచేసిన స్పష్టమైన కృషికి మెచ్చుకోదగ్గ ఉదాహరణము అని అన్నాడు.

ఈనాడు రెండు విధాలైన డబ్బున్న దేశాలవారు బాగా పుస్తకాలను ఇచ్చి పుచ్చుకో గలగటం యునెస్కొయొక్క కృషి వల్లనే.

యునెస్కొ ఇంకొక విధమైన అదృష్టవంతమగు ప్రణాళికను ఏర్పరచింది. అది కొన్ని కూపన్లను అమ్మతుంది. దాన్ని బాలుడు డబ్బుకుకొని పుస్తకాలకై వివిధ దేశాలకు పంపవచ్చును.

చాలామంది ప్రజలకు చాలా పుస్తకాలు—కాని గ్రుడ్డిగా ఉంటే ఎలా? గ్రుడ్డివారి పుస్తకాలకై యునెస్కొ సాధించిన విజయం చాలా మెచ్చుకోదగింది. చాలా సంవత్సరాల క్రిందట లూయీ బ్రెయిల్లీ అనే గుడ్డివాడు తనపేరును సూచించు ఉబ్బు అక్షరాలను కనిపెట్టాడు. అటుపైని సంవత్సరాలలో మొదటి బ్రెయిల్లీ పుస్తకం ప్రకారం ఆ విధానం ప్రపంచమంతా వ్యాపించింది. కాని, అది వ్యాపించగా వివిధ భాషల్లోను ఆ విధానం అనుసరించబడింది. దాని ఫలితంగా 25 వేరు వేరు విధానాలు ఏర్పడ్డాయి. అందువల్ల ఏలాటి పుస్త కాలు లేకపోయాయి. ఇది చాలా విచారకరమైనది. లేనిచో చాలామంది గుడ్డివారికి ఒకేవిధమైన పుస్తకాలు ఉండేవి.

ఈ విచారకరమైన విషయాన్ని చర్చించేందుకు యునెస్కొ భవనంలో చేరిన వారిలో న్యూజిలెండ్

దేశస్థుడగు కుల్దా మెకంజీ ఒకడు. అతడు మొదటి ప్రపంచయుద్ధంలో గ్రుడ్డివాడై అప్పటినుండి అట్టి వారికై పనిచేస్తున్నాడు. "మనము ప్రతి గుడ్డివానికి ఒకే విధమైన విధానం అనుసరించాలి. అతని భాష ఏదైనా ఫరవాలేదు" అని అతను చెప్పాడు.

అన్ని భాషలకు ఒకే విధమైన అక్షరాలు—అది నెరవేరని పనే! కాని, దాన్ని సాధించారు. చాలా దేశాల అనుభవజ్ఞులు చాలా సమావేశాలు జరిపారు. వివిధ భాషల చిక్కులు పరిశీలించారు. అది అంతర్జాతీయ సహకారాన్నికూడా సాధించింది. గుడ్డివారికై వీరంతా ఒకే విధానాన్ని ఆమోదించారు.

ఈ విజయవార్త యునెస్కో భవనంలో జరిగిన అంతర్జాతీయ బ్రెయిల్లీ సమావేశంలో ప్రకటించబడగా హెలన్ కెల్లర్ అనే ఆయన "మీ పనిద్వారా గుడ్డివారి కొక నూతన యుగం ప్రారంభమౌతుంది. ప్రపంచంలోని గ్రుడ్డివారికంతా సంస్కృతియొక్క, విద్యయొక్క వికాసాన్ని కలిగించ గలము" అని చెప్పాడు.

"ఏ ఒక్క మార్గంలో గుడ్డివారైన మేము శీఘ్రం గానే చూపులున్న వారికన్నా ఒక్కడుగు ముందు వేస్తాము. మేము ఒకటే రకమగు ప్రాపంచిక వ్రాత విధానాన్ని కలిగి యుంటాము," అని కుల్దా చెప్పాడు.

చాలామంది ప్రజలకు చాలా పుస్తకాలు—కాని, చదువు రాకపోతే ఎలా ?

టి. జోసఫ్, గేసిలా అనేవా రిద్దరు తమ ఇల్లగు ఒంటిగది గుడిసెలో మట్టినేలమీద కూర్చొని, బంక మట్టి గోడకు ఆనుకొని, బయట ఎండలోని నేలను చూస్తున్నారు. మూలలో ఒక గడ్డి చాపపై వాళ్ళ నాన్న జ్వరంతో పండుకొని ఉన్నాడు. అతని ప్రక్క వారి అమ్మ చేతిలో బిడ్డను పెట్టుకొని అతనిపై ఈగలు వ్రాలకుండా నిశ్శబ్దంగా చూస్తుంది. నిశ్శబ్దంగా, నిరుత్సాహంగా ఆమె చూడసాగింది. ఎందుకంటే, ఆమె మనస్సులో బాధగా వుంది. రెండు రోజులనుండి వారు విత్తనాల ధాన్యం తింటున్నారు. అవి అయిపోతే తర్వాత వారిచేత ధనంలేదు. ఆ ధాన్యం తప్పితే వేరే ఆహారం లేదు.

ఆమె భర్త తీరికలేకుండా పొర్లుతున్నాడు. ఆమె ఓదార్చుతూ తనచేయి అతని లలాటాన పెట్టింది. ప్రతి సంవత్సరమూ కష్టం ఎక్కువైపోతూంది. అది అతని తప్పు కాదు. జబ్బుగాలేని ప్రతిదినమూ అతడు తన పనిముట్లతో కొండలోయకుపోయేవాడు సేద్యానికి. వారి ఆహారసంపాదనకు అదే మార్గం. జోసఫ్ తన తండ్రికి సహాయంగాపోతే, తండ్రి అతన్ని పెద్ద తాడుతో చెట్టుకు కట్టేశేవాడు. లేకపోతే అతను జారి పడిపోవచ్చును.

శీఘ్రకాలంలోనే ఆ పర్వత చరియలో నేల నిస్సార మైపోతుంది. అధ్వాన్నమైపోతుంది. ఎందుకంటే వానా కాలంలోని నీరు నేలసారాన్ని కొట్టుక పోతుంది. ప్రతి సంవత్సరం అలా జరగడంచేత, ప్రతి సంవత్సరం వారికి తక్కువ ధాన్యం వస్తుంది. పూర్తి కరువు ఎప్పుడో! వారి ఇంటికి దిగువలోయలో ఒకకారు వారి దగ్గరకి వస్తున్నది. దానిలో యునెస్కో జట్టు సభ్యు ఉన్నారు. వారు ఆ లోయలోనున్న 26 వేలమంది జీవితాన్ని బాగుపరచడానికి ఏం చేయాలో పరిశీలించను వచ్చారు.

ఆ ప్రాంతపు ప్రభుత్వము-యునెస్కో భాగస్వామ్యం అంగీకరింపబడింది. ఆ ప్రాంతంలోని జనులలో నూటికి 90 మంది విద్యాహీనులు. చాలా సంవత్సరాలుగా వారు భూమిని చెడుత్రోవల్లో వాడడంవల్ల అది ఇక పనికిరాదు. క్రొత్త భూమిని ఏర్పరచాలి. వారు ఎక్కువ చెట్లుకూడా పెంచలేదు. ప్రతి సంవత్సరమూ లోయలో తక్కువ ఆహారం పండింపబడుతుండేది.

ఆ ప్రాంతంలోని జనులలో ఎకువ జబ్బు వుండినది. దోమలవల్ల మలేరియా, ఇండ్లన్నీ మురికిగా ఉండడం చేత కురుపుల వ్యాధులు, ఇంకా ఇతర రోగాలు వస్తున్నాయి. వారు త్రాగే ఏటినీళ్ళలోనే పశువులు పగలంతా పొర్లాడేవి. మనుజులు స్నానం చేసేవారు

అక్కడ వైద్యుడు లేడు. ఆరోగ్యశాఖ దాది లేదు. కొన్ని పాఠశాలలు మాత్రమే ఉండినవి. పిల్లలు పోయే వారే కాదు.

ఇప్పుడు ఆ ప్రాంతాలలో యునెస్కో ప్రభుత్వము జట్టు వుంది. డాక్టర్ ఆల్ఫ్రెడ్ మెట్రాక్స్ ఆ జట్టు పెద్ద. అందులోని సభ్యులు చాలమంది అచ్చటివారే. ముందు వారు ప్రజలతో మాట్లాడి విద్యావసరాలను గుర్తించి కొన్నిసంవత్సరాలవరకు ఉపయోగపడే ప్రణాళికను నిర్మించడం చేయాలనుకున్నారు.

వారు ప్రజలు పస్తుండడం చూచారు. ఆ జట్టు ఇతరకార్యాలు చేసేందుకు ముందు పిల్లలకు, పడుచువారికి భోజన కేంద్రాలను నిర్మించారు. ఒక సభ్యుడు త్వరగా పెరిగే ధాన్యపు విత్తనాలకై సంయుక్తరాష్ట్రాలకు పోయాడు.

ఆ లోయలో రెండు సంవత్సరాలు గడచిపోయాయి. ఒక చిన్న అందమైన కట్టడంముందు మధ్యాహ్న కార్యక్రమంయొక్క కట్టకడపటిదిగా కొంతమంది పిల్లలు నృత్యము చేస్తారు. అది పూర్తికాగానే పడుచు వారు, పెద్దవారు తమవంతు తీసుకొంటారు. వారంతా గుంపుగాచేరి సాయంకాలంవరకు నృత్యము చేస్తారు. అదంతా చూచేవార్లలో ప్రపంచ ఆరోగ్యసంఘం, యునెస్కోలలోని రాజ్యాల సభ్యులున్నారు.

ఉదయంనుండి తమ వైద్యశాల ప్రారంభోత్సవం చేస్తున్నారు. అక్కడ నృత్యముచేసే రైతులకు వైద్య శాలలోని పరికరాలంతా ఎందుకో తెలియదుకాని వైద్యుడు, దాదులు తమకు సహాయంచేస్తారని తెలుసును. అంటే ఆ వైద్యుడు దాదులు అప్పుడే చాలా చేశారని తెలుస్తుంది. సూదిలోని ద్రవము చర్మవ్యాధిని బాగుచేస్తుందని ఎవరనుకున్నారు. కాని, అది అలా చేసింది.

గడచిన రెండు సంవత్సరాలలో ఇతర ప్రదర్శనాలు కూడా అక్కడ జరిగినాయి. రైతులు త్రవ్విన బావికి ఉత్సవం జరిపారు. దానిలోనుండి ఇప్పుడు వారికి త్రాగడానికి మంచినీరు లభించింది. వారి స్నేహితులు వారికి మంచినీటిని గురించి, మురికినీటిని గురించి చెప్పి నపుడు వారు ఆ పద్ధతులను అనుసరింప తీర్మానించారు. వారు తమ కేంద్రం పూర్తిచేయబడ్డపుడు ఒక ఉత్సవము జరిపారు. ఇప్పుడు ఆ కేంద్రములో ప్రతిదినము ఏదో ఒక మంచి విషయము జరుగుతుంటుంది. అక్కడే వారికి వ్యాధుల సినీమాలు చూపించారు. వారు అందుకు తగుశ్రద్ధతీసికొన్నారు. వారు సౌకర్యంగా ఇండ్లు ఏలా కట్టుకోవాలో చూపేమాదిరి ఇల్లు కట్టబడి నపుడు వారు ఉత్సవం జరిపారు. వారు ఇప్పుడు తోటల్లో రకరకాల చెట్లుపెట్టి కూరగాయలు పండిస్తారు.

వారికి క్రొత్త మార్కెట్టు ఉంది. రోడ్డుకూడా ఉంది. రైతులు దాన్నిచూచి చాలా గర్విస్తారు. రోడ్డుపనికై వారు కూలీ తీసికోలేదు. మొదటిభాగం పూర్తికాగానే వారు యునెస్కోకు బాగా సహాయంచేయండి అనే జండాలతో కదంత్రొక్కుతూ, పదం పాడుతూ నడిచారు.

ఆ వైద్యశాలముందు నృత్యంచేసే వారి హృదయాల్లో తమకై వచ్చి అన్ని మంచిపనులను చేసిన క్రొత్త స్నేహితులకు కృతజ్ఞతా భావాలున్నాయి. వారు ఇండ్లను, శరీరాలను శుభ్రముగా పెట్టుకోవాలని తెలుసుకొన్నారు. వారి భూములు, పనిముట్లు చాలా బాగున్నాయి.

క్రొత్త పాఠశాలల్లో నేర్చుకొన్నది వారికి బుద్ధి కుశలతను కలిగించింది. అందరూ పిన్నా, పెద్దా పాఠశాలకు పోయారు. స్త్రీలకు, బాలికలకు వంట, కుట్టుపని నేర్పించారు. పురుషులకు, స్త్రీలకు పశువుల పెంపకం, భూమిని కాపాడుకోవడం, పంటల కాపుదల వీటినిగురించి నేర్పారు.

గోడలపై మంచి పటాలు, లోపల సంగీతం ఉన్న పాఠశాలలో వుండడం బాగా ఉండేది. ఒక యంత్రంలో ప్లేటునుండి సంగీతము రావడం, ఇంకొక అద్భుత

కార్యం వినడం ఒక తమాషా. ఆడడం ఒక తమాషా. ఆటలన్నీ తమాషాలే—ముఖ్యంగా వాలీబాల్ ఆట.

పుస్తకాలు! ప్రతివాడు వాటిలో ముగ్ధుడయ్యే వాడు. వారి భాషలోనే వ్రాయబడిన పుస్తకాలుకూడ జ్ఞానాన్ని కలిగించాయి. ప్రతిదినం ఉపయోగించవలసిన చాలా విషయాలు అందులోనుంచి నేర్చుకున్నారు. వారు ఆ పుస్తకాలకై చాలా గర్వపడాలని యునెస్కో స్నేహితులు చెప్పారు. ఎందుకంటే, అవి వారికనే వ్రాయబడ్డాయి. వానిలో బొమ్మలు వారి జనులు వేసినవే. వారికి సహాయము చేయడానికై పుస్తకాలను గురించి బాగా తెలిసిన ఒకడు యునెస్కో భవనంనుంచి వచ్చాడు. ఇక వారు ఏమీ అజ్ఞానులుగా ఉండకూడదని ప్రభుత్వం సహాయపడింది.

చదవను నేర్చుకోవడం చాలా ఉత్సాహ పరచేది. టి. జోసఫ్, గేసిలాలు వాళ్ళ అమ్మ నాన్నలతో పందెం వేసుకొన్నారు. ఎవరు ముందు చదువగలరో అని. బొమ్మల ఆటలలో అది ఎంతోసేపు పట్టలేదు. గేసిలా గెలిచింది.

చదవను పాఠశాలకు పో నవసరంలేదు. లోయలో మట్టిచెట్ల నీడలో ప్రజలంతా ఉపాధ్యాయులను కలుసుకొంటారు. ఒకడు చదవను నేర్చుకోగానే ఇతరులకు

నేర్పిస్తాను. ఆ నీడల్లో 5-6 ఏండ్లవారుకూడా తల్లి దండ్రులకు అక్షరాలు చూపిస్తారు.

నిరక్షరాస్యత నిర్మూలనకు అంతర్జాతీయ సమావేశంయొక్క కృషివల్లనే ఆ పుస్తకాలు వెలువడ్డాయి. ఆ సమావేశాలలో యునెస్కో ఒక గొప్ప కార్యాన్ని నెరవేరుస్తుంది. ప్రపంచంలో అర్థభాగం ప్రజలకు విద్య లేదు. కాని, వారికి విద్య ఉంటేనే ఈ క్రొత్త ప్రపంచంలో స్థానం ఉంటుంది. అప్పుడే వారు ఏమి జరుగుతూందో తెలుసుకోగలరు. అప్పుడే వారు ఇతర దేశీయులతో తామంతా సామరస్య శాంతియుత భావాలతో మెలగవలెనని ముచ్చటించుకొంటారు.

ఈ పనిని నెరవేర్చుటకై యునెస్కో ప్రపంచంలోని విద్యాబోధకులను పిలచి విద్యాబోధనకు మంచి మార్గాలను చూపించమంటుంది.

వారు గత కార్యక్రమాన్ని ఆధారంగా పెట్టుకొని క్రొత్త విధానాన్ని యేర్పరుస్తారు. క్రొత్త పుస్తకాలు, బొమ్మల అట్టలు, విద్యాబోధక సినీమాలు వీటిద్వారా త్వరగా విద్య నేర్పవచ్చును.

అన్ని సభ్యత్వదేశాలు వాటిని ఉపయోగిస్తాయి. ఇండియా పల్లెప్రాంతంలో 7 ఏండ్ల రామచంద్రుడు 35 ఏండ్ల అతని తండ్రి చదవడానికి ప్రక్క ప్రక్కన

కూర్చుంటే వారి చేతుల్లోని పుస్తకం యునెస్కో తయారుచేసిందే అనుకోవాలి.

అందరూ నేర్చుకున్నారు. వారు నేర్చుకోవడం ద్వారా ఐక్యరాజ్య కూటమికూడా తనకు తానే నేర్చుకొంది. ఆ నేర్చుకోవడమే ముందుకాలంలో దానికి కలుగబోయే శక్తి. ఎందుకంటే, ఇప్పుడు జరిగిన దానివల్ల ప్రజలంతా ప్రపంచములో తమ మధ్య ఉన్న యువతీ యువకులను అర్థం చేసుకోవడంలో ఒకరికొకరు సన్నిహితు లయ్యారు.

ఈనాటి యువకులకు, భావి యువకులకు అభ్యుదయ కరమై, మానవ హక్కులు శాశ్వతంగా నిలవగల ప్రపంచం వాస్తవంగా ఏర్పడగలదు.

# మానవజాతి హక్కులు

ఐక్యరాజ్యములు మానవజాతి హక్కులకై ఎందు కింత శ్రద్ధ తీసుకొనవలయునని చాలమంది యువతీ యువకులు ఆశ్చర్యపడవచ్చును. దీనికి నిజమైన కారణం ఇది యుగయుగాలనుండి చర్చింపబడుతున్న విషయం కావడమే. పురాతన కాలమునుండి మానవులు తాము నివసించుటకే కాక, తమ మానవజాతి హక్కులకు, ప్రముఖ స్వాతంత్ర్యములకు పోరాడుతున్నారు. కాబట్టి, ఈ ఐక్యరాజ్యసంఘంలో కొన్ని ప్రముఖ మానవ హక్కులను, స్వాతంత్ర్యములను అనుభవించడంలో మనం వివిధ ప్రజలనుండి ఒకే తీర్మానాన్ని సంపాదించి, మనం మాట్లాడే విషయాలలో ఒకరినొకరు అర్థం చేసికొనగలిగితే, అప్పుడు మనం శాంతియుతమైన ప్రపంచ స్థాపనకు పునాదిరాయి వేసినవాళ్ళం కాగలం.

మానవజాతి హక్కులను, స్వేచ్ఛలను తోసి వేయడమే యుద్ధం. రెండు లేక చాలా దేశాలు యుద్ధం చేస్తున్నాయంటే ఆ దేశాలలో దేనిలోని ప్రజలకూ స్వేచ్ఛలు ఉండవు. ఎందుకంటే మానవజాతికి ముఖ్యమైన "జీవించే హక్కును" వారి ప్రభుత్వం వశపరచుకొంటుంది.

ఐక్యరాజ్య సమితియొక్క మానవజాతి హక్కుల సంఘం సమావేశానికి కూర్చుందంటే అందు ఉత్తర మధ్య అమెరికా, అమెరికా సంయుక్త రాష్ట్రాలు, దూరప్రాచ్య దేశాలు ఐరోపా, మధ్యతూర్పు దేశాల ప్రతినిధులు ఉంటారు. స్కాండినేవియా దేశాలనుండి పంపబడే డెన్మార్కు ప్రతినిధి తక్కిన వారికంటే బాగా మానవజాతి హక్కుల గురించి మాట్లాడుతాడు. ఎందుకంటే, ప్రతి జీవి హక్కును, స్వేచ్ఛను గురించి పోరాడడం వారికి సాంప్రదాయం అయిపోయింది.

నిరంకుశాధికారులనుండి మానవులకు స్వేచ్ఛను సంపాదించుటకు పోరాడిన బోలివర్ అనే తమ దేశస్థుణ్ణి లేటిన్ అమెరికావారు మరచిపోలేరు. వారు మానవజాతి హక్కులు, స్వేచ్ఛ గురించి చాలా జాగ్రత్తగా వుంటారు. కాని, వారి దేశం అభివృద్ధి కాకపోవడంచేత వారు వాటెని గుర్తించలేక పోతున్నారు.

రష్యావంటి నిరంకుశాధికారం ఉండేదేశాలలో ప్రభుత్వం, పైన ఉండి కొద్దిమంది చెప్పే ఆర్థిక, సాంఘిక సమస్యలు అందరికి ముఖ్యమైనవని యెంచబడుతాయి. అంతేకాని, మానవుని మానవత్వాన్ని స్పష్ట పరచే ఇతర ముఖ్య హక్కులు వారికి ముఖ్యమైనవని తోచదు.

మీరు హక్కుల పత్రాన్ని చూచారంటే, వ్యవసాయంలోను, యంత్రాల్లోను, విజ్ఞానంలోను జరిగిన అభివృద్ధినిబట్టి ఆ యా దేశాలు అమర్చబడ్డ విషయాన్ని మీరు చూస్తారు. ఆ హక్కుల సంఘంలోని సభ్యులు ప్రపంచానికి సంబంధించిన విషయాలన్నిటినీ పరిశీలించడానికి శక్తికొలది కృషి చేసి, ప్రతిచోట పరస్పర సహకార భావాల అభివృద్ధిని జరిగేటట్టు చూస్తారు.

ఈ ప్రత్యేక ప్రశ్నకు, ఐక్యరాజ్యసమితి యిచ్చే నిజమైన సమాధానం ఇదే. ప్రపంచంలోని ప్రజలందరికి సంబంధించిన ఒక బిల్లును తయారు చేయమని ఒక మానవజాతి హక్కుల సంఘాన్ని, ఆర్థిక, సాంఘిక సంఘం ఎందుకు నియమించిందో ఇది తెలియ పరుస్తుంది. మానవజాతి హక్కులు, స్వేచ్ఛలు ఏవేవో మన అంగీకారాలను పొందుపరచడానికి ఇది ఒక ప్రయత్నము.

ఈ సంఘం ముందుగా ఒక ప్రకటనను తయారు చేయ తీర్మానించింది. అందులో చాలా దేశములలో గుర్తించబడిన, ప్రజలు కోరుతున్న హక్కులు పేర్కొనబడుతాయి. దీని తర్వాత ఆ హక్కులను, స్వేచ్ఛలను వరుసక్రమంగా చర్చించిన పుస్తకాలు వస్తాయి. ఈ పుస్తకాలు తయారు చేయబడిన తర్వాత, వివిధ దేశాలవారు వాటిని ఆమోదిస్తారు. అట్లు ఆమోదించిన తర్వాత దాని ప్రకారం నడుచుకోవాలి.

వీనిలో మొదటిది మాత్రమే వ్రాయబడింది. అందులో అమెరికాలోని కొన్ని రాజకీయ హక్కులు చర్చించబడ్డాయి. వాటిని చట్టం ఎలా కాపాడవలెనో తెలుపబడింది. ఇందులో ఒక ముఖ్యమైన విషయం ఏమంటే, జాతి మత వర్ణ విభేదాలు పాటింపకుండా, ఏ పౌరుడైనా సరే ఈ హక్కులను అనుభవింప వచ్చును. మానవజాతి హక్కుల సంఘచరిత్రను పరిశోధించి మనం ఇట్టి స్థితికి ఎలా రాగలిగామో తెలిసికొందము.

మానవుని మొదటి యోచన, వాతావరణంనుండి తన్నుతాను కాపాడు కోవడం, తగిన ఆహారం సంపాదించుకోవడంగానే యుండింది. అది యతని ఉనికికి వీలుకలిగించింది. కానీ! వెంటనే, అంతకంటే మించినదేదో జీవితంలో కావాలని అతనికి తోచింది. అతనికి కోరిక ఉండడం మాత్రమేకాదు. అతను జీవించాలనుకున్నాడు. అతని జీవితాన్ని ఆనందమయం చేసే వస్తువుల సృష్టించడం అలవరచు కొన్నాడు. అతడు మొదట బొమ్మలగుండా, తర్వాత మాటలగుండా తన్నుతాను అర్థం చేసుకోవడం నేర్చుకొన్నాడు. అతడు గొప్ప నేర్పు సంపాదించేకొద్దీ, తన జీవితాన్ని స్థిరపరచేందుకు కొన్ని హక్కులు, స్వేచ్ఛలు కావాలని అనుకొన్నాడు.

వాటిని వ్రాతమూలంగా పెట్టి, తనపై అధికారుల అంగీకారం సంపాదించాలని తలచాడు.

హక్కులను స్వేచ్ఛలను వ్రాయడమేగాక, వానికి అంగీకారమును సంపాదించడంలో 1215 వ సంవత్సరములో జాన్ రాజు సంతకం చేసిన ఇంగ్లీషువారి మేగ్నాకార్టా అనే మహా స్వాతంత్ర్య పత్రం ముఖ్యమైనది. దీని ప్రకారం ఇంగ్లాండు ప్రజానీకం తమ తమ ఆస్తిపాస్తుల విషయంలో విచారణకు అనుమతిని సంపాదించుకొన్నారు.

అమెరికా వారి స్వాతంత్ర్య ప్రకటన 1776 సం॥ జూలై నెల 4 వ తేదీన ఫిలడల్ఫియాలో ఆమోదించబడింది. అమెరికావారి పూర్వుల మానవత్వ హక్కులు ధిక్కరింపబడ్డాయని తెలిసికొన్నారు. అందుకనే వారు ఉపోద్ఘాతంలో "మానవులందరు సమానంగానే సృష్టించబడ్డారు. వారి సృష్టికర్తచేత కొన్ని అరికట్టరాని హక్కులను పొందారు. వానిలో జీవించడం, స్వేచ్ఛ, సంతోషానికి పాటుబడడం ముఖ్యమైనవి. ఈ సత్యాన్ని మేము నిజమని భావిస్తాము. ఈ హక్కులను రక్షించడానికి ప్రజలచేత అధికారాన్ని పొంది ప్రభుత్వాలు ఏర్పడ్డాయి అని" చెప్పినారు.

అమెరికావారి స్వాతంత్ర్యప్రకటనతో ఫ్రాన్సు దేశస్థుని మానవుల హక్కుల ప్రకటన వెలువడింది. అది

మొదట 1789 వ సం॥లో ఫ్రెంచి విప్లవ సందర్భంలో ఆదేశపు జాతీయ ప్రజారాజ్య రాజ్యాంగంచేత ఆమోదింపబడింది. తర్వాత 1793 వ సం॥లో ఆదేశపు సమానత్వం, మాటలాడేందుకు స్వేచ్ఛ, మతప్రార్థనకు స్వేచ్ఛ, కొన్ని అరెస్టు సందర్భాలలోను, హత్యా విషయాలలోను రక్షణ ఇటువంటి పవిత్రమైన హక్కులను అవి గుర్తించింది.

వివిధకాలాల్లో గొప్పవారిచే చదువబడిన ఈ ప్రకటనలనుండి అమెరికావారు వారిస్వీయ చరిత్రలోనే అబ్రహాంలింకన్ చేసిన ఇంకొక ప్రకటనకు వచ్చారు. ఆయన ప్రకటన స్వాతంత్ర్య రచయితల గురించి మాట్లాడుతూ ఇలా చెప్పాడు: "వారు అప్పుడు నిజంగా ప్రజలు అనే స్వేచ్ఛను అనుభవిస్తుండినారనే అబద్ధాన్ని చెప్పలేదు. మరియు వారు వెంటనే అట్టి స్వేచ్ఛను కలిగిస్తామని అనలేదు. వాస్తవంగా వారికి అట్టి వరాన్ని ప్రసాదించే శక్తి లేకపోయింది. వారు ఆ హక్కులను ప్రకటిస్తే, పరిస్థితులు బాగుపడగానే వానిని అధికారంలోకి తేవచ్చునని అనుకున్నారు" అని చెప్పాడు.

ఈనాడు ఐక్యరాజ్యాలవారైన మనంకూడా ప్రపంచం మొత్తానికి చేయాలనుకొన్నదికూడా లింకన్ చెప్పినట్లే. లింకను మానవజాతి హక్కులనుగురించి మాట్లాడుతూ చాలాదూరం పోయాడు. అతడు అమెరికా సంయుక్త

రాష్ట్రాల అధ్యక్షుడు కాకపూర్వం, ఒక బానిసను చూచి, తనకు బానిసవృత్తినిగూర్చి ఏదైనాచేసేదానికి అధికారం రానేవస్తే దానిని రూపుమాపగలనని చెప్పాడట.

1863 వ సం॥లో అంతర్యుద్ధ సమయంలో క్రొత్త సంవత్సరాదినాడు అతను బానిస విమోచన ప్రకటన చేశాడు. దానిప్రకారం కొన్ని రాష్ట్రాలలోని సేవకులు స్వేచ్ఛగా ఉండవచ్చునని తెలిసింది. లింకన్ యొక్క గెట్టిస్ బర్గ్ ఉపన్యాసం అందరికీ జ్ఞాపకముంటుంది. అందులో అతడు చెప్పాడు: 87 సం॥లకుముందు మన తండ్రులు ఈ ఖండంలోనికి ఒక క్రొత్త జాతిని తెచ్చారు. స్వేచ్ఛా జీవులై మానవులందరు సృష్టింపబడ్డారనే మాటను నమ్మినారు——అది నేడు జీవించియున్న మనకు——అంత ఉన్నతంగా ముందుకుపోయి ఇక్కడ పోరాడినవారు, పూర్తిచేయని కార్యానికై మనం ఆ ఆదర్శాన్ని పాటించాలి. భగవంతుని క్రిందనున్న ఈజాతి ఒక క్రొత్త స్వేచ్ఛను పొందుతుంది. ప్రజలచేత ప్రజలకుగాను జరుపబడే ప్రజారాజ్యం ప్రపంచంలో నశించరాదు—అని ఆయన చెప్పాడు.

అమెరికా సంయుక్తరాష్ట్రాల రాజ్యాంగ చట్టానికి అంతర్యుద్ధఫలితంగా 13, 14, 15 వ సవరణలు చేర్చబడ్డాయి. ఇది రాజ్య—పాలన చట్టము. ఈ మూడు సవరణలు చేర్చుటకుముందు, ఆ రాజ్యాంగ చట్టము

వ్రాయబడి 1788 లో ఆమోదింపబడినప్పుడు 12 చక్కని సవరణలు చేర్చబడినవి. వానిలో మొదటిది సాధారణంగా అమెరికా దేశపు హక్కుల పత్రమని పిలువబడుతుంది. అవి రాజ్యాంగ చట్టంలో 1791 లో చేర్చబడ్డాయి. అవి హెబియస్ కార్పస్ హక్కును ప్రసాదిస్తాయి. ఆ హక్కుమూలంగా నేరస్థుడు కాని వానిని విచారణ లేక జైళ్లలో వేయరాదు. అవి ఒక తప్పు చేసినప్పుడు, ఆ సమయంలో తప్పుకానిది తిరిగి యెన్నటికినీ తప్పుకాదని నిరూపిస్తాయి. దీనిని ఎక్సుఫోస్టు ఫాక్టోలా అంటారు. అవి విచారణ న్యాయంగా జరగాలని బలపరుస్తాయి. అవి మతవిషయాలలోను, మాటలలోను, పత్రికల విషయంలోను, జ్యూరీ సమేతముగ విచారణ జరుపుటలోను, కష్టముల నివారణకై ప్రభుత్వాన్ని ప్రార్థించడంలోను స్వేచ్ఛ నిస్తాయి.

13 వ సవరణ చేర్చబడినప్పుడు, బానిసతనము, నిర్బంధ సేవకావృత్తి—తప్పుకు శిక్షగా తప్ప—లేకుండా చేయబడ్డాయి. 14 వ సవరణ మేరకు చట్టప్రకారము, చట్టసమానత్వము తప్పి ఒకని జీవితానికి, స్వేచ్ఛకు, ఆస్తికి భంగము కలిగించకూడదు. 15 వ, సవరణ మేరకు, తెగ, రంగు, మునుపటి బానిసవృత్తి వీనిని పాటించి

సంయుక్తరాష్ట్రాలుకాని, ఏ రాష్ట్రముకాని ఒక పౌరుని యొక్క ఓటుహక్కును నిరాకరించరాదు.

1919 వ సంవత్సరంలో చేర్చబడిన 19 వ సవరణ ప్రకారము, స్త్రీ, పురుష భేదము పాటించి అమెరికా సంయుక్త రాష్ట్రాలు గాని, మరి ఇతరరాష్ట్రంగాని పౌరుని యొక్క ఓటు హక్కులను నిరాకరించరాదు. ఈ సవరణను స్త్రీల అభిప్రాయ సవరణ అంటారు.

అమెరికాలో సంయుక్త రాజ్యాంగ చట్టంతో బాటు సంయుక్త రాష్ట్రాలలోని రాష్ట్రాలు, తమ రాజ్యాంగ చట్టాల ప్రకారం ప్రజలహక్కును, స్వేచ్ఛలను పలు విధాలుగా రక్షిస్తాయి.

దీనినిబట్టి అమెరికా సంయుక్త రాష్ట్రాలలో మానవ జాతి హక్కుల రక్షణ చాలాపెద్దది. దురదృష్ట వశాత్తుగా చాలమంది ప్రజలు, తమకు ఈ హక్కులు ఇవ్వబడ్డట్లు భావిస్తారు.

చట్టంలో విషయాలను వ్రాయడం ఒక విషయమని, ప్రజలు తమ దిన జీవితంతో ఆ చట్టప్రకారం నడుచు కోవడం వేరొక విషయమని మనము తెలుసుకోవాలి. అమెరికాలోని హక్కులన్నీ ప్రతి మానవుని జీవితంలోనూ లేవు. సంయుక్త రాష్ట్రాలలో కూడ మానవజాతి యొక్క ప్రముఖ హక్కులు, స్వేచ్ఛలు అనుభవించడం కష్టమని కొన్ని విషయాలు చెబుతాయి. ఇతర దేశాల

లాగే వారికికూడా కావలసినన్ని హక్కులు, స్వేచ్ఛలు ఇస్తాము. నిజంగా వారు ఇతర దేశాలకన్నా ఎక్కువగా ఇస్తారు. అవి సకల ప్రపంచానికి ఆదర్శాలుగా ఉంటాయి.

1945 వ సం॥లో శాన్‌ఫ్రాన్‌సిస్కోలో ఐక్యరాజ్య సమితి పత్రం తయారుచేయబడినప్పుడు ప్రతినిధులు ఆ పత్రంలో మానవజాతి హక్కులకై చాలా ఉదాహరణ ముల నిచ్చారు. 55 వ విషయం ఇలా చెబుతుంది: ఈ ఐక్యరాజ్య సంఘం తెగ, భాష, తమ విషయాలను పాటించకుండా మానవజాతి హక్కులను గుర్తించి ప్రపంచ గౌరవాన్ని పెంపొందిస్తూంది. 56 వ విషయం ఇలా చెబుతుంది: ఈ ఐక్యరాజ్య సమితిలోని అందరు సభ్యులు ఈ పనులు నెరవేర్చడానికై అందరమూ ఐక్య, స్వీయ కృషి చేస్తామని హామీ యిస్తున్నాము.

మత స్వాతంత్ర్యలాంటి కొన్ని ప్రత్యేక హక్కులను తరతరాలుగా చాలామంది ప్రజలు ఆమోదించారు. అంటే నీవుగాని, నేనుగాని, మనం గాని ఏది నిజమని నమ్మలేమో దాన్ని అనుసరింప వచ్చును. మన తీర్మానాలతో జోక్యం కలిగించుకోడానికి ఎవరికిని ఏలాంటి హక్కూలేదు.

ఒకటిగాచేరి బాహాటంగా, శాంతియుతంగా తమ నమ్మకాలనుగూర్చి చర్చించుకోవచ్చునసే ఇతర ప్రజా హక్కులు కూడా ఉన్నాయి. ఎవ్వరికిగాని నిర్బంధించే

అధికారం లేదు. కానీ, ప్రజలకు వారి ప్రభుత్వాలు పాటించే విధానాలను విమర్శించడానికి, వాటితో సహకరించడానికి హక్కు ఉంది. ఇట్టి హక్కులను కాపాడడానికి చాలా దేశాలు చాలాకాలం క్రిందటనే అంగీకరించాయి.

తమ ప్రభుత్వంలో పాల్గొనడానికి ప్రజలకు హక్కు ఉంది. నాజీ ప్రభుత్వానికి మరి యితర నిరంకుశ ప్రభుత్వాలకు మనం ఎదురు తిరగడానికి కారణమేమంటే, శాంతియుతంగా నైనా తమ అసమ్మతిని తెలియజేయడానికి అచ్చటి ప్రజలకు హక్కు లేదు.

ఇప్పటి ప్రజలు మునుపటి హక్కులతోబాటు కొన్ని సాంఘిక, ఆర్థికహక్కులున్నాయని గుర్తించారు. ఎందుకంటే, నీవు ఆకలితో చూస్తూంటే నీవు ప్రభుత్వంలో పాల్గొనే హక్కును లెక్కచేయక పోవచ్చును. ఇట్టి హక్కులవల్ల నిరంకుశ ప్రభుత్వములకు మేలు కలుగుతుంది.

అట్లాంటిక్ ఈ ప్రణాళిక తెల్పిన నాల్గువిధముల స్వాతంత్ర్యములలో అన్ని విధములైన మానవజాతి హక్కులు కలిసియున్నవి. విరోధుల దండయాత్రనుండి స్వేచ్ఛ, ఆకలినుండి స్వేచ్ఛ, ప్రార్థనాస్వేచ్ఛ, భావ ప్రకటన స్వేచ్ఛ ఈ నాలుగు స్వేచ్ఛలు—ఉన్నట్లయితే తర్వాత నీవు అన్ని హక్కులపత్రాల ఆశయాలను నెరవేర్చినవాడవు అవుతావు.

ఈ పత్రములు నీకు, నాకు, మన నడవడికకు మార్గ దర్శికత్వం వహిస్తాయి. దినదినము మన పనుల సరిదిద్దు కొనుటకై మనం వాటిని ఉపయోగించుకోవాలి. మనం అవమానాలను సహిస్తున్నామని అనుకోక జాతి, మత, వర్ణ భేదాలు లేక, సకలజనుల ప్రధానమైన హక్కు-లను, స్వేచ్ఛలను గుర్తించి, వర్తింపజేసుకొనే సత్యంతో నిలచిన, ప్రజాప్రభుత్వ సూత్రాలను, ఆదర్శాన్ని జీవితంలో పాటిస్తున్నామని దృఢంగా గుర్తించవలెను.



| | మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA101145 |
| పుస్తకం పేరు | అందరూ బతకాలి ఇండియా |
| తారీఖు | 25-10-24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 251 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | B, vi, viii, 238, BcI |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Aswini |
| పేజీలు విడదీసినది | Soumya |
| స్కాన్ చేసినది | Navya |
| పరీక్ష చేసినది | THASIN |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | good |